# శ్రీ హనుమద్భాగవతము

## పూర్వార్థము





రచయిత :

"పౌరాణిక రత్న"

" మహాపురాణాంధ్రీకరణచణ "

శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త

# శ్రీ హనుమద్భాగవతము

## పూర్వార్థము





రచయిత:

"పౌరాణిక రత్న"

"మహాపురాణాంధ్రీకరణచణ"

శ్రీ మట్టుపల్లి శివ సుబ్బారాయ గుప్త

# శ్రీ హనుమద్భాగవతము

## పూర్వార్థము





రచయిత :

"పౌరాణిక రత్న"

" మహాపురాణాంధ్రీకరణచణ "

శ్రీ మట్టుపల్లి శివసుబ్బారాయ గుప్త

# శ్రీ హనుమద్భాగవతము

పూర్వార్థము



"ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ స్వాహా"



రచయిత

పౌరాణిక రత్న

మహాపురాణాంధ్రీకరణచణ

శ్రీ మట్టుపల్లి శివ సుబ్బరాయ గుప్త

ప్రకాశకులు

శ్రీ మట్టుపల్లి జగన్నాథం

 [మూల్యము : రూ 15-00

ప్రథమ ముద్రణము
ప్రతులు 1000
మకర సంక్రాంతి
శ్రీ రక్తాక్షి పుష్యబహుళ సప్తమి
13-1-1985



# SREE HANUMAD BHAGAVATHAM

By

POURANIKA RATNA
MAHA PURANA ANDHRIKARANACHENA
SREE MATTUPALLI SIVA SUBBARAYA GUPTA
Kothapet, GUNTUR-522001. Phone: 23827

పుస్తకములు దొరకు ప్రదేశము
శివా యింజనీరింగ్ కంపెని
స్టేషన్ రోడ్, గుంటూరు-522001.
ఫోన్ 20827

# ఓం శ్రీ సాయిరాం గురుదేవ దత్త

ఓం శ్రీ దత్తాత్రేయ పరంధామము

ధర్మము — అసతో మా సద్గమయ

మోక్షము — స్వస్వరూపానుసంధానము



అర్థము — అనిష్టనివృత్తి

ఓం శ్రీ విశ్వపరబ్రహ్మణే నమః

కామము — "కామయే దుఃఖ తప్తానాం - ప్రాణినా ఆర్తి నాశనమ్"

ఓం శాంతిః శాంతిః శాంతిః

# విన్నపము

ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త

ఓం దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి
తన్నో రామః ప్రచోదయాత్ ।
ఓం ఆంజనేయాయ విద్మహే వాయుపుత్రాయ ధీమహి
తన్నో హనుమాన్ ప్రచోదయాత్ ॥

'శ్రీహనుమద్భాగవతము' రుద్రావతారుడు, శక్త్యావతారుడు, వైష్ణవావతారుడు నగు శ్రీ ఆంజనేయుని పావన చరితము, మరియు ఆపరమపురుషుని దివ్యచరణారవిందములను భజించి, ధ్యానించి, ఆరాధనమొనరించి తరించిన భాగవతోత్తముల చరితములు, ఆయన, ఈయవనిపై నొనర్చించిన దివ్యలీలావిశేషములు కలసిన త్రివేణి సంగమము.

భావుకులైన భక్తులు ఈదివ్య పావన గ్రంథమును పఠించి ధన్యతనొంది భవసాగరమును తరించి భగవద్ధామమును చేరగలరని నేను అభిలషించుచున్నాను.

సాక్షాత్తు త్రిగుణాతీతుడైన భగవంతుడే భగవద్భక్తుని రూపమున దివినుండి భువికి దిగివచ్చి భాగవతాచరణము గావించి అవనిలోగల భగవద్భక్తులందరికి ఆదర్శమై నిలిచినాడు. అట్టి హనుమదీశ్వరుని దివ్యచరితమును, హనుమద్భక్తుల చరితములను, శ్రీ ఆంజనేయుని దివ్యలీలావిశేషములను అనేక

పురాణ సంహితలనుండి సేకరించి నాజన్మను చరితార్థమొన రించుకొనుచున్నాను.

మాతృదేవోభవ, పితృదేవోభవ అను సూక్తుల ననుస రించి భగవత్సేవాంకితమైన నాకీ జన్మము నిచ్చిన నాతల్లి దండ్రులగు శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మ శ్రీ జగన్నాథము గార్ల కాజన్మాంతము నేను ఋణపడియున్నాను. దానశీలురు, జ్ఞానవైరాగ్య సంపన్నులు, పుణ్యమూర్తులు భగవద్భక్తి యుతులు నగు వారియనుగ్రహవిశేషముచే నాకీమహత్కార్య మొనరించు అదృష్టము లభించిన దనిచెప్పుట కెంతయో గర్వపడుచున్నాను.

'శ్రీ హనుమద్భాగవతము' (పూర్వార్థము) శ్రీహను మజ్జయంతీమహోత్సవ సందర్భముగా పావనచరితులు, మహా త్ములు శ్రీ దత్తాత్రేయ గురుపరంపరలోనివారు అగు శ్రీ విశ్వయోగి విశ్వంజీద్వారమున ఆవిష్కరింపబడుట నా పూర్వజన్మ సుకృతఫలము. శ్రీ విశ్వంజీగారికి నా సాష్టాంగ ప్రణామముల నర్పించుచున్నాను. ఆసభకు అధ్యక్షత వహిం చిన అభినవపోతన కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి నా హృదయపూర్వక పాదాభివందనములు.

నాకు ఆశీస్సులు పలికిన మహామండలేశ్వర. భాగవత చరితవ్యాస శ్రీరామ్ శరణ్ కుందుర్తి వెంకట నరసయ్యగారికి పాదాభివందనములు. నన్ను సభకు పరిచయ మొనరించిన విద్వాన్ శ్రీ నాగినేని కనకయ్యగారికి నా హృదయపూర్వక

అభివాదములు. అన్నిటికిమించి నాటి సభను ఆయత్తపరచిన శ్రీ విశ్వమందిర సభ్యులకు అనేక వందనము లర్పించుచున్నాను.

శ్రీ శంకరాచార్యులు, నృసింహ పురాణము, శైవ ధర్మము, శ్రీమద్భాగవతము, మున్నగు బహు గ్రంధకర్తలు విశ్వహిందు పరిషత్ సంస్కృత భాషా ప్రచారకులు నగు శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు ఈ గ్రంధ ముద్రణము నందును, భాషా విషయమునందును, ననేక విధములగు సలహాలనిచ్చుచు నెంతగానో తోడ్పడిరి. వారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు, వందనములు.

ఈ మహాగ్రంధమును సకాలములో ముద్రించి యిచ్చిన రవి ప్రెస్ అధిపతులకు నాహృదపూర్వక ధన్యవాదములు.

ఏమైనను "ప్రమదో ధీమతామపి" యను నార్యోక్తి యనుభవమైన దగుటవలన దీనియందెన్నియో ప్రమాదము లుండితీరును కాన సహృదయులగు పాఠకులు దయతో మన్నింపప్రార్ధన.

శేషం ఓం శ్రీ విశ్వ సాయికృష్ణ స్మరణం.

ఇట్లు

శ్రీ హనుమజ్జయింతి — భక్తజన దాసానుదాసుడు

1988 — సుజన విధేయుడు

శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

## శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త గారిచే

## రచింపబడి ప్రచురింపబడిన గ్రంథములు :

1. శ్రీ బ్రహ్మవైవర్త మహాపురాణసార సంగ్రహము
   శ్రీ హనుమజ్జయంతి 31-5-78
2. శ్రీ మదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణముల మొదటి భాగము బ్రహ్మఖండము
   శ్రీకృష్ణ జయంతి 26-8-78
3. రెండవభాగము ప్రకృతిఖండము
   ఉగాది 29-3-79
4. మూడవభాగము గణపతిఖండము
   శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి జయంతి 6-5-79
5. నాల్గవభాగము శ్రీకృష్ణ జన్మఖండము పూర్వార్థము
   శ్రీ వ్యాసపూర్ణిమ 27-7-80
6. ఐదవభాగము శ్రీకృష్ణ జన్మఖండము ఉత్తరార్థము
   శ్రీకృష్ణ జన్మాష్టమి 7-2-82
7. శ్రీ రాఘవేంద్ర కల్పవృక్షము
   పుష్యార్క పుణ్యకాలము 7-2-82

8. శ్రీ రాఘవేంద్ర స్తోత్రకవచ మంత్రమంజరి
పుష్యార్క పుణ్యకాలము 7-2-82

9. శ్రీ హనుమద్భాగవతము పూర్వార్థము
శ్రీ హనుమజ్జయంతి 10-12-88

## రాబోవు గ్రంథములు

10. శ్రీ హనుమద్భాగవతము ఉత్తరార్థము

11. ఓం శ్రీగురు విశ్వ సందర్శనము

12. శ్రీ ధర్మార్థ ప్రకాశము

# విన్నపము

ప్రస్తుత గ్రంథము శ్రీ హనుమత్ భాగవతము పూర్వార్థ భాగము. అనగా యింకను ఉత్తరార్థ భాగము వెలువడవలసి యున్నది. దానిని త్వరలోనే మీ ముందు వుంచగలము.

ఉత్తరార్థ భాగములో యుద్ధకాండ, శ్రీ ఆంజనేయుని దివ్య లీలా విశేషములు, శ్రీ హనుమత్ గీత, శ్రీ ఆంజనేయుని నవ విధ రూపములలో అర్చించి తరించిన భాగవతోత్తముల పావన చరితములు, శ్రీ హనుమదీశ్వరుని మంత్ర, తంత్ర, స్తోత్ర కవచ పూజా విధానములు పొందుపరచబడినవి. త్వరలోనే యీ గ్రంథము సమర్పించుకొనగలము.

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త

# ఆశీస్సులు

అమృత హృదయుడు, సరళ స్వభావుడు పరమ భాగవతోత్తముడు అయిన శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త అంతరంగములో చిందులేసిన భక్తి భావోత్తేజ విస్ఫూర్తికి నిదర్శనమే యీ "శ్రీ హనుమద్భాగవతము". మాట మాటలో మనుష్యుల మనస్సులను మత్తులో ముంచే మంత్ర పూరితమైన కవితాశక్తితో, మృదుమధురమైన తేట తేట తెలుగు పదముల కలయికతో సామాన్య మానవుని నుండి అసామాన్య జ్ఞానివరకు అర్థం చేసుకునే విధంలో అర్థమయేటట్లు అంతరార్థాలతో కూడిన యోగశాస్త్రంలోని రహస్యాతి రహస్య విశేషార్థాలతో సుందరమైన ఒక సుందరకాండగా దీనిని తీర్చిదిద్దారు. మహాకవి కరుణశ్రీ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి మహాభక్తులు శ్రీ రామశరణ్ కుందుర్తి వెంకట నరసయ్యగార్ల వంటి మహనీయుల ప్రశంసలందుకునే రీతిలో దీనిని మలచగలటం శ్రీ గుప్తాగారి భక్తిపూరితమైన జ్ఞానానికి నిదర్శనం.

ఈయన జ్ఞానము భక్తిపూరితమైనది. ఈయన పాండిత్యము ప్రేమపూరితమైనది. లేశమైనా అహంకార మమకారములు లేని సౌజన్యశీలి, శాంతమూర్తి సుబ్బరాయగుప్త బ్రహ్మవైవర్తపురాణము (6 భాగములు), రాఘవేంద్ర కల్ప

వృక్షము, రాఘవేంద్ర స్తోత్ర కవచ మంత్రమంజరి మొదలైన మహత్తర గ్రంథములను తెలుగు పాఠకలోకానికి అందించిన ఘనత ఈ రచయితది. ముఖ్యంగా బ్రహ్మవైవర్త పురాణం మంత్రతంత్ర శాస్త్ర రహస్యాతి రహస్యములను ఉదాత్తముగా ప్రకటింపజేసినది. నిజముగా భగవానునియొక్క దివ్యాశ్శీస్సులతో ఏదో మానవతాతీత దివ్యశక్తి ప్రేరణతో శ్రీ గుప్త ఈ రచనా వ్యాసంగమును నిర్వర్తించుచున్నట్లుగా కన్పట్టుచున్నది. ఆ నిదానము, ఆ గాంభీర్యము, ఆ వినయము, ఆ ఉదాత్తత ఆ నమ్రత ఆ భక్తితత్పరత ఆ స్నేహశీలత అన్నిటికీమించిన ఆ స్థితప్రజ్ఞత్వస్థితి బహు ప్రసంశనీయము. భగవంతుని ఆశీస్సులు పొందుటకు కావలసిన లక్షణములన్నియు పుణికి పుచ్చుకొన్న ప్రేమమూర్తి శ్రీ గుప్తాజీ. వీరి కలం నుంచి యింకా యింకా ఎన్నో ఎన్నో మహత్తర గ్రంథ రాజములు వెలువడాలని ఆశిస్తూ ఆకాంక్షిస్తూ ఆశీర్వదిస్తూ ఈ శ్రీ హనుమద్భాగవత మను గ్రంథమును ఆవిష్కరిస్తున్నాను పరమ భక్తాగ్రగణ్యులకు అందరికీ దీనిని దివ్యకానుకగా అందిస్తున్నాను.

హనుమజ్జయంతి
విశ్వమందిరం
గుంటూరు

విశ్వయోగి విశ్వంజీ
(విశ్వం మాస్టారు)

## శ్రీ హనుమత్ భాగవత గ్రంథావిష్కరణ సందర్భమున
## శ్రీ విశ్వయోగి విశ్వంజీ సందేశము

# దేహమే దేవాలయం, హృదయమే దైవపీఠం

భగవంతుడికి పేరు లేదు. ప్రతి జీవిలో వున్న శక్తియే భగవంతుడు. ఆ శక్తని మనం పూజిస్తున్నాం. ప్రార్థిస్తున్నాం.

అతడు సర్వవ్యాపకుడు. అంతటా నిండి యున్నవాడు 16 కళలు గల ప్రేమావతారంగా శ్రీకృష్ణుని రూపంలో ద్వాపరయుగంలో అవతరించాడు. ఇపుడు మరల ఆ ప్రేమమూర్తి శ్రీ సత్యసాయి రూపంలో దర్శనమిస్తున్నాడు. ఆ సాయి భగవానుడు ప్రేమ తత్వాన్ని పంచిపెడుతూ ప్రపంచ వ్యాప్తంగా మేధావులను ఆకర్షిస్తున్నాడు.

ఈ యావత్ ప్రపంచంలో దివ్యశక్తి ఒకటి నిండి వున్నది. అదే అన్నిటినీ తివ్పుతూ వున్నది. అది సర్వశక్తివంతమైనది, సర్వత్రావున్నది, సర్వమూ తానే అయినది. అదే శక్తి ప్రతి ప్రాణిలోను, ప్రతి మనిషిలోను వున్నది. అదే శక్తి పరమాణువులోగూడ వున్నది

ఈ సత్యాన్ని మానవుడు గ్రహించక భగవంతుడు ఎక్కడో దూరంగా వున్నాడని పొరబాటు పడుతున్నాడు. తనతోటి మానవుల్లో దేవుడున్నాడని గ్రహించక మనిషిని మనిషిగా ప్రేమించలేక పోతున్నాడు. పైగా ద్వేషిస్తున్నాడు. ఇలా ద్వేషించమని సనాతన భారతీయ ధర్మం ఎక్కడా చెప్పలేదు.

విశ్వరూప శందర్శనం అంటే ఏమిటి? ఒక అరడుగల మనిషి తన రూపాన్ని పెంచుకొని భూమి యావత్తు ఆక్రమించి ఆకాశమంత ఎత్తు ఎదిగితే అది విశ్వరూపమా? కానేకాదు. పరమాణువులో ఏదైతే వున్నదో యావత్తు సృష్టిలో అదే వున్నది. అణువులో న్యూక్లియస్ అనేది వున్నది.

దాని చుట్టూ ఎలక్ట్రానులు ప్రోటానులు అత్యంత వేగంగా పరిభ్రమిస్తూ వుంటాయి. ఇదే విధంగా సూర్యగోళం చుట్టూ అనేక గ్రహాలు అత్యంత వేగంగా తిరుగుతున్నాయి. విశ్వకుటుంబం యొక్క సూక్ష్మ రూపమే పరమాణువు. అనేక పరమాణువుల కలయిక వలననే పదార్థము ఏర్పడింది. యావత్తు విశ్వమూ ఇలాగే వున్నది. నీవు అనగా ఆ పరమాణువులలోని దివ్యశక్తియే. నీలో అంతా వున్నది. అంతటిలో నీవున్నావు. నీవు లేని ప్రదేశం లేదు. ఈ సత్యాన్ని గ్రహించండి.

సృష్టిలో ఎక్కడైనా అలజడి ఏర్పడితే అది ప్రతి అణువులోనూ ప్రతిబింబిస్తుంది. పరమాణువును శాంతింపచేస్తే ప్రకృతిలోని అలజడి తగ్గిపోతుంది. ఆలా అణువులలో అలజడిని శాంతపరచడానికే ఏకాదశ రుద్రాభిషేకాలూ శివలింగానికి అర్చనలూ చేస్తాము. శివలింగం విశ్వానికి సంకేతం.

కుటుంబం సనాతన ధర్మానికి మూలస్తంభం. వ్యక్తి వికాసం ద్వారా కుటుంబ వికాసం సాధించాలి. కుటుంబముల సమైక్య కృషి ద్వారా సమాజ వికాసాన్ని సాధించడమే సనాతన ధర్మ లక్ష్యం. ఈనాడు వ్యక్తులు కులాల మతాల పేరుతో పరస్పరం దూరమవుతున్నారు. వీళ్ళను ఆధ్యాత్మికత ద్వారా సంఘటితం చేయాలి. ఏకమనస్కులుగా తీర్చి దిద్దాలి. తద్వారా సమాజ వికాసాన్ని సాధించాలి. ఆధ్యాత్మికత వల్ల సమాజానికి మేలుకలగాలి.

దేహమే దేవాలయం. హృదయమే దైవ పీఠం. ఈ పూజలు, ఆరాధనలు ఎందుకు ? నీలోవున్న దైవ శక్తిని వికసింప చేసుకోడానికే గాని భగవంతుడు ఏదో చేసి పెడతాడని కాదు. నీలోవున్న చైతన్య శక్తిని పరమాత్మ శక్తితో అను సంధానం చేసుకున్నట్లయితే నీవే ఒక శక్తి కేంద్రం అయిపోతావు.

ప్రతి మానవునిలోను ఇచ్ఛాశక్తి హృదయంలోను, జ్ఞాన శక్తి మెదడులోను, క్రియాశక్తి వెన్నుపూసలోను వున్నాయి. ఇవియే విష్ణు, బ్రహ్మ, మహేశ్వరులు. వీటి సమైక్య స్థితియే దత్తాత్రేయుడు. ప్రతి వ్యక్తి అత్రి అనసూయలను ఆరాధించి - అనగా త్రిగుణములకు అతీతుడై అసూయను విడినాడినట్లయితే భగవచ్ఛక్తి మనకు దత్తమవుతుంది. ఇదియే దత్తాత్రేయుని స్థితిని పొందడం.

సాధకుడు యోగముద్వారా హృద్గ్రంధి, చిత్గ్రంధి, ఆత్మ గ్రంధులను ఛేదిస్తాడు, పిదప షట్చక్రములద్వారా తన మానసిక శక్తిని సామాన్య మనస్సు నుండి దివ్య మనస్సుతో అను సంధానం చేస్తాడు. విశ్వమంతటా వ్యాపించి యున్న దివ్య విద్యుదయస్కాంత శక్తితో శాశ్వత సంబంధం ఏర్పరచుకుంటాడు. ఇదియే యోగము. యోగి ఒక శక్తివలయంగా, ఒక శక్తి స్వరూపంగా మారి, అనంత విశ్వంలోని అఖండ శక్తిని తనలోకి ప్రవహింప చేసుకొని సమాజ శ్రేయస్సుకు ఆశక్తిని వినియోగం చేస్తాడు.

అయితే విగ్రహారాధన ఎందుకు? అని అడుగుతారు. దీనికి వివేకానందుడొక ఉదాహరణ చెప్పాడు. మనం పాలు త్రాగాలంటే కప్పులో పోసుకొని త్రాగుతాం. కప్పో, గ్లాసో లేకుండా నేరుగా త్రాగే వీలులేదు. ఆ గ్లాసు లాంటిదే విగ్రహం. త్రాగిన పిదప దాచిపెట్టి మరో కరికిస్తాం. పగుల గొట్టం. దాని ఉపయోగం చెపుతాము.

భగవత్ శక్తి విద్యుచ్ఛక్తి లాంటిది. దానిని నేరుగా చూడలేము. మన అవసరాన్ని బట్టి రేడియో, ట్యూబులైటు, ఫ్యాను, ఎయిర్‌కండిషనరు వగైరా పరికరాల ద్వారా దాన్ని ఉపయోగంలోకి తెచ్చుకుంటాం. అలాగే విగ్రహం అనే ఒక పరిమిత రూపంతో దైవశక్తిని అవగాహన చేసుకుంటున్నాము.

మహిమలు అనేవి వున్నాయా? అని అడుగుతారు. మహిమలనేవి

లేవు. జాగ్రత్తగా వినండి. మనవూళ్ళో డా॥ ఎం. గోపాలకృష్ణ రోజూ కొన్ని వందల అపరేషన్లు చేస్తారు. ఆ విధంగా కోటానుకోట్ల జనులు చేయలేరు. చేయలేనివారికి అలా చేయడం ఒక వింతగాను, Miracleగాను అనిపిస్తుంది. ఆపరేషన్లు చేయడం నేర్చుకున్న డాక్టర్లకు అది సహజంగా కనిపిస్తుంది. అలాగే భగవత్ శక్తివలన డాక్టరు ఆపరేషన్లు చేస్తున్నాడు; ఇంజనీరు అద్భుత భవన నిర్మాణం చేస్తున్నారు; మరొకరు మరొకటి చేస్తున్నారు. మన దృష్టికి అది మహిమ, వాళ్ళ దృష్టికి అది సహజం. అలాగే యోగులు నీటిమీద నడుస్తారు. అది వారికి సహజం. మన మనస్సుకు అలాంటి శిక్షణయిస్తే మనమూ అలా చేయవచ్చు.

మంత్రం మనిషిని మహాశక్తి కేంద్రంగా చేస్తుంది. "ఓం శ్రీసాయిరామ్ గురుదేవదత్త" అనే మంత్రాన్ని అందరూ నియమం ప్రకారం ఉపాసించండి. లేదా మీకిష్టమైన మరొకమంత్రము జపం చేయండి.

ఎక్కడ సమైక్యత ఉన్నదో అక్కడ దైవీశక్తి వుంటుంది. అందరం కలిసి పనిచేయాలి. మీలోని బలహీనతలను తొలగించుకోవాలి. పరులకు ఎలా ఉపయోగపడతామా అనే ఆలోచన చేయాలి. భారతదేశం 2001 సంవత్సరం నాటికి ప్రపంచానికిమార్గ దర్శకత్వం వహిస్తుంది. అందుకు తగిన సంసిద్ధతను ఆధ్యాత్మికంగా, భౌతికంగా మన సమాజం సాధించాలి

సత్ప్రవర్తన, సదాలోచన లేకుండా పూజల వలన ప్రయోజనం లేదు. మనుషులలోనే దేవుడున్నాడు. ఈ జగత్తు మిధ్యకాదు. ఇది పరబ్రహ్మ స్వరూపం. దీన్ని నిర్లక్ష్యం చేయకండి. సమాజానికి ఉపయోగపడే రీతిలో జీవితాలను తీర్చిదిద్దుకోండి.

విశ్వయోగి విశ్వంజీ

శ్రీ హనుమత్ జయంతి - 10-5-88

గోగినేని కనకయ్య విద్వాన్
ప్రెసిడెంట్
తాడికొండ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషన్స్
శివ లైను, లక్ష్మీపురం
గుంటూరు-522 007

పౌరాణికరత్న, మహాపురాణ ఆంధ్రీకరణ చణ బిరుదాంకితులు శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారు మాకత్యంత సన్నిహితులలో ఒకరు. వారు సౌజన్యము, వినయము, సజ్జనత్వము కలిగి భారతీయ సంస్కృత సంప్రదాయాలపై అనన్యప్రేమ కలిగి దాని వ్యాప్తికి కృషిచేస్తున్న పండితులు. వారు రచించిన శ్రీ హనుమద్భాగవతమును ఆదరాభిమానములతో నాకు అందజేసిరి. చూచి మహదానందపడితిని.

ఒకవైపు జీవితకథ చిత్రరూపముగా కన్పించే ఈ హనుమద్భాగవతము మరొకవైపు పరిశోధన కృతిగా భాసించింది. వివిధపురాణాలను సంహితలను పరిశీలించి అవసరమైన అన్ని విషయములను సేకరించి రచించిన గ్రంథమిది. కల్పభేదముచేతనో, యుగభేదంచేతనో విభిన్నాంశాలుగానున్న శ్రీ హనుమజ్జీవితరహస్యాల నన్నింటిని ఏర్చి కూర్చి కుప్పపోశారు. శ్రీ గుప్తగారు వైవిధ్యంగల వృత్తాంతాలను

తనకు నచ్చినదానిని మాత్రమే తీసికొని కథారచన చేయకుండా వివిధ వృత్తాంతాలను అదే సందర్భములో వివరించి చూపటం ఈ కృతి-కృతకర్త లోని విశిష్టత.

యో వై ఏకాదశో రుద్రో
హనుమాన్ స మహాకపిః ।
అవతీర్ణ స్సహాయార్థం
విష్ణో రమిత తేజసః

అని ఆంజనేయుడు రుద్రునియొక్క 11 వ రూపమే అని పురాణాలు ప్రతిపాదిస్తున్నాయి. భక్తి, జ్ఞాన కర్మ మార్గాల త్రివేణి సంగమంవంటిది. శ్రీ మారుతాత్మజుని మహనీయ చరిత్ర. తన స్వామియైన శ్రీరామునిపై అనన్యభక్తి. తత్కర్మ సాధనలో దీక్షా తనంతర్లీనమైన జ్ఞానము కలిగి భౌతిక ఆధ్యాత్మిక జీవితాలకు ఒక సేతవుగా వున్నది ఈ హనుమత్ కథ. భౌతిక జీవన విధానములో ఆధ్యాత్మికతత్వాన్ని సమన్వయింప చేసుకోవడం ఈరోజులలో చాలామందికి తెలియడంలేదు. అవి రెండు వేరువేరు మార్గాలని భ్రమపడి శక్తియుక్తులను కోల్పోయి ఆనందానికి దూరమగుచున్నారు. అటువంటి సమయములో శ్రీ గుప్తగారివంటి మహనీయులు ఇటువంటి గ్రంథాలను రచించి లోకానికి అందించడం చీకటిదారులలో నడిచేవారికి దివ్వెలు అందించడమే. చక్కని భాష-భావాన్ని

సూటిగా తెలియజేయగల శైలి. ఈ గ్రంథాన్ని అలంకరిస్తూన్నాయి. పండితులనేగాక సామాన్య పాఠకులకు కూడా అర్థమయ్యేటట్లు ఉన్న ఈ గ్రంథశైలి పుస్తకాన్ని చదవడం ప్రారంబిస్తే పూర్తి చేసేవరకు ఆపకుండా చదివించుకొనే శక్తి కలిగియున్నది. పౌరాణికరత్న శ్రీ గుప్తగారు ఇటువంటి గ్రంథాలు ఇంకా రచించి పాఠకులకు ఆనందాన్ని కల్గించాలని ఆశిస్తూ వారికి అవసరమైన భక్తి, శక్తి యుక్తులను వారికి వారి కుటుంబ సభ్యులకు సర్వేశ్వర స్వరూపులైన శ్రీసాయిరామ హనుమంతులు సదా సర్వథా కల్గించి అనుగ్రహించగలరని ప్రార్థించుచున్నాను.

భవదీయుడు

కనకయ్య

# పరిచయము

బుద్ధిర్బలం యశో ధైర్యం నిర్భయత్వమరోగతా ।
సుదార్ఢ్యం వాక్స్ఫురత్వం చ హనూమత్స్మరణాద్భవేత్ ॥

ప్రస్తుతము సమస్త జగత్తులో అశాంతి మేఘములు దట్టముగ వ్యాపించియున్నవి. మానవత్వము మిగుల తీవ్రముగ హ్రాసమగుచున్నది. కపటము, వంచన, రాగద్వేషములు, విరోధము. హింసా కలహములు, వ్యభిచారము, ఇంద్రియ లౌల్యము, కామోప భోగ పరాయణత్వము, స్వార్థము, అసత్యము మున్నగు అసురీ ప్రవృత్తులు మానవ సమాజమున చాల వేగముగ విస్తరించుచున్నవి. నేడు మనము భౌతిక బలమునే నిజమైన బలముగా తలంచి దాని ద్వారానే మనకు వికాసము కలుగునను స్వప్నమును చూచుచున్నాము. భగవత్కృపను, భగవచ్ఛక్తిని మరచితిమి. తత్ఫలితముగా వికాసమునకు బదులు భయంకర వినాశము, ఉన్నతికి బదులుగా ఆత్మ పతనము జరుగుచున్నది. ఇంతేగాదు నేడు సర్వతోముఖమగు ఈ పతనమె ఉత్థానమనుపేరుతో పిలువ బడుచున్నది. ఈ ఉత్థానమునకు బదులుగ దుఃఖము, అశాంతి, కలహము మున్నగునవి లభించుచున్నవి.

ఇహలోకము లేదా పరలోకమునకు సంబంధించిన దారాపుత్రులు, సంపదలు, భోగములు, సుఖములు, కీర్తి,

గౌరవము మున్నగు భోగ్య పదార్థములన్నియు నశ్వరములు, క్షణ భంగురములు. అందువలన అవి జీవునకు స్థిరమైన సుఖమును ఎప్పుడును ఈయజాలవు. ఇట్టి పరిస్థితిలో వానిని పొందుటకై మానవ జీవితముయొక్క అమూల్య సమయమును వెచ్చించుట బుద్ధిమంతుల లక్షణము కాదు. వాస్తవములో మానవ జీవితముయొక్క ఏకైకమగు పరమోద్దేశ్యము భగవత్ప్రాప్తి లేదా భగవత్ప్రేమ ప్రాప్తి. అందువలన ఆత్మ శ్రేయస్సును గోరు మానవుడు నిష్కామ భావనతో భగవంతుని ఆరాధింపవలెను. భగవత్కథలను, తద్భక్త చరితమును పఠన శ్రవణముల చేయవలెను. దాని వలన భగవత్కృప కలుగును, మానవ జీవితము సార్థకమగును.

భగవంతునియొక్క, ఆయన భక్తులయొక్క చరిత్రలు, గుణములు, ప్రభావములు మున్నగునవి దివ్యములు, అలౌకికములు, అనన్తములు, అపారములు. వానిని తెలిసికొనుట ఎవరివలన కానిపని. అయినను తమతమ భావముల ననుసరించి ఉపాసకులు పరమ శ్రేయస్కరములగు గుణములను కీర్తింపవలెను. ఈ రూపమున ఈ శ్రీహనుమద్భాగవత రచన ఒక లఘు ప్రయత్నము.

ఈ హనుమద్భాగవత గ్రంథమును రచించిన వారు 'పౌరాణికరత్న', 'మహాపురాణాంధ్రీకరణచణ' శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారు. ఆయన నాకు బాల్యమిత్రుడు,

ఆప్తమిత్రుడు, సన్మిత్రుడు, మాతాపితృ భక్తుడు, భగవద్భక్తుడు, వ్యాపారదక్షుడు. ఈయన ఎన్నియో ఉత్తమోత్తమ గ్రంథములను ఇంతకు పూర్వము రచించియున్నాడు.

ప్రకృత గ్రంథమును పూర్వోత్తర భాగద్వయాత్మకముగ రచింపవలెనని రచయిత ఉద్దేశ్యము. తదనుసారముగ పూర్వార్థము మూడువందల పుటలతో పూర్తియైనది. దీనిలో హనుమంతుని తల్లిదండ్రుల వృత్తాంతము, హనుమంతుని ఆవిర్భావము, ఆయన అవతారములు, విద్యాభ్యాసము, శ్రీరాముని దర్శించుట, సుగ్రీవునకు సచివునిగా నుండుట సీతాన్వేషణార్థమై బయలు వెడలుట, లంకాప్రవేశము, లంకాదహనము, శ్రీరామునకు సీతాదేవి వృత్తాంతమును చెప్పుట, సేతుబంధనము, రామ రావణ యుద్ధము, సంజీవనిని తెచ్చుట మున్నగు విషయములు గలవు. పై విషయములను రచయిత మధురముగను, మంజులముగను, సరళముగను, సుబోధకముగను రచించియున్నాడు.

మనకు శ్రీమద్భాగవతము అనగా విష్ణు భాగవతము, దేవీ భాగవతము, గర్గ భాగవతము మున్నగునవి భాగవతము పేరుతో లభించుచున్నవి. వానిలో ఆయా దేవతల చరిత్ర, కర్మలు, వారి భక్తుల చరిత మున్నగు విషయము లుండును. ఈ హనుమద్భాగవతమున హనుమంతుని చరిత్ర, ఆయన చేసిన కార్యములు ఎన్నియో వివరింపబడినవి. హనుమంతుని

కొందరు భగవంతునిగను, కొందరు భగవద్భక్తునిగను ఆరాధించుచుందురు. ఎవరెట్లు భావించినను హనుమంతుడు మాత్రము సర్వులకు ఆరాధ్యుడే.

భారతదేశమున ఆసేతు శీతాచలము హనుమంతుడు వివిధరీతుల పూజింపబడుచున్నాడు. పిల్లలు, పెద్దలు అందరు ఆరాధించుచున్నారు. ఆయన తన్ను ఆరాధించు భక్తులకు కొంగుబంగారమైయున్నాడు. అట్టి ఆంజనేయుని చరిత్రమును శ్రీ శివసుబ్బరాయగుప్త వ్రాయుట ముదావహమైన విషయము. శ్రీహనుమద్భాగవతము ఉత్తరార్థములో బహుశః హనుమంతుని భక్తుల చరిత్ర, హనుమన్మంత్ర స్తోత్రక వచాదులు ఉండవచ్చును. దానిని గూడ శ్రీ గుప్త త్వరలోనే ముద్రించి భక్తులకు అందింపగలరని ఆశించుచున్నాను. ఆయనకు శ్రీరామభక్త హనుమానుడు ఆయురారోగ్యములను బుద్ధిబలమును ఒసంగుగాక!

ఇట్లు,
భక్తపాదరజరేణువు
జన్నాభట్ల వాసుదేవశాస్త్రి

# శ్రీ పంచకము

— కరుణశ్రీ

ఏ మహాతేజస్వి శ్రీమన్మహాదేవు
 నంశతో జగతిపై నవతరించె
ఏ మహాత్ముడు మింటి కెగసి ఫలభ్రాంతి
 నుదయార్క బింబంబు నొడిసి పట్టె
ఏ మహామహుడు లంఘించె గోష్పదమట్లు
 శతయోజనము మహాసాగరంబు
ఏ మహాబలశాలి సౌమిత్రి ప్రాణాలు
 కాపాడె సంజీవకరణి దెచ్చి
అతడు శ్రీరామచంద్ర పాదారవింద
వందనానందు: డంజనానందనుండు
స్వీయ భక్తుని "శివసుబ్బరాయగుప్త"
నేలుగాత ! నిరామయశ్రీ లొసంగి !!

ఉమానాథ రమానాథౌ
రక్షతాం పరిరక్షతామ్ !!
జయం దత్వా శ్రియం దత్వా
సుబ్బరాయం సుధీమణిమ్॥

గోలోక ప్రాజ్య సామ్రాజ్య
లీలా కల్యాణ కౌస్తుభః ।
రాధికావల్లభః పాయాత్
సుబ్బరాయ సుధీమణిమ్ ॥

వైశ్య వంశక్షీరవార్ధి చంద్రుండవై
మించి సత్కళ లభ్యసించినావు
రాఘవేంద్రస్వామి రమణీయ సంస్తోత్ర
"కల్పవృక్షము" నెలకొల్పినావు
తీయతీయని తేటతెల్గులో "బ్రహ్మవై
వర్త పురాణంబు" వ్రాసినావు
అద్భుతంబగు "హనుమద్భాగవతకృతి"
ముద్దుముద్దుగ తీర్చిదిద్దినావు
"మట్టుపల్లి"యింటి మాణిక్య దీపమై
వెలుగు కృతుల పుటలు విప్పినావు
నీదు కృతులు మాననీయంబులై, మేలు
చేయు ప్రజకు సుబ్బరాయసుకవి ! !

పారాశర్య పవిత్రగోత్రభవుడై, భక్తిప్రపుల్లాత్ముడై,
సారాచారవిచార ధీరమతియై, సాహిత్య సౌభాగ్య శ్రీ
లారత్నాకరమానసుం డగు మహాలక్ష్మీ జగన్నాథపూ
జారాజీవము సుబ్బరాట్కవి సమస్తశ్రేయముల్
గాంచుతన్ ! ! !

# రచయిత పరిచయము

| | | |
|---|---|---|
| పేరు | : | మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త |
| జననము | : | విక్రమనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమి<br>ది. 8-10-1940<br>(దుర్గాష్టమీ పర్వదినము) |
| జన్మస్థలము | : | గుంటూరు |
| గోత్రము | : | పారాశర్య |
| జననీజనకులు | : | శ్రీమతి వేంకట మహాలక్ష్మమ్మ<br>శ్రీ జగన్నాథం |
| విద్యాభ్యాసము | : | 1. గుంటూరు హిందూకళాశాల ఉన్నత పాఠశాల<br>2. హిందూకళాశాలలో బికాం. |
| బిరుదములు | : | "పౌరాణిక రత్న"<br>'మహాపురాణాంధ్రీకరణచణ' |
| వృత్తి | : | శివా ఇంజనీరింగ్ కంపెనీ<br>గుంటూరు, నరసరావుపేట<br>యమ్. జగన్నాథం అండ్<br>జె. యస్. ప్రసాద్<br>హిందూస్తాన్ పెట్రోలియం<br>డీలర్స్, చిలకలూరిపేట |

అభిరుచులు : గ్రంథరచన, సత్సంగము

ఇతర భాషా పరిచయము : సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు

ఇతర విశేషములు : 1) అనేక సభలలో ఆధ్యాత్మిక విషయములనుగూర్చి ప్రసంగించుట

2) రెండున్నర సంవత్సరముల కాలము శ్రీ శ్రీ శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థాన ప్రాంగణము (గుంటూరు)లో శ్రీ మదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమును ప్రవచనము చేసిరి.

కుటుంబము :-

ధర్మపత్ని : శ్రీమతి శ్యామసుందరి

పుత్రులు : యదువీర రంగధామ్ M. Com.

ధర్మపత్ని : సత్యసునీత

శ్రీనివాస శరణ్ M. Com.

ధర్మపత్ని : శ్రీపద్మావతి

నాగమల్లిఖార్జునరావు M. Com., M. B. A.

శ్రీ రస్తు  శుభమస్తు



శ్రీ హనుమద్భాగవతము పూర్వభాగమును

ముద్రించుటకు గాను శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన

ముల వారు కడు ఉదారముతో భూరి విరాళము

నొసంగి తోడ్పడిరి. ఈ ఉపకృతికి

కృతజ్ఞుడను.

పౌరాణిక రత్న

మహాపురాణాంధ్రీకరణచణ

శ్రీ మట్టుపల్లి శివ సుబ్బరాయ గుప్త

# విషయ సూచిక



# చిత్రసూచిక



పుటలు




. B. KHANNA & Co.,
10, Devaraja Mudali St.,
MADRAS-600003.


Sri Kothandarama

No. 620



శ్రీ రామాయ నమః

# శ్రీ హనుమద్భాగవతము

## మంగళాచరణము

యన్మాయావశవర్తి విశ్వమఖిలం
బ్రహ్మాదిదేవాసురా
యత్సత్త్వాదమృషైవ భాతి సకలం
రజ్జౌ యథాహేర్భ్రమః ।
యత్పాదప్లవమేకమేవ హి భవా-
మ్భోధేస్తితీర్షావతాం
వన్దేఽహం తమశేషకారణపరం ।
రామాఖ్యమీశం హరిమ్ ॥

ఎవరిమాయకు సమస్తవిశ్వము బ్రహ్మాదిదేవతలు అసురులు వశమై ఉన్నారో, ఎవరియునికిచే రజ్జువునందు సర్పభ్రమవలె ఈ దృశ్యమానజగత్తు అంతయు సత్యముగా తోచుచున్నదో, ఎవరిచరణములె భవసాగరమును తరింపగోరువారికి ఏకైక మగు నావమై యున్నవో, ఆకారణము లన్నింటికంటె పరమైన అనగా సర్వకారణములకు కారణమైనవాడు, అందఱికంటె శ్రేష్ఠుడైనవాడు, రాము డనిచెప్పబడువాడు నగు శ్రీహరిభగవానునకు నేను నమస్కరించుచున్నాను.

శ్రీమత్ప్రసన్నశశిపన్నగభూషణాయ
శైలేన్ద్రజావదనచుమ్బితలోచనాయ ।
కైలాసమన్దరమహేన్ద్రనికేతనాయ
లోకత్రయార్తిహరణాయ నమః శివాయ ॥

శోభాయమానము నిర్మలము నగు చంద్రకళ సర్పము ఆభరణములుగా గలవాడు, గిరిరాజకుమారి యగు పార్వతిచే చుంబింపబడిన (ముద్దిడుకొనబడిన) నేత్రములు గలవాడు, కైలాసగిరియందు మహేంద్రగిరియందు నివసించువాడు, లోకత్రయముయొక్క దుఃఖమును పోగొట్టువాడు నగు శంకరునకు నమస్కరించుచున్నాను.

సీతారామపదామ్బుజే మధుపవద్-
యన్మానసం లీయతే ।
సీతారామగుణావలీ నిశి దివా
యజ్జిహ్వయా పీయతే ।
సీతారామవిచిత్రరూపమనిశం
యచ్చక్షుషోర్భూషణం
సీతారామసునామధామ నిరతం ।
తం మారుతిం సమ్భజే ॥

శ్రీ సీతారాముల పాదపద్మములయందు తుమ్మెదవలె లగ్నమైన మనస్సుగలవాడు, సీతారాముల గుణావళిని రేయింబవళ్ళు తనజిహ్వచే పానముచేయుచున్నవాడు, సీతారాముల విచిత్రరూపమును ఎల్లప్పుడు తననేత్రములకు ఆభూషణముగా జేసికొనినవాడు, సీతారాముల సునామమునకు నిలయమైనవాడు నగు ఆ మారుతిని నిరంతరము చక్కగ భజించుచున్నాను.

# కేసరి పూర్వజన్మ వృత్తాంతము

యక్షలోకములో మహాయక్షుడను చక్రవర్తి కలడు. అతడు పరమశివభక్తుడు, కుబేరునకు చెలికాడు. సకలసంపద లున్నను అతనికి సంతానములేదు. కుబేరుని ఆదేశానుసారముగ మహాయక్షుడు పరమశివునిగురించి చిరకాలము తపమాచరించెను. భక్తునియనన్యతపమునకు ప్రసన్నుడై ఆశుతోషుడైన శంకరుడు సతీదేవిసహితముగ సాక్షాత్కరించెను.

పరమకళ్యాణమూర్తులైన అయ్యాదిదంపతులను గాంచి మహాయక్షుడు పరమానందభరితుడై అనేకవిధముల స్తుతించెను. అభీష్టవరము నర్థింపు మనిపరమశివుడు పలుకగా యక్షేశ్వరుడు పరమసౌందర్యరూపు లగు సతీశంకరులను గాంచి మీరు నాకు పుత్రసంతానముగా కలుగవలెనని అర్థించెను. అందులకు సతీశివులు సమ్మతించి యిర్వురు ఏకరూపులై అవతరించెదమని వర మొసంగిరి. కింపురుషవర్షములో మహావానరుడైన కేసరిగా జన్మింపుమని మహాయక్షుని ఆదేశించి వారు అంతర్హితులైరి. ఆమహాయక్షుడే వానరేశ్వరుడైన కేసరిగా జన్మించెను.

వానరులు కింపురుషలోకవాసులు. వారు ఆనంద బ్రహ్మోపాసకులు. కేనోపనిషత్తులో సచ్చిదానంద బ్రహ్మమును 'వన' అను నామముతో ఉపాసించువర్ణనము కలదు.

'వనే భవం వానమ్, వానం రాతి ఇతి వానరః ।'

సచ్చిదానందబ్రహ్మములో గల ఆనందరసమును 'వాన' మని కీర్తింతురు. ఆయానందరసమును ఆస్వాదన మొనరించు వారిని వానరు లందురు.

## అంజన పూర్వజన్మ వృత్తాంతము

దేవలోకములో పుంజికస్థల యను అప్సరస కలదు. ఆమె సర్వగుణసంపన్నురాలు. పరమశివుని యవతార మైన దుర్వాసమహర్షి అమరావతి కరుదెంచెను. దేవేంద్రుడు పుంజికస్థలను ఆమహాపురుషునిసపర్యలకు నియమించెను. ఆమె భక్తిభావముతో మహర్షి నారాధించి ఆయన యనుగ్రహము నకు పాత్రురాలయ్యెను. వర మర్థింపు మని మహర్షి పలికెను. అందులకు పుంజికస్థల దేవతలకు సహితము అగమ్యమైన పరమపదమును అర్థించెను. అపుడు దుర్వాసమహర్షి శ్రీహరి హర మహామంత్రము నుపదేశించి తప మొనరింపవలసినదిగా ఆమెనాదేశించెను.

పుంజికస్థల మందాకినీనదీతీరములో శ్రీహరిహర మంత్రోపాసన మొనరింపసాగెను. ఆమె యొనరించిన తపము నకు శ్రీ ఆదిపరాశక్తి, శ్రీమన్నారాయణుడు, శ్రీసదా శివుడు ప్రసన్నులై సాక్షాత్కరించిరి. పుంజికస్థల పరమానంద భరితురాలై జననమరణజరావ్యాధిరహితము, పరమానంద నిలయము నైన పరమపదము నర్థించెను. అపుడు శ్రీహరిహరు

లిట్లు పల్కిరి. "దేవాంగనా! నీకు పుణ్యశేషము కలదు నీ వా పుణ్యము ననుభవించుటకు మరల వానరాంగనగా జన్మింప వలెను, తదనంతరము నీకు జన్మరాహిత్యము సిద్ధింపగలదు. కాన వేరొకవరము నర్థింపుము". పుంజికస్థల సంతానాభిలాష కలదియై ఇట్లు పలికెను "భక్తజనమందారులారా! నాకు మీవంటిపుత్రుని ప్రసాదింపు" డని కోరెను. అందులకు వారు "అప్సరసా! మావంటివారు మరియొకరులేరు. కావున మేమే ఏకరూపులమై నీకు కుమారునిగా అవతరించెదము. వానరాధీశ్వరు డగు కుంజరుడు పరమభక్తాగ్రేసరుడు. నీవు వానికి పుత్రికగా జన్మింపు"మని ఆదేశించి అంతర్హితులైరి.

బుద్ధిమంతుడు, పరమభాగవతోత్తముడు వానరరాజు నగు కుంజరునకు పుత్రికగా పుంజికస్థల జన్మించెను. ఆమె సాటిలేని సౌందర్యము కలది. ఆమె యందముతో సాటివచ్చు స్త్రీయెవ్వరును లేరు. మూడులోకములలో సౌందర్యగుణములలో ప్రసిద్ధిచెందిన ఆకుంజరునిపుత్రికపేరు **అంజన.** అంజన గురించి మరియొకచరిత్ర కలదు. కల్పభేదముననుసరించి ఈప్రసంగము లన్నియు సత్యములే యని గ్రహింపవలెను.

## అంజనాదేవి

స్వర్గాధిపతియు శచీపతియు నగు నింద్రునికడ నున్న రూపగుణ సంపన్నలగు అచ్చరలలో పుంజికస్థల యనునామె

మిక్కిలి ప్రసిద్ధి చెందిన అప్సరస. ఆమె మిగుల సౌందర్యవతి, చంచలస్వభావము గలది. ఒకమారామె తపస్సంపన్నుడగు నొక ఋషిని జూచి పరిహసించినది.

ఋషి యోర్వజాలకపోయెను. క్రుద్ధుడై ఆయన 'వానర స్త్రీవలె చిలిపిచేష్టలుచేయు నీవు వానరస్త్రీవి అగుదువుగాక' యనిశపించెను.

ఋషిశాపమును వినినంతనె పుంజికస్థల కంపింపసాగినది. వెంటనే యామె ఋషిచరణములపై బడి, చేతులజోడించి దయ జూపవలసినదిగా ప్రార్థింపసాగినది.

సహజముగనే దయాస్వభావుడగు నాఋషి దయార్ద్ర చిత్తుడై యిట్లుపలికెను-'నావాక్కు అసత్యము కాజాలదు. నీవు వానరస్త్రీవి కాకతప్పదు, కాని నీవు ఇష్టానుసారముగ రూప మును ధరింపగలవు. ఇష్టము వచ్చినపుడు వానరస్త్రీవి, మానవ స్త్రీవి కాగలవు

పరమరూపవతి యగు నాపుంజికస్థల ఋషిశాపముచే వానరరాజు, బుద్ధిమంతుడు నగు కుంజరునకు పుత్రికగా జన్మిం చినది. ఆమె సాటిలేని సౌందర్యము గలది. ఆమె యందముతో సాటివచ్చు స్త్రీ యీభూమిలో నెవ్వరును లేరు. మూడులోక ములలో ప్రసిద్ధిచెందిన ఆకుంజరునిపుత్రికపేరు 'అంజన'.

లావణ్యవతి యగు అంజనకు వీరవరుడు, వానరరాజు నగు 'కేసరి'యనువానితో వివాహము జరిగినది. కేసరినివాసము

కాంచనగిరి(సుమేరుపర్వతము).సర్వసౌకర్యములకు నిలయ మగు నీపర్వతముపై అంజన తనభర్తతో సర్వసౌఖ్యముల ననుభవించుచుండెను. వీరు డగు కేసరి రూపవతి యగు తనభార్య అంజనను మిక్కుటముగా ప్రేమించుచుండెను. అంజన కూడ ఎల్లప్పుడు ప్రాణారాధ్యు డగు తనభర్తయం దమిత మగు ననురాగమును జూపుచుండెడిది. ఇట్లు సుఖముగ నెన్నియో దినములు గడచినవి; కాని వారి కెట్టి సంతతియు కలుగలేదు.

## హనుమంతుని పుట్టుకకు సంబంధించిన విభిన్నములగు గాథలు

హనుమానునిపుట్టుకకు సంబంధించిన గాథలు శాస్త్రములలో ననేకవిధములుగ నున్నవి. అవి సంక్షేపముగ క్రింద వివరింపబడుచున్నవి.

కరుణామయమూర్తియు,ప్రేమమూర్తియు నగు భగవానునిలీల మధురము,మనోహరము,అద్భుతము. దానిని వినుటచేత స్మరించుటచేత మునులు ముగ్ధులగుచుందురు.భక్తుల కది పరమనిధి, కాని యాలీల రహస్యమయముగ నుండును. పరమ క్షేమంకర మగు నాభగవల్లీలారహస్యమును దేవతలుగాని, యోగీంద్రు లగు మునులుగాని యెఱుంగజాలరు. అట్టివారే ఆశ్చర్యచకితులై మౌనముగ నున్న కామాదిదోషగ్రస్తుల మగు మనవంటి సాంసారికమనుష్యుల కేమి తెలియును?కరుణా

మయుడగు నా పరమాత్మునిలీలలను గానముచేసిన మనకు సర్వశుభములు గలుగుననుటలో నెట్టిసందేహము లేదు.

దేవదానవుల కమృతమును బంచుటకు విష్ణుభగవానుడు మోహినీరూపమును ధరించెను. ఇది విని కర్పూరగౌరు డగు నీలకంఠుడు ఆశ్చర్యచకితుడయ్యెను. భగవానుని స్త్రీవేష మెట్లుండెననగా, ఆ ప్రకాముడగు శంకరభగవానునకు తనప్రాణా రాధ్యు డగు విష్ణుదేవునివిశిష్టరూపమును, విశిష్టలీలను దర్శింప వలయు ననెడికోరిక జనించెను.

గంగాధరుడు పార్వతీదేవితో పాటు క్షీరాబ్ధితటమునకు జేరి స్తుతింపగా లక్ష్మీపతి ప్రత్యక్షమయ్యెను. దేవాధిదేవు డగు మహాదేవు డిట్లు విన్నవించుకొనెను-'ప్రభూ! నేను నీమత్స్యాద్యవతారస్వరూపముల నన్నింటిని దర్శించితిని, కాని అమృతమును బంచునపుడు నీవు పరమలావణ్యమయ మగు స్త్రీవేషమును ధరించితివి. ఆయవతారస్వరూపమును నేను దర్శింపలేకపోయితిని. దేవదానవులమోహమునకు గారణమైన ఆనీరూపమును దయయుంచి నాకొక్కమారు జూపింపుము."

'దేవాధిదేవుడ వగు మహాదేవా! నీవు యోగుల కుపాసింపదగినవాడవు, మన్మథుని దగ్ధముచేసినవాడవు. అట్టి నీవు స్త్రీయవతారమును జూడనేల? నీ దృష్టిలో నది విశిష్ట మైనది కాదని లక్ష్మీపతి నవ్వుచు బదులుచెప్పెను.

'దేవా! ఆయవతారస్వరూపమును దర్శింపకుండగ నుండజాలను. దయయుంచి నాకా మోహినీరూపమును జూపింపు'మని పార్వతీపతి పలికెను.

'అస్తు యగుగాక!' యని మహావిష్ణువు క్లుప్తముగ సమాధానమిచ్చి అంతర్ధానమయ్యెను. ఆసమయమున నచట క్షీరోదధి లేదు, నీలమేఘశరీరియు, శంఖచక్రగదాపద్మధారియు నగు లక్ష్మీపతిగూడ లేకుండెను. ఆప్రదేశమున మనోహర మగు పర్వతములు, సుందర మగు వనము నుండెను. పార్వతీ సహితుడై శంకరు డావనమధ్యమున నుండెను.

అడవియంతటు వసంతశోభ వ్యాపించియుండెను. వృక్షములు క్రొత్తచిగుళ్ళతో జూడ ముచ్చటగొలుపుచుండెను. అంతట పుష్పములు విరబూసియుండెను. సువాసనలను వెదజల్లునాపూవులపై తుమ్మెదలు మూగుచుండెను. కోకిలలు 'కుహూ, కుహూ' యని ధ్వనించుచుండెను. చల్లనిపిల్లగాలికి కోమలము లగు లతలు, పుష్పములు మెల్లమెల్లగ నటునిటు ఊగుచుండెను. అంతటను ఋతురాజుయొక్క సామ్రాజ్యము వ్యాప్తమైనట్లుండెను, ఒకవిధ మగు మాదకత్వము సర్వ ప్రాణులలోను కనబడసాగినది.

యోగుల కుపాస్యుడగు త్రినేత్రుడు కొలదిదూరములో లతలమాటున నుండి బంతియాడుచున్న ఒకరూపవతి యగు స్త్రీని చూచెను.

కామారి ధైర్యవిహీనుడు కాజొచ్చెను, తన్నుతాను మఱచెను. నిర్నిమేషదృష్టితో బంతియాడుచున్న ఆమోహినిని వీక్షించుచుండెను.

వెంటనే ఒకవాయుతరంగము వచ్చినది, ఆగాలికి అసామాన్యసౌందర్యశాలిని యగు మోహినివస్త్రము జారినది, ఆమె వివస్త్రయయ్యెను. సిగ్గుచే కుంచించుకొని మోహిని లతలమాటున దాగుకొనుటకు ప్రయత్నింపసాగినది. చితాభస్మము నలదుకొను కామారియొక్క మిగిలిన ధైర్యముగూడ తొలగినది. ఆయన మహామహిమామయి యగు పార్వతీదేవి యెదుటనే లజ్జను విడచి యున్మత్తునివలె మోహినివెంట పరుగిడెను.

యోగీశ్వరు డగు శంకరుడు తనవెంట వచ్చుట చూచి మోహిని చిఱునవ్వునవ్వి తీగలమాటున తనశరీరమును దాచుకొనుటకు పరుగిడెను. భూతభావనుడు మోహినివెంట పరుగెత్తుచుండెను. ఆమె ముందు పరుగెత్తుచుండెను. నీలకంఠుడు తనస్థితినే మఱచెను. ఆయన పరుగిడి మోహినిహస్తమును స్పృశించెను.

ప్రజ్వలిత మగు అగ్నియందు ఆజ్యాహుతి పడెను, కాని మోహిని తనచేతిని విడిపించుకొని పారిపోయెను. ఆమె స్పర్శచే నుత్తేజితు డగు కామారి యైన ఈశ్వరుడు పూర్తిగ స్పృహలేనివాడయ్యెను. వనములు, పర్వతములు, ఋష్యాశ్రమములు, దేవలోకములు మున్నగు ప్రదేశములగుండా శంకరుడు మోహినివెంట పరుగిడుచుండెను. పార్వతీదేవి, శివగణములు, సురగణములు, ఋషులు మున్నగువారందఱు ఆశ్చర్య

చకితులై ఈ దృశ్యమును జూచుచుండిరి, కాని మౌనముగ నుండిరి. అసఫల మగు కామము క్రోధరూపమున బరిణతి చెందును. మఱల ప్రళయంకరు డగు శంకరునిరోషానలమున కాహుతి యెవరు కానున్నారో కదా! అందఱు స్తబ్ధులై యుండిరి.

చివరకు యోగిరా జగు శివుని రేతస్సు స్ఖలితమయ్యెను. పిమ్మట తనస్థితి యెట్టిదో గ్రహించెను. విశ్వనాథుడు వెంటనే రెండుచేతులను జోడించి, తలవంచి 'ప్రభూ! నీలీల అగమ్యము. నీమాయ నధిగమించుట యసంభవ'మనిపలికెను

తనపరమప్రభువుయొక్క-లీల అగమ్యము అనిర్వచనీయము నని తెలిసికొని శంకరభగవానుడు ఆయనను స్తుతించుచుండెను. ఇంతలో వనమాలాధారియు చతుర్భుజుడు నగు విష్ణువు ప్రత్యక్షమయ్యెను. ఉమావల్లభు డగు శివునినిష్ఠను విశ్వాస మును ప్రశంసించి యంతర్ధానమయ్యెను. పరమపితయు, కర్పూరగౌరుడు నగు శంకరుడు గూడ పార్వతీదేవితో భగవా నునిగుణములను గానముచేయుచు కైలాసమునకు వెడలెను.

శంకరుని యమోఘవీర్యము వ్యర్థ మెట్లగును? ఆవీర్య మును రామకార్యసిద్ధికై ప్రయోగింపవలయు ననెడి దృష్టితో శంకరుడు సప్తర్షులను ప్రేరేపించెను. వా రా వీర్యమును ఆకు దొప్పలో నుంచిరి. సమయమునను సరించి దానిని కేసరిభార్య

యగు అంజనయొక్క చెవిగుండా ఆమె గర్భములోనికి ప్రవేశ పెట్టిరి. తత్ఫలముగ హనుమానుడు ప్రకటుడయ్యెను.*

◆ ◆ ◆ ◆

బహుకాలము భర్తతో సుఖముగ జీవితమును గడుపుచున్న అంజన కెట్టి సంతానము గలుగలేదు. ఆకారణమున నామె మిగుల కఠోరముగ తపస్సుచేయ నారంభించెను.అట్లు తపమాచరించుచున్న అంజనను జూచి మతంగమహాముని సమీపించి 'అంజనా దేవీ!నీ వింత కఠోరతపము నేలచేయుచున్నా' వనియడిగెను.

అంజన మహామునిచరణములకు నమస్కరించి వినయముతో నిట్లు ప్రత్యుత్తరమిచ్చినది - 'మునీశ్వరా ! కేసరి యను వానర శ్రేష్ఠుడు నాతండ్రినుండి నన్నుకోరెను.ఆయన నన్ను కేసరికి సమర్పించెను. నేను నాభర్తతోగూడి పెక్కుదినములనుండి సుఖముగ జీవితమును గడుపుచున్నాను. కాని నేటివరకు నా కెట్టి సంతానము కలుగలేదు.అందువలన నేను కిష్కింధలో ననేక వ్రతములను.ఉపవాసములను,తపస్సును చేసితిని. కాని నాకు పుత్రసంతానము కలుగలేదు.అందుచే దుఃఖితురాలనై మిక్కిలి తపస్సుచేయ నారంభించితిని. విప్రవరా! దయయుంచి మీరు నాకు యశస్వి యగు పుత్రుడు లభించు నుపాయము చెప్పుడు'.

తపోధను డగు మతంగమహాముని అంజనతో నిట్లు పలికెను-'నీవు వృషభాచలము (వేంకటాచలము) నకు వెడలి

---

*శివపురాణము, రుద్రసంహిత 20 అధ్యాయము.

భగవానుడగు వేంకటేశ్వరుని చరణములకు నమస్కరింపుము. ఆయన భుక్తిముక్తిదాయకుడు. పిమ్మట అచటినుండి కొలది దూరమున నున్న ఆకాశగంగ యను తీర్థమునకు వెడలి స్నానముచేయుము, దానిలోని నీటిని త్రాగి వాయుదేవుని ప్రసన్నునిగ జేసికొనుము. దానివలన దేవతలకు, రాక్షసులకు, మనుష్యులకు నజేయుడు, అస్త్రశస్త్రముల కవధ్యుడు నగు పుత్రుడు నీకు జన్మింపగలడు'.

అంజనాదేవి మహాముని చరణములకు నమస్కరించి వృషభాచలమునకు జేరినది. వేంకటేశ్వరుని పాదపద్మములకు భక్తితో నమస్కరించినది. పిమ్మట ఆమె 'అకాశగంగ' యను తీర్థమున స్నానమాచరించి, పరమపావన మగు దానిజలమును త్రాగినది. దానితటముపై గూర్చుండి తీర్థమువైపు దిరిగి వాయుదేవుని ప్రసన్నతకై మిగుల సంయమముతో తపస్సుచేయ నారంభించెను. శారీరకకష్టములనుగూడ లెక్కచేయక శ్రద్ధా విశ్వాసములతోను, ధైర్యముతోను అఖండ మగు తపస్సు చేయసాగినది.

సూర్యభగవానుడు మేషరాశిలో నుండెను. ఆనాడు చిత్రానక్షత్రయుక్త మగు పూర్ణిమాతిథి. అంజనాదేవి చేయు కఠోరతపస్సునకు సంతసించి వాయుదేవుడు ప్రత్యక్షమై 'అంజనాదేవీ! నీతపస్సునకు నేను మిక్కిలి ప్రసన్నుడనైతిని. అభీష్టమగు వర మడుగుము, తప్పక నెరవేర్తు' ననిపలికెను.

ప్రత్యక్షమైన వాయుదేవుని దర్శించి, ప్రసన్నురాలైన అంజన ఆయనచరణములకు నమస్కరించి 'మహాత్మా! నాకు ఉత్తమపుత్రుడు జన్మించు వరము నిమ్మని తన మనోరథమును వెల్లడిచేసినది.

సంతుష్టుడగు వాయుదేవుడు 'సుముఖీ! నేనే నీకు పుత్రుడనై నీనామమును విశ్వవిఖ్యాతముచేయుదు' నని పలికెను.

వరమును బొందిన అంజనయొక్క సంతోషమునకు మేరలేకపోయెను. తనప్రియురాలునకు వరము లభించిన దను వార్తను విని కపిరాజగు కేసరిగూడ మిగుల ప్రసన్నుడయ్యెను. *

◆ ◆ ◆ ◆

ఒకనాటి విషయము. పరమలావణ్యవతియు, విశాలలోచనయు నగు అంజన చక్కగ నలంకరించుకొనియుండెను. ఆమెయొక్కసుందరశరీరముపై పచ్చనివస్త్రము శోభిల్లుచుండెను. చీరయంచు ఎఱుపురంగు. ఆమె వివిధము లగు సుగంధపుష్పాభరణలతో దివ్యసౌందర్యము మూర్తీభవించినట్లుగ గన్పట్టుచుండెను.

అంజన పర్వతశిఖరముపై నిలుచుండి ప్రకృతిసౌందర్యమును వీక్షించుచు ముగ్ధురాలగుచుండెను. 'నా కొకయోగ్యుడగు పుత్రుడు కలిగిన నెంత బాగుండు' ననుకోరికయామె మనస్సున నాసమయమున నుద్భవించెను.

---

*స్కందపురాణము వైష్ణవఖండము.

వెంటనే వాయుతరంగ మొకటి వేగముగ వచ్చినది. అంజనాదేవిచీరకొంగు కొలదిగ జారెను. ఆమె యవయవము కనబడసాగినది. అపుడు తన నెవరో స్పృశించుచున్నట్లు ఆమెకు తోచెను.

భయపడి అంజన తనచీరను సరిజేసికొని తన్ను స్పృశించినవానిని గద్దించుచు 'మర్యాద లేకుండగ నాపాతివ్రత్యమును నాశనముచేయదలంచుచున్నవా రెవరు?' అని పలికి శాప మీయ నుద్యుక్తురాలయ్యెను.

పతివ్రత యగు అంజన క్రుద్ధురాలైన దనిభావించి వాయుదేవుడు ప్రత్యక్షమై యిట్లుపలికెను-

యశస్వినీ! నేను నీపాతివ్రత్యమును భంగముచేయుట లేదు. నే నవ్యక్తరూపముతో నిన్నాలింగనముచేసికొని మానసికసంకల్పముద్వారా నీకు బలపరాక్రమసంపన్నుడు, బుద్ధిమంతుడు నగు పుత్రు నిచ్చుచున్నాను. నీపుత్రుడు మహాధైర్యవంతుడు. మహాతేజస్వి, మహాబలుడు, మహాపరాక్రమవంతుడు, దుముకుటలోను ఎగురుటలోను నాతోసమానుడు కాగలడు'.

అంజన ప్రసన్నురాలయ్యెను, వాయుదేవుని క్షమించెను. ఆమె గర్భవతియయ్యెను. కేసరియొక్క సంతోషమునకు హద్దులేకపోయెను.*

---

*వాల్మీకిరామాయణము, కిష్కింధాకాండము 66 అధ్యాయము.

యౌవన మంతయు గడచిపోయి వార్ధక్యము వచ్చినను తన కెట్టిసంతానము కలుగకుండుటచే రఘుకులశిరోమణి యగు దశరథమహారాజు చింతామగ్నుడయ్యెను. ఆయన వశిష్ఠుని యాదేశముననుసరించి ఋష్యశృంగమహర్షిచే 'పుత్రకామేష్టి' యను యజ్ఞమును జేయించెను. ఋషి భక్తితో హోమము చేసెను. ప్రసన్నుడై అగ్నిదేవుడు చరువు (హవిష్యాన్నము, పాయసము) ను దీసికొని ప్రత్యక్షమై 'రాజా! నీకార్యము సిద్ధించినది. నీ వీ పాయసమును రాణులకు పంచు'మనిపలికి అంతర్ధానమయ్యెను.

దశరథుడు పాయసములోని సగభాగమును జ్యేష్ఠపత్ని యగు కౌసల్యాదేవి కిచ్చెను, మిగిలిన సగమును రెండుభాగము లుగ జేసెను. వానిలో నొకభాగమును కైకేయి కిచ్చెను. మిగి లిన దానిని రెండుభాగములుగ జేసి కౌసల్యాకైకేయిలహస్త మునం దుంచి వారిని సంతుష్టిపఱచెను. అనగా వారియనుమతి ననుసరించి సుమిత్ర కిచ్చెను.

కైకేయి పాయసమును చేతియం దుంచుకొని ఆలోచించు చుండెను. ఇంతలో నొకగ్రద్ద ఆకాశమునుండి వేగముగ వచ్చి ఆమె చేతిలోని పాయసభాగమును ముక్కునబట్టుకొని ఎగిరి పోయెను.

కైకేయి కలతచెందెను. అపుడు దశరథుని ప్రేరణ నను సరించి కౌసల్యాసుమిత్రలు తమకడ నున్న పాయసములోని

కొలదిభాగమును కైకేయి కిచ్చిరి. ముప్పురు రాణులు గర్భములు దాల్చిరి. కౌసల్యకు శ్రీరామచంద్రుడు, కైకేయికి భరతుడు, సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులు జన్మించిరి.

వానరరాజగు కేసరి తనసహధర్మచారిణి యగు అంజనాదేవితో గలసి సుమేరుపర్వతముపై నివసించుచుండెను. అంజన పుత్రప్రాప్తికై ఏడువేలసంవత్సరములు ఉమానాథుని ఉపాసించెను. శివుడు ప్రసన్నుడై 'వర మడుగు' మని అంజనతో పలికెను.

అంజన సర్వలోకమహేశ్వరుని చరణములకు నమస్కరించి వినయపూర్వకముగ 'కరుణామయుడ వగు సదాశివా! సర్వసద్గుణసంపన్నుడు, యోగ్యుడు నగు నొకపుత్రుని యిమ్ము'నియడిగెను.

ఈశ్వరుడు ప్రసన్నుడై 'ఏకాదశరుద్రులలో పదునొకండవయంశ మగు రుద్రరూపమే నీకు పుత్రరూపమున జన్మింపగలదు, మంత్రమును స్వీకరింపుము. వాయుదేవుడు నిన్ననుగ్రహించును. దానివలన నీకు సర్వసద్గుణసంపన్నుడగు పుత్రుడు జన్మించు' నని పలికెను.

పార్వతీశ్వరు డంతర్ధానమయ్యెను. అంజనాదేవి అంజలి చాచి శివప్రదత్త మగు మంత్రమును జపింపసాగెను. ఆసమయములోనె వెనుక చెప్పబడిన ఆడగ్రద్ద కైకేయిపాయసభాగమును తీసికొని ఆకాశమున పరుగిడుచుండెను. వెంటనే యొకపెనుగాలి

పీచెను. గ్రద్ధశరీరము ముడుచుకొనిపోజొచ్చెను. పాయసము దానిముక్కునుండి జారెను. వాయుదేవుడు మొదటినుండియు సిద్ధముగనేయుండెను. ఆయన ఆపాయసమును అంజనదోసిలిలో పడవేసెను. శంకరుడు మొదట చెప్పినదాని ననుసరించి ఆమె వాయుదేవు డిచ్చిన పాయసమును (చరువును) ఆదరముతో స్వీకరించి గర్భముదాల్చెను.*

* * *

పూర్వము గార్ధభనిస్వను డను అసురచక్రవర్తి కలడు, వాడు పరమశివభక్తుడు, కాని శ్రీహరి ద్వేషము కలవాడు. అమృతత్వమును గోరి పరమశివు నారాధించెను. ఘోరతపమాచరిం

---

* బ్రహ్మలోకమునందలి అప్సరసలలో సువర్చల యను నొక యప్సరస యుండెను. ఆమె ప్రవర్తనకు క్రుద్ధుడై పితామహుడు మర్త్యలోకమున ఆడగ్రద్దగ జన్మింపవలసినదిగా ఆమెను శపించెను. తన్ను కరుణింపమని యామె ప్రార్థించెను. అపుడు బ్రహ్మ యిట్లు పలికెను. దశరథ మహారాజు చేయు పుత్రకామేష్టియజ్ఞమున అగ్నిదేవుడు చరువును దీసికొని ప్రత్యక్షమగును. అప్పు డాచరువు ముగ్గురురాణులకు పంచబడును. నీవు కైకేయీభాగమైన చరువును దీసికొని పారిపోవుదువు. ఆచరువును నీవు తినజాలవు, కాని దాని స్పర్శచేతనే నీ వా గ్రద్దరూపమును వదలి మరల అప్సరసరూపమును ధరించి బ్రహ్మలోకమునకు రాగలవు.

బ్రహ్మదేవుని వాక్కు ననుసరించియె జరిగినది. గ్రద్దముక్కునుండి చరువు జారినంతనె దానిశరీరము గూడ విడివడినది. అది వెనుకటివలె దివ్యమగు అప్సరసయై బ్రహ్మలోకమునకు వెడలెను.

(ఆనందరామాయణము)

చెను. శివానుగ్రహమునకు పాత్రుడై జాగ్రన్నిద్రావస్థల యందు ఎవరిచేతను మరణములేకుండ వరమును బొందెను. వరగర్వముతో ఆ అసురేశ్వరుడు శ్రీమన్నారాయణుని సాధించుటకు ప్రయత్నింపసాగెను. శ్రీహరి ధర్మస్వరూపుడు, సత్యస్వరూపుడు, యజ్ఞమూర్తి గావున ఈమూడింటిని భగ్నమొనరించినచో ఆతడు శక్తిరహితుడు కాగలడని, సునాయాసముగ ఓడింపబడగలడని అధర్మపరులు అసురేశ్వరునకు దుర్బోధ చేసిరి.

అపుడా అసురచక్రవర్తి సత్యవంతులను ధర్మపరాయణులను బాధింపనారంభించెను. యజ్ఞయాగాదులను భగ్నమొనరింపసాగెను. శ్రీహరిభక్తులను హింసింపసాగెను. దేవలోకముపై దండెత్తి దేవతలను నిర్జించి వారిని హింసింపసాగెను. అసురుని యాగడములను భరింపలేక దేవతలు బ్రహ్మదేవుని శరణువేడిరి. బ్రహ్మ దేవతలను దోడ్కొని శ్రీమన్నారాయణుని శరణువేడెను. అపుడు శ్రీహరి అసురుని సంహరించి ధర్మసంస్థాపన మొనరించెదనని దేవతల కభయమొసంగెను. ఆవిషయము నెఱింగి శంకరుడు వైకుంఠమున కరుదెంచెను. శ్రీహరిచే సత్కారములంది సుఖాసీనుడై ఇట్లు పలికెను :- 'అచ్యుతా! గార్దభనిస్వనుడు నాభక్తుడు, వానికి నెవ్వరును కీడొనరింప జాలరు. నాచే అమోఘములైన వరములను బొంది అతడు మృత్యువు లేని వాడైనాడు' శ్రీహరి ఇట్లుపలికెను :-

'సదాశివా! 'జాతస్య మరణం ధ్రువమ్'. ఆ అసురుడు మరణింపక తప్పదు వాని అధర్మమే వాని మృత్యువునకు కారణము కాగలదు. అనతికాలములోనే వానిని సంహరించి దుష్టశిక్షణము శిష్టరక్షణ మొనరించెదను'. శంకరు డిట్లుపలికెను. 'మాధవా! గార్దభనిస్వనుని సంహరించుట అసంభవము నీ వట్లొనరించినచో నేను నీకు దాస్య మొనరించెదను. ఇదియే నాశపథము'.

శ్రీహరి శంకరుని ప్రతిజ్ఞ నాలకించి మందహాసముచేసి మౌనమువహించెను.

శ్రీమన్నారాయణుడు విశ్వమోహినీరూపమును ధరించి గార్దభనిస్వనుని యంతఃపురముచెంత నున్న ఒక పర్వతముపై అవతరించెను. ఆ అందాలరాసి సుమధుర స్వరముతో సామవేదగాన మొనరింపసాగెను. ఆ గానము నాలకించి పరవశుడై అసురేశ్వరుడు పర్వతాగ్రమున కరుదెంచి కోటికందర్పసౌందర్యరాసి యగు మోహినిని గాంచి పరమాశ్చర్య చకితుడై ఇట్లుపలికెను. సౌందర్యరాసీ! నేను త్రైలోక్య నాథుడను. నీ వెవ్వరిదానవు! ఏలోకమునుండి అరుదెంచితివి? నీమధురగానము నాలకింపగనే నామేను పులకించినది. నీ సౌందర్యమును గాంచగనే నామనస్సు నీ కంకితమైనది. సుందరాంగీ! నన్ననుగ్రహింపుము. నాకు పట్టపురాణివై సుర లోక భోగముల ననుభవింపుము'. అపుడా మోహిని 'నాతో అడిపాడి నన్ను గెలిచినచో అట్లేయొనరింతు'ననెను. అసుర

సార్వభౌముడు మోహితుడై మోహినితో ఆటపాటలయందు మైమరిచిపోయెను. మోహిని ఆ అసురునకు అమృత మని సురా పాత్ర నందించెను. ఆతడు పరస్త్రీ వ్యామోహముచే సురను సేవించి జాగ్రన్నిద్రావస్థలకు నడుమనుండు స్థితిని పొందెను.

శ్రీమన్నారాయణుడు సమయ మాసన్నమయిన దని గ్రహించి మోహినీరూపమును విసర్జించి వృకనారాయణునిగా అవతరించెను. బ్రహ్మాదిదేవతలందఱు ఆ వృకనారాయణ మూర్తిని అనేకవిధముల స్తుతింపసాగిరి.

'మహావాలో మహాపాదః వృకః పర్వతసన్నిభః' ।

శ్రీవృకనారాయణుడు సుదీర్ఘమైన వాలమును కలిగి యుండెను (అదియే కాలము). పెద్దపాదములను కలిగి యుండెను (అవియే సకలవిశ్వసముదాయములు), పర్వతాకారుడై యుండెను. శ్రీవృకావతారుడు తనమహావాలముతో గార్ధభనిస్వనుని బంధించి కాలసర్పములవంటి తనవాడినఖము లతో చీల్చిచెండాడెను. గార్ధభనిస్వనుని దేహమునుండి ఒక వెలుగు బయలుదేరి శ్రీవృకనారాయణుని పాదములందు విలీనమయ్యెను. దేవతలు పుష్పవర్షమును కురిపించిరి. బ్రహ్మాదులు అనేకవిధముల శ్రీహరిగుణములను గానము చేసిరి.

శివు డాప్రదేశమున కరుదెంచి శ్రీహరితో నిట్లు

పలికెను "జగన్నాథా! జయము నీదే! నేటినుండి నేను నీసేవకుడనైతిని"

అపుడు శ్రీమన్నారాయణు డిట్లుపలికెను. "సదాశివా! నీవు నాకు పూజ్యుడవు, సేవలొనరింపబని లేదు."

'శ్రీహరీ! నేను నిన్నెల్లప్పు డారాధించుచునే యుందును. మనము శపథముల నొనరించితిమిగదా! కావున నీవు నా సేవల నొందవలసినదే' యని శంకరుడనెను.

అందులకు శ్రీమన్నారాయణుడు "భక్తవశంకరా! నీవు లింగస్వరూపుడవు, నీ పీఠూపమున నుండ నేను నీచేత సేవలనొందజాలను. రాబోవుకల్పములలో నేను దుష్టశిక్షణార్థమై అవనిపై శ్రీరామచంద్రునిగా అవతరింపగలను. ఆ యా అవతారములలో నాశక్తి యగు సీత నానుండి దూరమగును. ఆమె లేని నేను అవతారకార్య మొనరింపలేను. ఆ అవతారములో నీవు ఆదిపరాశక్తిసహితముగ నా యంశను బొంది శ్రీఆంజనేయుడవై అవతరించి నీప్రతిజ్ఞాపాలన మొనరింపుము. శక్తిదూరమైన నాకు నీనవ్యశక్తిని ప్రసాదించి నన్ను పరిపూర్ణునిగా నొనరింపుము. దుష్టశిక్షణలో శిష్టరక్షణములో నాతో కలసి పాల్గొనుము. భగవంతుడవైననీవే భక్తునిగా అవతరించి పరమభక్తులయాచరణ మిట్లుండవలెనని ఆచరించి సకల విశ్వములకు చూపింపుము. సకలవిశ్వములందు గల భక్తులకు రక్షకుడవై, పతితపావనుడవై, సకలదుష్టసంహారకుడవై,

మోక్షప్రదాతవై, ఐశ్వర్యదాయకుడవై, సచ్చిదానంద స్వరూపుడవై, శ్రీహరిహరులయేకరూపుడవై ప్రకాశింపుము, మమ్ముల నందరిని రక్షింపు' మనిప్రార్థించెను.

శ్రీహరి పలికిన వచనముల నాలకించి ఆశుతోషుడైన శివుడు తథాస్తనిపలికెను. సకలదేవతలు మహర్షులు పరమానందభరితులై జయజయధ్వానముల నొనరించిరి.

## కాలాగ్ని రుద్రావతారుడు శ్రీఆంజనేయుడు

శివలోకములో సతీశివులు రామనామ మాధుర్యము నాస్వాదించుచుండిరి. ప్రసంగవశమున పరమేశ్వరుడు సతీదేవితో నిట్లు పలికెను.'మహామాయా! ఎవని నామస్మరణముచే నామేను పులకించునో ఆ నాస్వామి భూమిపై దుష్టశిక్షణార్థము అవతరించ నున్నాడు. దేవతలందరు భగవంతుని సేవించుటకు అవనిపై అవతరించెదరు. నేనుకూడ శ్రీరామ సేవకుడనై నామనోరథమును సఫలము చేసికొందును'.

శంకరుని వచనముల నాలకించి జగజ్జనని కొంచమాలోచించి ఇట్లుపలికెను- 'నాథా! రావణుని సంహరించుటకు భగవంతుడు అవతరింపనున్నాడు. రావణుడు మీకు అనన్య భక్తుడు, ధన్యజీవి, అట్టి పరమభక్తుని సంహార కార్యములో మీరెట్లు పాల్గొనగలరు'?

అప్పుడు శంకరుడు మందహాసముచేసి ఇట్లుపలికెను. 'దేవీ రావణాసురుడు నాభక్తుడైనను నాయొక్క కాలాగ్ని రుద్రాంశను మఱచెను. దేవీ! నేను పదునొకండు రూపములలో నుందును. రావణుడు తనదశశిరముల నర్పించి నాపదిరూపములను మాత్రమే ఆరాధించెను. కాని కాలాంతకమైన నా కాలాగ్ని రుద్రాంశను మఱచెను. రావణుడు పూజింపక వదలిన కాలాగ్ని రుద్రాంశతో నేను అవతరించి శ్రీరామచంద్ర ప్రభువును సేవించెదను. రావణునితో యుద్ధ మొనరించెదను'.

పరమేశ్వరుడే ఆదిపరాశక్తితో గూడి, శ్రీమన్నారాయణాంశను బొంది అవనిపై అంజనేయుడై అవతరించెను. అనేక కల్పములలో ఆ సదాశివుడు అనేకావతారములను ధరించెను. ఆయనంతావతారములలో తొమ్మిది అవతారములు సుప్రసిద్ధములు.

## శ్రీ ఆంజనేయుని నవావతారములు

పరాశరసంహిత ననుసరించి శ్రీఆంజనేయుని తొమ్మిది యవతారములు అత్యంత ప్రసిద్ధములు.

శ్లో॥ ఆద్యః ప్రసన్నహనుమాన్ ద్వితీయో వీరమారుతిః।
తృతీయో వింశతిభుజః చతుర్థః పంచవక్త్రికః॥
పంచమోఽష్టాదశభుజః శరణ్యస్సర్వదేహినామ్।
సువర్చలాపతిష్షష్ఠః సప్తమస్తు చతుర్భుజః॥
అష్టమః కథితశ్శ్రీమాన్ ద్వాత్రింశద్భుజమండలః।
నవమో వానరాకార ఇత్యేవం నవరూపధృక్॥

(శ్రీ పరాశరసంహిత 60వ పటలము)

1. ప్రసన్న హనుమదవతారము, 2. వీరాంజనేయావ తారము, 3. వింశతి (ఇరువది) భుజాంజనేయావతారము, 4. పంచముఖాంజనేయావతారము, 5. అష్టాదశ (పదునెనిమిది) భుజాంజనేయావతారము, 6. సువర్చలా హనుమదవతారము, 7. చతుర్భుజ (నాలుగు) ఆంజనేయావతారము, 8. ద్వాత్రింశత్ (ముప్పదిరెండు) భుజాంజనేయావతారము, 9. వానరాంజనేయావతారము.

విజయు డను క్షత్రియుడు ప్రసన్నాంజనేయుని ఆరాధించి భవబంధవిముక్తుడై పరమపదమును బొందెను. మైందు డను భక్తుడు వీరాంజనేయు నుపాసించి లోకములను సాగరమున తేల్చగల్గెను. బ్రహ్మదేవుడు వింశతిభుజాంజనేయోపాసన మొనరించి సృష్టికర్త కాగలిగెను. విభీషణకుమారు డగు నీలుడు పంచముఖాంజనేయుని పూజించి చరితార్థుడయ్యెను. దుర్వాసమహర్షి అష్టాదశభుజాంజనేయు నుపాసించి యోగులలో అగ్రగణ్యుడయ్యెను. శ్రీహీను డగు ధ్వజదత్తు డను బ్రాహ్మణుడు సువర్చలాహనుమదీశ్వరు నుపాసించి శ్రీమంతుడయ్యెను. కపిలు డను బ్రాహ్మణుడు చతుర్భుజు డగు హనుమంతు నారాధించి జననమరణచక్రమును ఛేదించి పరమపదమును బొందెను. సోమదత్తు డను రాజు రాజ్యభ్రష్టుడయ్యెను. ఆ నరపతి ద్వాత్రింశద్భుజాంజనేయు నుపాసించి సకలరాజ్యమును మరల పొంది చక్రవర్తి కాగలిగెను. గాలు

డను కిరాతుడు వానరాంజనేయుని పూజించి కుష్ఠవ్యాధినుండి విముక్తుడయ్యెను.

అసంఖ్యాకు లగు దేహధారులు శ్రీ ఆంజనేయు నుపాసించి ఇష్టసిద్ధులను, శాంతిని, పరమపదమును బొంది చరితార్థులైరి. ఎవరైతే శ్రీహరిహరులను హనుమత్స్వరూపముగా భావనచేయుదురో వారు ధన్యులు.

శ్లో॥ ఏకో దేవ స్సర్వద శ్రీహనుమాన్
ఏకోమంత్ర శ్శ్రీహనుమత్ప్రకాశః
ఏకోమూర్తిః శ్రీహనుమత్స్వరూపా
చైకం కర్మ శ్రీహనూమత్సపర్యా॥ (ప. స)

అన్నింటిని ప్రసాదింపగల శ్రీహనుమంతుడే ఏకైక దైవము. శ్రీ ఆంజనేయుని దివ్యమహిమలను ప్రకాశింపజేయు మంత్రమే ఏకైకమంత్రము. శ్రీ హనుమంతునిరూపముగల విగ్రహమే ఏకైక అర్చావిగ్రహము. శ్రీ హనుమదారాధనా సేవాదులే జీవుని నిజమైన కర్మములు.

శ్లో॥ అంజనా సుప్రజావీర-పార్వతీశ్వరసంభవః
సమర్థోఽసి మహావీర-మహాబల పరాక్రమః
నరాణాం చ సురాణాం చ -ఋషీణాం చ హితాయ వై॥

శ్రీ అంజనాకుమారా! నీవు పార్వతీపరమేశ్వరులనుండి అవతరించినవాడవు. మహావీరుడవు, మహాబలపరాక్రమవంతుడవు. నీవు దేవతలకు, మానవులకు, ఋషులకు హితమొనరించువాడవు.

# శ్రీ హనుమదవతరణము

చైత్రశుక్ల పూర్ణిమా మంగళవారము శుభసమయమున భగవాను డగు శివుడు తనకు పరమారాధ్యు డగు శ్రీరామునిమునిమనోమోహక మగు అవతారలీలను దర్శించుటకు, ఆయనకు సహాయముచేయుటకు తన పదునొకండవ రుద్రాంశతో* అంజనాదేవికి పవనపుత్రుడు మహావీరుడు నగు హనుమానునిరూపమున ఈ భూమిపై నవతరించెను. కల్పభేదముచేత కొందఱు ఈయన చైత్రశుక్ల ఏకాదశీదినమున మఘానక్షత్రమున జన్మించినాడనియు, కొందఱు కార్తికకృష్ణ చతుర్దశీతిథియందును, కొందఱు కార్తికపూర్ణిమాతిథియందును జన్మించెనని చెప్పుచున్నారు. ఈయన జన్మదినము మంగళవార మని కొందఱు శనివార మని కొందఱు

---

*యో వై చైకాదశో రుద్రో హనుమాన్ స మహాకపిః ।

అవతీర్ణ సహాయార్థం విష్ణోరమితతేజసః ॥

(స్కం. మాహే. కే. 8-99, 100)

పదునొకండవరుద్రుడే అమితతేజస్వి యగు విష్ణువునకు సహాయము చేయుటకు మహాకపి యగు హనుమానుని రూపమున నవతరించెను.

తలంచు చున్నారు * భావుకు లగు భక్తులను సర్వ తిథులు శ్రేష్ఠములే.

---

* (క) చైత్రే మాసి సితే పక్షే హరిదిన్యాం మఘాభిధే ।
నక్షత్రే స సముత్పన్నో హనుమాన్ రిపుసూదనః ॥
మహాచైత్రీ పూర్ణిమాయాం సముత్పన్నోఽఞ్జనీసుతః ।
వదంతి కల్పభేదేన బుధా ఇత్యాదికేచన ॥

(ఆనందరామాయణము, సారకాండ 13.162-63)

చైత్రశుక్ల ఏకాదశీదినమున మఘానక్షత్రమునందు శత్రునాశకు డగు హనుమానుడు జన్మించెను. కొందఱు విద్వాంసులు కల్పభేదము ననుసరించి చైత్రపూర్ణిమనాడు హనుమంతుడు జన్మించినా డని చెప్పు చున్నారు.

(ఖ) ప్రాదురాసీత్తదా తాం వై భాషమాణో మహామతిః ।
మేషసంక్రమణం భానౌ సంప్రాప్తే మునిసత్తమాః ।
పూర్ణిమాఖ్యే తిథే పుణ్యే చిత్రానక్షత్రసంయుతే ॥

(స్కంద పు. వైష్ణవఖం 40.42-43)

(గ) అశ్వినస్యాసితే పక్షే స్వాత్యాం భౌమే చతుర్దశీ ।
మేషలగ్నేఽఞ్జనీగర్భాత్ స్వయం జాతో హరః శివః ॥

(వాయుపురాణము)

(ఘ) శుక్లాదిమాసగణనయా ఆశ్వినకృష్ణః కార్తిక
కృష్ణః. తులార్కే మేషలగ్నే సాయంకాలే
అతశ్చతుర్దశ్యాం సాయంకాలే జన్మోత్సవః ।

(హృషీకేశపంచాంగము, వారణాసి)

శివునియొక్క ఏకాదశ రుద్రావతారుడు, మారుతాత్మజుడు, కేసరీనందనుడు, అంజనాదేవి పుత్రుడు నగు హనుమాను డీ భూమిపై నవతరించిన సమయమున ప్రకృతియంతయు మనోహరముగ నుండెను. దిక్కులు ప్రసన్నము లయ్యెను. సూర్యదేవుని కిరణములు సుఖకరముగను, శీతలముగను నుండెను. సెలయేళ్ళలో స్వచ్ఛమైన నీరు ప్రవహించుచుండెను. పర్వతములు కుతూహలముతో ఆంజనేయునిరాకకై యెదురు చూచుచుండెను. జలపాతములు ప్రసన్నముగ నెగురుచు గతి శీలములై యుండెను. వనములలోను ఉపవనములలోను, ఉద్యాన వనములలోను వివిధము లగు రంగులు గలిగిన మనోహరము లగు పుష్పములు వికసించియుండెను. వానిపై భ్రమరములు ధ్వనిచేయుచు తిరుగుచుండెను. మలయానిలము మెల్లగ వీచుచుండెను.

శంకరుడు అంజనాదేవికి పుత్రరూపమున నవతరించెను. జననకాలమందె హనుమానునిసౌందర్యము సాటిలేనిదిగను, వర్ణింప నలవిగానిదిగను నుండెను. ఆయనశరీరకాంతి పింగళ వర్ణము; రోమములు, నేత్రములుగూడ పింగళవర్ణముగనే యుండెను. ఆయన విద్యుత్కాంతితో సమానమైన, సువర్ణ నిర్మితమైన, మనోహరమైన కుండలములను ధరించెయే అంజనా దేవిహృదయమునుండి అవతరించెను. ఆతనిశిరస్సుపై మణిజటిత మగు కిరీటము శోభిల్లుచుండెను. కౌపీనమును, అంగవస్త్రమును ధరించియుండెను. విశాల మగు ఆతనివక్షఃస్థలమున యజ్ఞో

పవీతము, హస్తమున వజ్రము, కటిప్రదేశమున ముంజగడ్డితో చేసిన మొలత్రాడు శోభిల్లుచుండెను. తనపుత్రుని యలౌకిక మగు రూపసౌందర్యమును జూచినంతనే అంజనాదేవి యానందమునకు నవధులు లేకపోయెను.

పవిత్ర మగు నీభూమిపై హనుమంతుడు అడుగిడినంతనే దశదిశలయందు హర్షోల్లాసములు వ్యాపించెను. కపిరాజగు కేసరియొక్క ఆనందమున కవధులు లేకపోయెను. దేవతలు, ఋషులు, కపులు, పర్వతములు, సరస్సులు, నదులు, సముద్రములు, పశుపక్షులు, భూమి, సర్వము పులకించినది. అంతటను ఆనందసామ్రాజ్యము వ్యాప్తమైనట్లుండెను.

## పరాశరసంహితలో శ్రీహనుమదవతారప్రసంగము

ఒకప్పుడు మైత్రేయమహర్షి శ్రీపరాశరమహర్షిని దర్శించి "మహాభాగా! శ్రీ ఆంజనేయు డను నామముతో ప్రసిద్ధమైన భగవదవతారమును ప్రవచింపుము. అత డెవ్వడు? ఎవరికుమారునిగా అవతరించెను? ఏ యే దివ్యలీలల నొనరించెను? ఆతని అవతార మెట్టిది? వర్ణింపుము" అనియడుగగా శ్రీపరాశరుడు ఇట్లు పలికెను.

అసురుల యకృత్యములతో అవని ఆక్రాంతమయ్యెను. భూదేవిప్రార్థనలను మన్నించి బ్రహ్మశివాదులు శ్రీమన్నారా

యణుని అవనిభారమును హరింపుమనియు అసురసంహారకుని ప్రసాదింపుమనియు ప్రార్థించిరి.

అపుడు శ్రీహరి ఒక్కక్షణ మాలోచించి రాక్షసులనాశము తప్పక జరుగునని పలికెను. తదనంతర మాయన శ్రీహరిహరమహాతేజములను సంగ్రహించి సదాశివునందు ప్రవేశపెట్టెను. ఈ తేజము మహావానరునిగా ఆవిర్భవించి అసురనాశన మొనరింపగలదని పలికెను. తానుకూడ అవతరించి దుష్టశిక్షణము శిష్టరక్షణము చేయగలనని అభయ మొసంగెను.

పరమేశ్వరుడు పార్వతితో కలసి భూమండలముపై విహరించుచు వేంకటాచలము చేరెను. ఆపర్వతముపై సజ్జనులకు శరణ్యుడైన శ్రీనివాసుడు విరాజిల్లియున్నాడు. ఆదిదంపతులిద్దరు శేషాచలముపై పుష్పోద్యానముల చెంత, సరస్సుల చెంత విహరింపసాగిరి. అదేసమయమున కింపురుషలోకవాసులైన వానర దంపతులు క్రీడించుటను పార్వతిగాంచెను. ఆమెసం తానేచ్ఛచే ఆదిదేవుని సమీపించెను. పరమేశ్వరుడు వానరరూపమును ధరించి వేయిసంవత్సరములు పార్వతీదేవిపై తన మనస్సును లగ్నమొనరించి క్రీడింపసాగెను. తుదకు శ్రీమహాదేవునినుండి శ్రీహరిహర తేజము బయల్వెడలి పార్వతిని సమీపించెను. ఆమె ఆమహాతేజమును భరింపలేక దానిని అగ్నిదేవున కొసంగెను. ఆయన గూడ దానిని భరింపలేక సూక్ష్మరూపుడైన వాయువున కొసంగెను.

ఆసమయమందే వేంకటాచలముపై సత్పుత్రప్రాప్తికై అంజన ఘోరతపమాచరించుచుండెను. శంకరుని యాదేశానుసారము ఆ శ్రీహరిహర తేజమును వాయుదేవుడు అంజనాదేవి కొసంగెను. ఆ మహాతేజమునుండి శ్రీహరిహరస్వరూపుడైన శ్రీ ఆంజనేయుడవతరించెను.

శ్లో॥ వైశాఖే మాసి కృష్ణాయాం దశమీమందసంయుతా ।
పూర్వప్రోష్ఠపదాయుక్తా తథా వైధృతిసంయుతా ॥
తస్యాం మధ్యాహ్నవేళాయాం జనయామాస వై సుతమ్ ।
మహాబలం మహాసత్త్వం విష్ణుభక్తిపరాయణమ్ ॥

(పరాశరసంహిత 6వ పటలము)

వైశాఖమాసమున కృష్ణపక్షమందు దశమీతిథి శనివారము కాగా పూర్వాభాద్రానక్షత్రము వైధృతీయోగము గల నాటి మధ్యాహ్నసమయమున అంజన పుత్రుని కనినది. అతడు మహాబలసంపన్నుడు, మహాసత్త్వసంపన్నుడు, విష్ణుభక్తితత్పరుడు.

శ్లో॥ సర్వదేవమయం వీరం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్ ।
వేదవేదాంగతత్త్వజ్ఞం సర్వవిద్యావిశారదమ్ ॥
సర్వబ్రహ్మవిదాం శ్రేష్ఠం సర్వదర్శనసమ్మతమ్ ।
మాణిక్యకుండలధరం దివ్యపట్టాంబరాన్వితమ్ ॥
కనకాచలసంకాశం పింగాక్షం హేమమాలినం ।
స్వర్ణయజ్ఞోపవీతం చ మణినూపురశోభితమ్ ॥




648 Hanuman

J. B. KHANNA & Co.,
10, Devaraja Mudali St.,
MADRAS-600003.

ధ్వజవజ్రాంకుశచ్ఛత్ర-పద్మరేఖాంఘ్రిసంయుతం ।
దీర్ఘలాంగూలసహితం-దీర్ఘకాయం మహాహనుమ్ ॥
కౌపీనకటిసూత్రాభ్యాం విరాజంతం మహాభుజం ।
ఆశ్చర్యభూతం లోకానాం-వజ్రసంహననం కపిమ్ ॥
సర్వలక్షణసంపన్నం కిరీటకనకాంగదం ।
ప్రభయాఽమితయా విష్ణోరవతారమివావరమ్ ॥
(పరాశరసంహిత 6వ పటలము)

సకలదేవతలు తానే యైనవాడు, బ్రహ్మవిష్ణుశివ స్వరూపుడైన సృష్టిస్థితిలయాత్మకుడు, వేదవేదాంగములతత్త్వ మెరింగినవాడు, సకలవిద్యలందు పరిపూర్ణుడు, బ్రహ్మజ్ఞాను లందరిలో శ్రేష్ఠుడు, సర్వదర్శనములకు సమ్మతమైనవాడు, మాణిక్యములు పొదిగిన కుండలములనుధరించినవాడు, దివ్యము లగు పీతాంబరములను ధరించినవాడు. మేరుపర్వతసమానుడు, పింగాక్షుడు, స్వర్ణమాలికలను సువర్ణయజ్ఞోపవీతమును ధరించిన వాడు, మణిసమన్వితములైన నూపురములను ధరించి శోభిల్లు వాడు, ధ్వజము వజ్రము అంకుశము ఛత్రము పద్మము అను రేఖలతో కూడిన పాదపద్మములు కలవాడు, పెద్దహనువు (దవడ) కలవాడు, పొడవైన వాలముగలవాడు, దీర్ఘమైన కాయము (శరీరము) కలవాడు కౌపీనమును మొలత్రాడును ధరించినవాడు, మహాబాహువులుకలవాడు, లోకములకు ఆశ్చ ర్యమును గలిగించువాడు, వజ్రదేహముకలవాడు, వానర

రూపుడు, సమస్తశుభలక్షణములు కలవాడు, కిరీటమును బంగారుభుజకీర్తులను ధరించినవాడు, నగు శ్రీ ఆంజనేయుడు అమితమగు కాంతిచే వేరొక శ్రీమన్నారాయణావతారమా యనునట్లుండెను.

శ్లో॥ పపాత పుష్పవృష్టిశ్చ-నేదుర్దుందుభయో దివి।
నన్నృతుర్దేవగంధర్వా-స్తుష్టువుస్సిద్ధచారణాః
వవౌ వాయుస్సుఖస్పర్శం సరితో నిర్మలోదకాః॥
—పరా. సం. 6వ పటలము.

ఆముహూర్తములో పుష్పవర్షముగురిసెను, దివియందు దుందుభులు మ్రోగెను. దేవతలు గంధర్వులు నృత్యము లొనరించిరి, సిద్ధులు చారణులు స్తోత్రములొనరించిరి. వాయువు వనమున సుఖస్పర్శకలిగించునువీచినది. నదులు స్వచ్ఛనిర్మల జలములతో పరిపూర్ణములైయుండెను.

## బాల్యకాలము

అంజనాదేవి తన ప్రియపుత్రుడగు హనుమంతుని మిగుల శ్రద్ధతోను, ప్రేమతోను పెంచుచుండెను. కేసరిగూడ కుమారునిపై నెంతగనో ప్రేమచూపుచుండెను. హనుమానుడు సంతోషముతో కిలకిలయనిధ్వని చేయుచుండగా అంజనాకేసరులుఆనందమగ్నులగుచుండిరి. వానిబాల్యక్రీడలు మిగుల ఆకర్షకములుగను, సుఖకరములుగను, అద్భుతములుగను నుండెను.

ఒకనాటిమాట. కేసరి యెచటికో వెడలెను. అంజన గూడ బాలుని ఉయ్యాలలో పరుండబెట్టి ఫలపుష్పముల

దెచ్చుటకై వనమునకు వెడలెను. బాలు డాకలిగొనెను. తల్లి సమీపమున లేదు. అతడు కాలుసేతుల నాడించుచు ఏడ్వ సాగెను. వెంటనే వానిదృష్టి తూర్పుదిక్కుపై బడెను. అప్పు డరుణోదయమగుచుండెను. ఆతడు సూర్యుని యరుణబింబ మును ఎఱ్ఱనిపండని తలంచెను.*

తేజస్సునకు పరాక్రమమునకు వయస్సుతో నిమిత్తము లేదు. ఇచట హనుమంతునిరూపమున అంజనాదేవియొడిలో ప్రళయంకరు డగు శంకరుడు ఏకాదశరుద్రాంశతో క్రీడించు చుండెను. వాయుదేవుడు మొదటనే బాలునకు నెగురు శక్తిని ప్రదత్తముచేసెను. దానివలన హనుమంతుడు వెంటనే యెగిరి వాయువేగముతో ఆకసమునకు పోవుచుండెను. వానియావేగమును జూచి దేవదానవయక్షాదులు విస్మితులై యిట్లుపలుకసాగిరి- 'ఈ వాయుపుత్రుని వేగముతో సమాన మగు వేగము స్వయముగ వాయువునకు గాని గరుడునకుగాని మనస్సునకుగాని లేదు. ఇంతయల్పవయస్సులోనే వీని కింతటి వేగము, పరాక్రమము నున్న యౌవనకాలమున నింకయెంత శక్తి యుండునోగదా!'

(క) ఖ అధ్యాత్మరామాయణము 4-9-18, 19,

(*) అసౌ హి జాతమాత్రోఽపి బాలార్క ఇవ మూర్తిమాన్।
గ్రహీతుకామో బాలార్కం ప్లవాంబరమధ్యతః ॥
(స్కంద పు. అవంతీఖండము, చతురశీతిలింగ
మాహాత్మ్యము 79-21)

తనపుత్రుడు సూర్యునివైపు వెడలుచుండుట చూచి వాయుదేవుడు "సూర్యుని తీక్ష్ణకిరణములు నా యీ బాలుని కెట్టి బాధను కలుగజేయకుండుగాక' యని భావించి మంచు వలె శీతలుడై వాని వెంటపోసాగెను.

సూర్యదేవుడు గూడ తనవైపు వచ్చు నీయలౌకిక బాలుని జూచెను. పవనకుమారుడు తండ్రి వేగముతో తనవైపే వచ్చు చున్నాడనియు, వానిరక్షణకై వాయుదేవుడుగూడ వెంట వచ్చుచున్నాడనియు వెంటనే తెలిసికొనెను. "ఆహా! స్వయముగ చంద్రమౌళి యగు నీశ్వరుడే హనుమానుని రూపమున నన్ను ధన్యునిగా జేయుటకు నిటువైపు వచ్చుచున్నాడు. ఇది నాయదృష్ట" మని సూర్యుడు భావించెను. వెంటనే అగ్ని మయములగు ఆతని కిరణములు చల్లబడెను. హనుమంతుడు సూర్యునిరథముపై గూర్చుండి ఆయనతో నాడుకొనసాగెను.

దైవికముగ నాదినము అమావాస్యాతిథియైనది. సింహికా పుత్రుడగు రాహువు సూర్యుని బట్టుకొనుటకు వచ్చెను సూర్యునిరథముపై గూర్చుండియున్న ఆబాలుడు వానికంట బడెను. రాహువు బాలుని విషయమై ఆలోచింపక సూర్యుని పట్టుకొనుటకు ముందుకు బోయెను. వెంటనే హనుమంతుడు వానిని పట్టుకొనెను. వానివ్రజపు పిడికిలిలో బంధితుడై రాహువు గిలగిలతన్నుకొనసాగెను. చివరకు కెట్లో యతడు బ్రతికి బయటపడి పరుగిడెను. అతడు సరాసరి దేవేంద్రునికడకు జేరి

కనుబొమలను ముడివేసి క్రోధితుడై యిట్లుపలికెను- 'సురేశ్వరా! నా యాకలి తీరుటకై నాకు నీవు సూర్యచంద్రులను సమర్పించితివి, కాని యిపుడు నీ వీ యధికారమును మఱియొకని కేల యిచ్చితివి?''

ఆశ్చర్యమును గలుగజేయు రాహువుమాట విని యింద్రుడు వాని ముఖమును జూడసాగెను. అంతట రాహు విట్లు పలికెను- 'నేడు పర్వ సమయమగుటచే నేను సూర్యుని గ్రసించుటకు వానికడకు వెడలితిని. ఇంతకుమునుపే అచట నున్న మఱియొక రాహువు నన్ను పట్టుకొనెను. నె నెట్లో ప్రాణములను కాపాడుకొని యిచటకు వచ్చితిని''.

కనులవెంట బాష్పములను రాల్చు రాహువుమాట విని యింద్రుడు మిగుల చింతితుడయ్యెను. అతడు తన సింహాసనమునుండి లేచి, ఐరావతము నధిరోహించి పైసంఘటన జరిగిన ప్రదేశమునకు వెడలెను. రాహువుగూడ వానివెంట వెడలెను. శచీపతి ఆశ్చర్యచకితుడై రాహువునకు గూడ భయమును గలిగించినవాడు సూర్యునికడ నున్న ఆపరాక్రమ వంతు డెవడై యుండునో? అని తలంచుచుండెను.

రాహువు మిగులవేగముతో సూర్యునివైపు పరుగిడెను. వానిని జూచినంతనె హనుమానునకు ఆకలి గుర్తుకువచ్చెను. అతడు రాహువును సుందరమైన భక్ష్యముగా భావించి వానిపై బడెను.

'సురేశ్వరా! రక్షింపుము రక్షింపుము' అని యరచుచు రాహువు ఇంద్రునికడకు పరుగెత్తెను.

సురాధిపతి రాహువును రక్షించుటకు పరుగిడెను. రాహువు తప్పించుకొనిపోయిన పిమ్మట హనుమంతుడు ఐరావతమును జూచెను. మధురఫలముగా భావించి దానిపైకి దుమికెను. అపుడు హనుమానుని స్వరూపము ప్రజ్వలించు అగ్నివలె ప్రకాశించుచు భయంకరముగ నుండెను. ఇంద్రుడు భయపడెను, తన్ను కాపాడుకొనుటకై అతడు బాలునిపై వజ్రాయుధమును ప్రయోగించెను. అది హనుమానుని యెడమ దవడకు దగిలెను, దవడ విరిగెను. వెంటనే యతడు గిలగిల తన్నుకొనుచు పర్వతశిఖరముపైబడి మూర్ఛితుడయ్యెను.

అట్లు తనప్రియపుత్రుడు వజ్రాఘాతముచే గిలగిల తన్నుకొనుచు క్రిందపడుట చూచి వాయుదేవుడు ఇంద్రునిపై క్రుద్ధుడయ్యెను. శక్తిశాలి యగు వాయుదేవుడు తనగతిని నిరోధించి, పుత్రుని దీసికొని పర్వతగుహలోనికి ప్రవేశించెను.

త్రిలోకములయందలి సర్వప్రాణులశ్వాసలు నిలచిపోయెను. వారియవయవములసంధులు విడివడనారంభించెను. అందఱు ఎండినకట్టెలవలె అవసన్నులైరి. వారిసర్వధార్మిక కృత్యములు నిలచిపోయెను.

ప్రాణసంకటముచే భయబడిన ఇంద్రుడు, దేవతలు, గంధర్వులు, అసురులు, నాగులు, గుహ్యకులు మున్నగు

వారు ప్రాణరక్షణకై బ్రహ్మకడకు పరుగిడిరి. బ్రహ్మ అందఱిని వెంటనిడుకొని పర్వతగుహాలోనికి వెడలెను. అచట వాయు దేవుడు తన పుత్రుని యొడిలో నుంచుకొని, హృదయమునకు హత్తుకొని దుఃఖాతిరేకముచే కన్నీటిని విడచుచుండెను. మూర్ఛితు డగు హనుమానునిశరీరకాంతి సూర్యాగ్నుల వలెను, సువర్ణమువలెను నుండుటచూచి చతుర్ముఖుడు అచ్చెరువందెను.

ఎట్టయెదుట నిలచియున్న బ్రహ్మదేవుని జూచినంతనె వాయుదేవుడు పుత్రుని యొడిలోనికి దీసికొని నిలువబడెను. అపుడు హనుమానుని కర్ణములయందు అలౌకికము లగు కుండలములు వ్రేలాడుచుండెను, శిరస్సున కిరీటము, కంఠమున హారములు, దివ్యము లగు నవయములపై స్వర్ణాభూషణములు శోభిల్లుచుండెను. వాయుదేవుడు బ్రహ్మదేవునిచరణములపై బడెను.

చతురాననుడు వాయుదేవుని లేవనెత్తి మిగుల ప్రేమతో అతడు కుమారునియవయవములను తనకరకమలము లతో నిమిరెను. బ్రహ్మకరస్పర్శచే పవనపుత్రుడు మూర్ఛ నుండి తేరుకొని, లేచి కూర్చుండెను. తన పుత్రు డట్లు జీవితు డగుటచూచి జగత్తునకు ప్రాణస్వరూపు డగు వాయు దేవుడు వెనుకటివలె వీచసాగెను. దానివలన మూడులోకము లకు మరల ప్రాణములు వచ్చినట్లుండెను.

బ్రహ్మ సంతుష్టుడై హనుమంతునకు వరముల నిచ్చుచు "ఈబాలునకు బ్రహ్మశాపము తగులదు, వీనియవయవములను ఏశస్త్రాస్త్రములుగూడ ఎప్పుడును ఛేదింపజాల" వనిపలికెను.

మరల ఆయన దేవతల నుద్దేశించి 'దేవతలారా! అసాధారణు డగు నీబాలుడు భవిష్యత్తులో మీయందఱకు పరమ హితమును జేకూర్చువాడగును, అందువల్ల మీరు వీనికి వరముల నీయు' డని పలికెను.

దేవేంద్రుడు వెంటనే ప్రసన్నుడై హనుమానుని కంఠమును వాడని కమలమాలతో నలంకరించి యిట్లుపలికెను –'నేను ప్రయోగిచింన వజ్రాయుధముచే నీబాలునిదవడ విరిగిపోయినది, అందువలన ఈకపిశ్రేష్ఠుడు నేటినుండి హనుమంతు డను పేరుతో పిలువబడును*. ఇంతేకాక యీబాలునిపై నావజ్ర మెట్టి ప్రభావమును జూపజాలదు, వీని శరీరము నావజ్రముకంటెను మిగుల కఠినముగ నుండగలదు."

అచటనే యున్న సూర్యదేవుడు 'నేను వీనికి నా తేజస్సులోనిశతాంశము నిత్తును, దానితో పాటు తగినసమయమున విద్యను బోధించి వీనిని శాస్త్రమర్మజ్ఞునిగా జేయుదును, ఇతడు సాటిలేనివిద్వాంసుడు, వక్తయు నగు'నని పలికెను.

---

* మత్కరోత్సృష్టవజ్రేణ హనురస్యయథా హతః ।
నామ్నా వై కపిశార్దూలో భవితా హనుమానితి ॥
(వా. రా. 7-36-11)

"నాపాశముచేత జలముచేత నిత డెప్పుడును సురక్షితుము గనే యుండు'నని వరుణుడు పలికెను.

"ఇతడు రోగరహితుడుగ నుండును, నాదండమువలన వీని కెప్పుడును మరణము సంభవింప"దని యముడు పలికెను.

పింగళవర్ణుడు, యక్షులకు రాజు నగు కుబేరు డిట్లు పలికెను-"యుద్ధమున వీని కెప్పుడును విషాదముకలుగదు, నాగదనుండి వీనికి రక్షణకలుగును. నాపరివారమైన యక్ష రాక్షసులచే నిత డెప్పుడును పరాజితుడుకాడు."

"ఇతడు నాచేతగాని, నా ఆయుధములచేతగాని ఎప్పుడును వధ్యుడుగా"డని శంకరుడు వరమిచ్చెను.

విశ్వకర్మ యిట్లుపలికెను-'ఈబాలుడు నాచే నిర్మితము లైన శస్త్రాస్త్రములచే నెల్లప్పుడును సురక్షితుడై యుండ గలడు'.

ఇట్లు దేవతలందఱు అమోఘము లగు వరముల నిచ్చిన పిమ్మట బ్రహ్మదేవుడు మిగుల ప్రసన్నుడై ఇతడు దీర్ఘాయు ష్మంతుడు, మహాత్ముడు, సర్వవిధము లగు బ్రహ్మదండములచే నవధ్యుడు నై యుండగల' డనిపలికెను.

ప్రసన్ను డగు చతురాననుడు వాయుదేవునితో మఱల యిట్లుపలికెను-"వాయుదేవా! నీ యీ పుత్రుడు శత్రువులకు భయంకరుడు, మిత్రుల కభయప్రదాతయు నగును. వీని నెవ్వ

ఱును యుద్ధమున జయింపలేరు. ఇత డిచ్ఛానుసారముగ రూప మును ధరించి తలంచినచోటికి వెడలగలడు. వీనిగమనము అవ్యాహతము. ఇతడు మహాయశస్వియగును. అద్భుతములు, రోమాంచకారకములు నగు కార్యముల జేయును.'

ఇట్లు వరముల నిచ్చి బ్రహ్మాదిదేవతలు, మహర్షులు తమ తమ నెలవులకు వెడలిరి.

## ఋషులు శాపము

బాలు డగు హనుమంతుడు మిక్కిలి చంచలుడు, అల్లరివాడు, పైగా ప్రళయంకరు డగు శంకరునియవతారము, కపిశాబకము, మీదు మిక్కిలి దేవతలచే నమోఘము లగు వరములను బొందినవాడు. వీనియల్లరికి తల్లిదండ్రులు మిక్కిలి ప్రసన్ను లగు చుండిరి. సింహముతోకను బట్టుకొని దానిని నలుపైపుల త్రిప్పుట, ఏనుగును బట్టుకొని దానిబలమును పరీక్షించుట అనుపనులు తఱచుగ వానికి నిత్యక్రీడలై యున్నవి. ఒకొక్కప్పు డతడు పెద్దపెద్దచెట్లను సమూలముగ పెఱికివేయును. ఈత డెగిరి యెక్కని పర్వతశిఖర మేదియు లేదు. దుర్గమము లగు వనములను, పర్వతములను సంపూర్ణముగ నితడు చూచియే యున్నాడు.

వన్యప్రాణుల కితడన్న భయము, కాని యవి మనస్సులో వానిని ప్రేమించుచుండును. ఇతడు సర్వప్రాణులకు మిత్రుడు, రక్షకుడు నై యున్నాడు. సబలు డెవ్వడైనా దుర్బలుని

బాధించిన బాలు డగు హనుమంతుడు ఊరకుండువాడుగాడు. ఇత డొక చెట్టునుండి మఱియొక చెట్టుపైకి దుముకుచు కొన్ని యామడలదూరము వెడలును. తనబరువుచే నే చెట్టుకొమ్మయైన విరుగునని సందేహము గలిగినచో వెంటనే యతడు తేలిక యగును.

వరములవలన గలిగిన శక్తితో హనుమానుడు ఋషుల యాశ్రమములలోనికి వెడలును. అచట వారికి కష్టమును గలిగించు పనులజేయుచుండును. ఒకఋషి యాసనమును మఱి యొకఋషి సమీపమున నుంచును. ఒకనిమృగచర్మమును కప్పుకొని చెట్టుపైకి ఎగురును, లేదా దాని నచ్చటే వ్రేలాడ వేయును. ఒకనికమండలములోని నీరును పారబోయును, మఱి యొకనికమండలమును పగులగొట్టును లేదా నీటిలో పార వేయును.

హనుమంతుడు జపముచేసికొను మునులయొడులలో గూర్చుండును. అహింసాపరాయణు డగు ముని ధ్యానస్థుడై జపముచేసికొనుచుండగా నితడు ఆయనగడ్డమును లాగిపారి పోవును. ఒకనికౌపీనమును, మఱియొకనిపారాయణ గ్రంథ మును పండ్లతోను చేతులతోను బట్టుకొని అటునిటు విసరి వేయుచుండును. సృక్స్రువాదులను విఱుగగొట్టును, మహా త్ములయజ్ఞపాత్రలను పగులగొట్టును. కష్టముతో సంపాదించు కొనిన నారచీరలను చింపిపారవేయును. బ్రహ్మాది దేవతలు

వరము లిచ్చియుండుటచే ఋషులు బాలహనుమాను నేమియు ననలేక మిన్నకుండిరి, కాని వానిబాధలకు మాత్రము తట్టుకొన జాలకుండిరి. తమమూఢాచారములను ఖండించుటకే ఆంజనేయు డట్లొనర్చినాడని ఋషులు తెలుసుకొన లేకపోయిరి.

మెల్ల మెల్లగ హనుమంతుడు విద్యాధ్యయనమునకు దగిన వయస్సు గలవాడయ్యెను, కాని వీనియల్లరిమాత్ర మట్లే యుండెను. తల్లిదండ్రులుగూడ చాల చింతితులైరి. వారు తమ ప్రియపుత్రున కెన్నియో విధముల బోధించిరి, ఎన్నియో విధ ముల యత్నించిరి. కాని యతడు తనయల్లరిని మానలేదు. చివరకు అంజనాదేవి, కేసరి ఋషులకడకు వెడలిరి. ఋషులు గూడ తమకష్టగాథలను వారికి తెలియజేసిరి. ఆదంపతులు వినయపూర్వకముగ ఋషుల కిట్లు విన్నవించుకొనిరి. "తపో ధనులారా! మా కీబాలు డెన్నియోదినముల పిమ్మట కఠోర తపఃప్రభావముచే లభించినాడు. మీరు వీని ననుగ్రహింపుడు. విద్యాసంపన్ను డగునట్లుగ వీని నాశీర్వదింపుడు. మీదయ వలన వీనిస్వభావము మారవచ్చును. దీనుల మగు మమ్ము కరుణింపుడు."

'వీనికి అమిత మగు తన బలపరాక్రమములన్న గర్వము మెండుగానున్నది. తన బలమును మరచినచో వీనికి యథార్థ మగు మేలుగలుగు'నని ఋషులు తలంచిరి.

'ఈ బాలుడు దేవతలకు హితమును జేకూర్పగలడు, భగవాను డగు శ్రీరామచంద్రునకు అనన్యభక్తుడగును.

అనుగతు డగు భక్తునకు బలాహంకార ముండుట ఉచితము గాదు. దీనభావముతోడనే ప్రభువునకు సేవచేయగలుగు'నని కొందఱు వయోవృద్ధు లగు ఋషులు భావించిరి.

ఈ కారణముచే భృగువుయొక్క, అంగిరసునియొక్క వంశములలో జన్మించిన ఋషులు హనుమంతు నిట్లు శపించిరి–'వానరవీరా! నీ వేబలము నాశ్రయించి మమ్ము బాధించు చున్నావో దానిని మాశాపముచే మోహితుడవై బహు కాలము మఱచియుందువు. నీబలమునుగూర్చి నీ వేమియు నెఱుంగజాలవు. ఎవరైన నీ కీర్తిని గుర్తుకుదెచ్చినపుడు నీబలము పెరుగును.'*

తాపసు లిట్లు శపించుటచే పవనకుమారుని తేజస్సు ఓజస్సు తఱగిపోయెను. అతడు మిక్కిలి సౌమ్యస్వభావము గలవాడయ్యెను. అప్పటినుండి యతడు తక్కినవానరబాలుర వలె ఆశ్రమములలో శాంతస్వభావముతో విహరింపసాగెను. మృదు వగు వీనినడవడిచే ఋషులందఱు చాలప్రసన్నముగ నుండసాగిరి.

---

* బాధసే యత్ సమాశ్రిత్య బలమస్మాన్ ప్లవంగమ ॥
తద్ దీర్ఘకాలం వేత్తాసి నాస్మాకం శాపమోహితః ।
యదా తే స్మార్యతే కీర్తి స్తదా తే వర్ధతే బలమ్ ॥

(వా. రా. 7-36-34, 35)

## మాతృబోధ

బాలునిపై తల్లి జీవితప్రభావము, ఆమెయుపదేశప్రభావము మిక్కుటముగ ప్రసరించును. ఆదర్శమాతలు తమపుత్రులను శ్రేష్ఠులుగను, ఆదర్శవంతులుగను తీర్చిదిద్దుదురు, ఇట్టి యుదాహరణము లెన్నియో పురాణములలోను, ఇతిహాసములలోను లభించును.

హనుమానునితల్లి యగు అంజనాదేవి పరమసదాచారిణి, తాపసి, సద్గుణసంపన్నురా లగు ఆదర్శమాత. ఆమె కుమారునికై ఎంతతత్పరతతో కఠోర మగు తపము నొనరించినదో అంతటి తత్పరతతో ప్రాణప్రియు డగు తన బాలునిజీవితమును చక్కదిద్దుటకు శ్రద్ధవహించినది. ఆమె హనుమానునివీరకృత్యముల జూచి మనస్సులో ముగ్ధురాలగుచు, వానికి ప్రోత్సాహమును కలుగజేయుచుండెడిది.

పూజానంతరము రాత్రులయందు పరుండుటకుపూర్వము ఆమె తనప్రియపుత్రునకు పురాణకథలను, ఆదర్శపురుషుల కథలను వినిపించుచు పుత్రునిమనస్సును వానివైపున కాకర్షించుటకు ప్రయత్నించుచుండెడిది. తాను బోధించిన మహాపురుషుల జీవితచరిత్రలనుగూర్చి మాటిమాటికి కుమారుని యడుగుచుండెడిది. బాలునకు నేర్వదగిన విషయ మేమున్నది? సర్వజ్ఞుడు, సర్వాంతర్యామియు నగు నీశ్వరునకు దెలియని రహస్య మేమియుండును! కాని లీలలో నప్పుడప్పుడు హనుమంతుడు

అజ్ఞునివలె సరిగ సమాధానముల నిచ్చెడివాడు కాడు. తల్లి మరల కథలను వినిపించి వానిని బాలునిచే కంఠస్థముచేయించు చుండెడిది. కరుణాసముద్రు డగు భగవానుని యవతారము లకు సంబంధించిన కథలన్నియు హనుమంతుని జిహ్వాగ్రము పైననే యుండును. ఆయన ఆకథల నన్నింటిని తనతోడివానర బాలురకు మిక్కిలి ప్రేమతోను, ఉత్సాహముతోను వినిపించెడి వాడు.

అంజనాదేవి శ్రీరామావతారకథను జెప్ప నారం భించినపుడు బాలు డగు హనుమానునిమనస్సు అంతయు పైకథయందే లగ్నమైయుండును. ఆసమయమున నిద్రాదేవి వాని నావహించెడిదికాదు. తల్లికి కునుకు వచ్చినచో అత డామెను పట్టుకొని యూపుచు 'అమ్మా! ఇంకను చెప్పుము చెప్పుము. తరువాత ఏమిజరిగిన'దని యడుగుచుండును.

తరువాత మరల తల్లి చెప్పసాగెడిది. శ్రీరామకథా శ్రవణమువలన హనుమానునకు తృప్తికలుగకపోవుచుండెడిది. మాటిమాటికి శ్రీరామునికథను వినిపించమని అత డామెను నిర్బంధించుచుండెడివాడు. అంజన మహోల్లాసపూర్వకముగ కథను వినిపించును, హనుమంతుడు దానిని తన్మయత్వముతో వినుచుండును. ఆసమయమున వానినేత్రములు అశ్రుపూర్ణము లగుచుండెడివి, శరీరమంతయు కపించిపోవుచుండెడిది. నేనుగూడ ఆహనుమానుడనే నైనచో నెంతబాగుండెడిది యనియతడను కొనుచుండును.

కథను వినిపించుచు అంజనాదేవి కుమారుని 'నాయనా! నీవు గూడ నట్టిహనుమంతు డవగుదువా' యనియడుగును.

'తప్పకుండగ నాహనుమంతుడనె యగుదు నమ్మా' యని హనుమానుడు సమధానమిచ్చెడివాడు. 'కాని ఆశ్రీరాముడు రావణుడు ఎచటనున్నారు! రావణుడు జనని యగు సీతాదేవి పై దృష్టివేసినచో నేను వానిని నలిపివేయుదు'నని చెప్పెడివాడు.

అంజనాదేవి యిట్లుపలుకుచుండును - "కుమారా! నీవు గూడ ఆహనుమానుడవె కమ్ము. ఇప్పటికిని లంకలో నొక రావణుడు రాజ్యముచేయుచున్నాడు. అయోధ్యాధిపతి యగు దశరథునకు పుత్రునిగ శ్రీరాము డవతరించినాడు. నీవు త్వరగ పెద్దవాడివికమ్ము. శ్రీరామునకు సాహాయ్యపడుటకు బలపౌరుషము లవసరములు. నీవు త్వరగ బలపరాక్రమసంపన్నుడవు కమ్ము."

'అమ్మా! నాలో శక్తికి లోటేమియున్నది' యనిపలికి హనుమంతుడు రాత్రియందు ప్రక్కనుండి క్రిందకు దుమికి, తనభుజముల జూపి తల్లియెదుట తాను అమితశక్తిశాలి నని నిరూపించుకొనును. అంజన నవ్వుచు తనప్రియపుత్రుని యొడిలోనికి దీసికొని వీపు నిమురుచు మధురస్వరముతో ప్రభువు గుణములను గానముచేయుచు నిద్రబుచ్చుచుండును. హనుమంతుడు అంజనాదేవియొడిలో సుఖముగ నిద్రించుచుండును.

సహజ మగు ననురాగముతో హనుమానుడు మాటిమాటికి శ్రీరామునికథను వినుచుండును. అట్లు వినుచు నతడు

మాటిమాటికి శ్రీరాముని స్మరించుకొనుచుండును. తత్ఫలితముగ వానికి శ్రీరామస్మరణ ముత్తరోత్తరము గాఢముగాజొచ్చెను. మెల్ల మెల్లగ వానిసమయములో నెక్కువ భాగము శ్రీరాముని ధ్యానమునందును స్మరణమునందును గడచిపోజొచ్చినది. అత డొకప్పుడు అరణ్యమునందును, మఱి యొకప్పుడు పర్వతగుహాలోను, ఒకప్పుడు నదీతటమునందును, ఇంకొకప్పుడు దట్టమగు పొదరింటిలోను ధ్యానస్థుడగును. వాని నేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండెడివి.

ఇట్లు ధ్యానమునందలి తన్మయత్వముచే వానికి ఆకలి దప్పులుగూడ కలుగుటలేదు. అంజనాదేవి మధ్యాహ్నమునందును, సాయంకాలమందును తనప్రియపుత్రుని వెదకుటకు పోయెడిది. తనపుత్రుడు ఉండు ప్రదేశము ఆమెకు దెలియును. అందువలన ఆమె వనములు, పర్వతములు, సరోవరములు, సెలయేళ్ళు అన్నింటియందు తిరిగితిరిగి హనుమానుని వెదకి తెచ్చెడిది. అప్పుడు తల్లి యొక్క పట్టుదలతో ఆహారమును దీసికొనును. ఇట్లు ప్రతిదినము జరుగుచుండును. ఒడలు తెలియనంతగ హనుమంతుడు తన కారాధ్యు డగు శ్రీరాముని ప్రేమలో తల్లీనుడగుచుండును, వానిముఖమునుండి కేవలము 'రామరామ' యను రెండక్షరములు నిరంతరము బయల్వెడలుచుండును.

## సూర్యునికడ విద్యనభ్యసించుట

అంజనాదేవి తన పుత్రునిమానసికస్థితిని జూచి అప్పు డప్పుడు విచారించుచుండెడిది తండ్రి యగు కేసరిగూడ ఆలోచనామగ్నుడగుచుండెను. హనుమంతుడు విద్య నభ్య సించుటకు దగినవయస్సు గలవాడయ్యెను. 'ఇపుడు వీనిని గురువుకడకు విద్యాభ్యాసమునకై పంపవలెను. దీనివలన నొకవేళ వీనియీదశ మారవచ్చు'నని తల్లిదండ్రు లాలో చించిరి. వారికి జ్ఞానమూర్తి యగు తమ పుత్రుని విద్యా బుద్ధులు, బలపౌరుషములు తెలియును. అంతేకాక బ్రహ్మాది దేవతలు కుమారున కిచ్చిన వరములవిషయముగూడ వారికి దెలియును. సామాన్యజనులు మహాపురుషుల ననుకరింతురు. సమాజమున అవ్యవస్థ యేర్పడు ననుభావముతో మహాపురు షులు స్వేచ్ఛగ ప్రవర్తింపరు. వారెల్లపుడు శాస్త్రమర్యా దను మనస్సున నుంచుకొని నియమానుకూలమున వ్యవహ రింతురు. అందువలన అప్పుడప్పుడు కరుణాసముద్రుడగు భగవానుడు భూతలముపై నవతరించుచుండును. ఆయన సర్వ జ్ఞానసంపన్నుడైనను విద్యాప్రాప్తికై గురుగృహమునకు వెడలు ను. అచట గురువునకేకవిధముల సేవించి బహుశ్రద్ధతో ఆయన నుండి విద్య నార్జించును. గురువును సేవచే సంతుష్టిపఱచి శ్రద్ధతోను భక్తితోను బొందిన విద్యయె ఫలవంతమగును. అందువలన అంజనాదేవి కేసరి విద్యాభ్యాసమునకై హనుమం తుని గురుగృహమునకు పంప నిశ్చయించుకొనిరి.

తల్లి దండ్రులు మహోల్లాసముతో హనుమంతున కుప నయనసంస్కారముచేసిరి. విద్యాప్రాప్తికై గురుచరణముల కడకు వెడలుట కనుజ్ఞ లభించినది; కాని యతడు సర్వగుణ సంపన్నుడగు నేయాదర్శగురువుకడకు వెడలవలెను? అంజనా దేవి ప్రేమాధిక్యముతో నిట్లుపలికెను-'కుమారా! సర్వశాస్త్ర మర్మజ్ఞుడు, సర్వలోకములకు సాక్షిగ నున్నవాడు సూర్య దేవుడు. సమయము వచ్చినపుడు నీకు విద్యచెప్పెదనని ఆయన మాటయిచ్చియున్నాడు. అందువలన నీ వాయనకడకు వెడలి శ్రద్ధాభక్తులతో విద్య నార్జింపుము'.

కౌపీనమును, యజ్ఞోపవీతమును ధరించి పలాశదండ మును, మృగచర్మమును దీసికొని బ్రహ్మచారి యగు హను మానుడు సూర్యభగవానునివైపు జూచి ఆలోచింపసాగెను. ఋషులశాపము నెఱింగిన అంజనాదేవి వెంటనే పుత్రునితో నిట్లుపలికినది-'కుమారా! సూర్యునిదూరము నీ కొక లెక్క లోనిది కాదు. నీ శక్తి హద్దు లేనిది. అరుణఫల మనితలంచి నీవు బాల్యమున నెవనిని పట్టుకొనదలచి ఎగిరితివో, అతడు ఈసూర్యుడే. ఆయనతో నీ వాటలాడుకొంటివి. నీవలన రాహువు భయపడి ఇంద్రునికడకు పారిపోయినాడు. నిన్ను జూచి యింద్రుడుగూడ భయపడిపోయినాడు. కుమారా! నీవు చేయలేని కార్య మేదియు లేదు. నీకు సంభవముకాని దేదియు లేదు. వెడలుము, సూర్యునినుండి చక్కగ జ్ఞానమును బొందుము. నీకు శుభమగును'.

ఇక చెప్పనదేమి? ఆంజనేయుడు తల్లిదండ్రుల చరణములకు మ్రొక్కి వారి యాశీస్సుల బొందెను. మరుక్షణమే యతడు ఆకసమున కెగురగా నెదుట సూర్యునిసారథి యగు అరుణుడు కనపడెను. హనుమంతుడు తండ్రి పేరు చెప్పి తన్ను పరిచయము చేసికొనెను. అరుణుడు వానికి సూర్యుని జూపెను.

అంజనానందనుడు మిక్కిలి శ్రద్ధతో భువనభాస్కరుని చరణములకు ప్రణమిల్లెను. సరళత్వము మూర్తీభవించినవాడు, నిశ్చలహృదయుడు. వినమ్రుడు బద్ధాంజలియై యెదుట నిలువబడియున్నవాడు నగు పవనకుమారుని జూచి సూర్యదేవుడు 'కుమారా! ఏల ఇచటనున్నా'వని యడిగెను.

హనుమాను అత్యంతము వినయముతో నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను-దేవా! ఉపనయనము గావించి నాతల్లి నన్ను విద్యాధ్యయనమునకై నీకడకు పంపినది. దయయుంచి నాకు జ్ఞానము నుపదేశింపుము'.

ఆదిత్యు డిట్లు పలికెను-"కుమారా! చూడుము నాస్థితి చాలావిచిత్రమైనది. నేను అహర్నిశములు రథముపై పరుగిడు చుందును, ఈయరుణుడు రథవేగమును తగ్గించుట ఎరుగడు, క్షుత్పిపాసలను, నిద్రను త్యజించి యనవరతము రథమును నడుపుచుండును, ఈ విషయమున పితామహునితో చెప్పుకొను అధికారముగూడ నాకు లేదు. రథమునుండి దిగుటకుగూడ నాకు వీలులేదు. ఇట్టిపరిస్థితిలో నేను నీకు శాస్త్రముల నెట్లు

బోధింతును? ఏమిచేయవలెనో నీవే ఆలోచించి చెప్పుము. నీవంటి ఆదర్శబాలుని శిష్యునిగా స్వీకరించుట నాకిష్టమే".

దివాకరుడు తప్పించుకొనుటకు ప్రయత్నించెను, కాని సమీరకుమారున కీవిషయమున నెట్టి కష్ట మున్నట్లు కనబడ లేదు. అతడు చాలవినయముతో 'దేవా! రథము వేగముగా పయనించినచో నాయధ్యయనమున కేమియాటంకము కలుగును? మీ కెట్టి యసౌకర్యముకలుగరాదు. నేను మీయెదుట కూర్చుందును. రథవేగముతోపాటు నేను ముందుకు పయనించు చుందు'నని పలికెను.

మారుతాత్మజుడు సూర్యదేవునివైపు ముఖముపెట్టి ఆయనకు ముందుగ సహజరూపమున పయనించుచుండెను.

సూర్యనారాయణున కీవిషయమున ఏమాత్ర మాశ్చర్యము కలుగలేదు. సమీరకుమారునిశక్తి యెట్టిదో ఆయనకు దెలియును. అంతేకాక అతడు స్వయముగ జ్ఞానులలో శ్రేష్ఠుడనియు, శాస్త్రమర్యాదను కాపాడుటకు, తనకు కీర్తిని గలిగించుటకు నితడిట్లు తనకడ విద్యాభ్యాసము చేయకోరుచున్నాడనియు సూర్యదేవునకు దెలియును:

సూర్యభగవానుడు వేదాదిశాస్త్రములను,సమస్తవిద్యల అంగోపాంగములను, వానిరహస్యములను ఎంత శీఘ్రముగ బోధింపదగునో అంతత్వరగ బోధించుచుండెను. హనుమానుడు శాంతభావముతో దానిని వినుచుండెను. ప్రశ్నోత్తరములకు

గాని, శంకాసమాధానములకుగాని అచట అవసరము లేకుం డెను, ఆదిత్యుడు హనుమంతునకు సంవత్సరములు గాని నెలలు గాని కాక కొలదిదినములలోనె వేదాదిశాస్త్రములను, ఉప శాస్త్రములను, మిగిలినవిద్యలను బోధించెను. హనుమంతునికి సహజముగనే సర్వవిద్యలు నివసించియున్నవి. యథావిధిగ విద్యాభ్యాసము పూర్తియైనవి. ఆయనఅన్నిటిలోను పారంగతు డయ్యెను.

అమితభక్తితో గురుచరణములకు సాష్టాంగదండప్రణా మ మాచరించి చేతులజోడించి ఆంజనేయుడు 'ప్రభూ! గురు దక్షిణరూపమున మీరు మీయభీష్టమును వ్యక్తముచేయ వలసినది' యని సూర్యుని ప్రార్థించెను.

'నాకేమియు అవసరము లేదు. కాని నీవు నాయంశతో పుట్టినవాడు వాలికి సోదరుడు నగు సుగ్రీవునకు రక్షకునిగా నుండునట్లు మాటనిమ్ము, అట్లు చేసిన నాకు మిక్కిలి సంతో షము కలుగు' నని నిష్కాముడగు సూర్యుడు ప్రత్యుత్తర మిచ్చెను.

'మీయాజ్ఞ నాకు శిరోధార్యము. నే నుండగా సుగ్రీ వున కెట్టి ఆపదయు సంభవింపదు. ఇది నాప్రతిజ్ఞ' యని అని అనిలాత్మజుడు గురువునెదుట ప్రతిజ్ఞచేసెను.

'నీకు సర్వవిధముల శుభము కలుగుగాక,' యని సూర్య

భగవానుడు ఆశీర్వదింపగా కేసరీనందనుడు గురుదేవునకు సాష్టాంగనమస్కారము చేసెను.

విద్వాంసుడైన పవనకుమారుడు గంధమాధనపర్వతము నకు దిరిగివచ్చి తనతల్లి దండ్రులచరణములకు నమస్కరించెను. తల్లి దండ్రులసంతోషములకు మేరలేకపోయెను. ఆసమయమున వారియింటిలో నొకగొప్పయుత్సవము జరుపబడినది. గంధమాదనపర్వతముపై హర్షోల్లాసములతో గూడిన యుత్సవము ఇంత సుందరముగ నింతపెద్దయెత్తున ఇంతకు పూర్వమెప్పుడును జరిగియుండలేదు. ఇట్టిదాని నెవ్వరు చూచియు నుండలేదు. వానర సముదాయమంతయు మహదానందమున మగ్నమైయుండెను. అందఱు తమ ప్రాణములకంటెను ప్రియుడగు అంజనానందనుని మనసారా ఆశీర్వదించిరి.

## శ్రీ సువర్చలా కల్యాణ రహస్యము

విశ్వకర్మకు ఛాయ యను సర్వగుణ సంపన్నురాలగు పుత్రిక కలదు, ఆమె సూర్యదేవుని ఉపాసించెను. విశ్వకర్మ తన పుత్రికమనస్సును దెలిసికొనినవాడై ఆమెను సూర్యభగవానున కర్పించెను. శ్రీ సూర్యభగవానుడు ప్రచండ మగు అగ్ని తేజముతో విరాజిల్లియుండెను. ఛాయాదేవి ఆమహాతేజమును భరింపలేక తల్లికి తెలిపెను. తన భార్యవలన విషయమును దెలిసికొనినవాడై విశ్వకర్మ తన తపశ్శక్తితో

సూర్యునినుండి ప్రచండ తేజమును వేరుచేసెను. దానినేసూర్య గోళమనిరి. తననుండి వేరైన తేజఃపుంజముపై శ్రీసూర్యభగవానుడు తనదృష్టిని సారించెను. ఆమహాతేజమునుండిసూర్యుని మానసపుత్రిక, అయోనిజ, అతిలోకసౌందర్యవతి, సకలసద్గుణసంపన్నురాలు, శ్రీపార్వతీదేవియొక్క పూర్ణాంశయు నగు సువర్చల ఆవిర్భవించెను. బ్రహ్మాదిదేవతలందరు ఆమహాతేజమును గాంచి పరమాశ్చర్యచకితులైరి ఇంద్రాదిదేవతలు బ్రహ్మదేవునితో సువర్చలాదేవికి భర్త యెవ్వరుకాగలరని ప్రశ్నించిరి. అందులకు బ్రహ్మ ఇట్లుపలికెను,

శ్లో॥ ఈశ్వరస్య మహత్తేజో-హనుమాన్దివి భాస్కరమ్
ఫలబుద్ధ్యాతు గృహ్ణీయాత్-కస్య భార్యా భవిష్యతి॥

సదాశివుని తేజోరూపుడగు శ్రీఆంజనేయుడు ఆకాశమునను న్న సూర్యుని ఫల మనుకొని పట్టుకొనుటకు ప్రయత్నింపగలడు. ఆ హనుమంతునకు సువర్చల భార్య కాగలదు. కాలానుసారముగ శ్రీహరిహర తేజము శ్రీఆంజనేయునిగా అవతరించెను.

శ్లో॥ ఆంజనేయస్తతః కాలే-బ్రహ్మచర్యపరాయణః
సమర్థోఽపి మహాతేజః-సంపశ్యన్లోకసంగ్రహమ్।
సూర్యమండల ముత్పత్య-వేదాధ్యయనకారణాత్
సప్రశ్రయ మువాచేదం-నమస్కృత్య దివాకరమ్॥

శ్రీఆంజనేయుడు బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుడు, సర్వజ్ఞాన

సంపన్నుడు, సర్వసమర్థుడు నైనను లోకమునకు ఆదర్శము జూపుటకై వేదాధ్యయనమును కారణముగా జేసికొని సూర్య భగవానునకు నమస్కరించెను. విద్యార్థియై పరావిద్య నర్థించెను. అందులకు శ్రీసూర్యభగవానుడు సానందముగ సమ్మతించెను.

శ్లో॥ తతో హనుమానేకం స్వం-పాదం కృత్వోదయాచలే
అస్తాద్రావేకపాదం చ-తిష్ఠన్నభిముఖో రవేః।
సాంగోపనిషదో వేదాన్-అవాప్య కపి పుంగవః
భాస్కరం తోషయామాస-సర్వవిద్యా విశారదః॥

శ్రీఆంజనేయుడు ఒకపాదమును ఉదయాద్రిపై, మరియొకపాదమును అస్తాద్రిపై నుంచి శ్రీసూర్యభగవానున కభిముఖముగ నిలబడి సాంగోపాంగముగ సకలవేదముల నభ్యసించి సకలవిద్యాకోవిదుడై తనగురుదేవుడైన సూర్యుని సంతోషపఱచెను.

శ్లో॥ తస్య బుద్ధిం చ విద్యాం చ బలశౌర్యపరాక్రమమ్
విచార్య తస్మై ప్రదదౌ స్వస్య కన్యాం సువర్చలామ్॥
(6వపటలం)

శ్రీఆంజనేయునిసద్బుద్ధిని, విద్యను, బలపరాక్రమాదులను జూచి శ్రీసూర్యభగవానుడు కనకుమార్తె యగు సువర్చలను అతనికి సమర్పించుటకు సంకల్పించెను.

బ్రహ్మాది దేవతలు జగత్కల్యాణార్థమై సువర్చలను వివాహమాడవలసినదిగా శ్రీ ఆంజనేయుని అనేక విధముల ప్రార్థించిరి. సుమేరుపర్వతముపై శ్రీ సువర్చలాంజనేయుల కళ్యాణమహోత్సవము జరిగెను. సకలదేవతలు, మహర్షులు, ఆ మహోత్సవములో పాల్గొని చరితార్థులైరి. శ్రీ ఆంజనేయుని స్నాతకోత్సవములో ఒకవిచిత్రసంఘటన సంభవించెను.

సంప్రదాయానుసారముగ శ్రీ ఆంజనేయుడు తపమొనరించుటకు బయలుదేరెను. ఆసమయములో తపమునకు పోవలదనియు, తమసహోదరిని కళ్యాణమాడి గృహస్థాశ్రమమును స్వీకరించవలసినదనియు బావమరుదులు బావగారిని ప్రార్థించు సమయమాసన్నమాయెను. పురోహితులు శ్రీ ఆంజనేయుని బావమరదులను పిలువనంపిరి. వారు సంయమినీపురాధీశ్వరుడు దండధరుడు నగు యమధర్మరాజు, గ్రహేశ్వరుడైన శనైశ్చరుడు. వారు శ్రీ ఆంజనేయునిపరిపూర్ణతత్త్వము గ్రహింపజాలక గర్వితులై స్నాతకోత్సవమునకు రాకుండగ విలంబనమొనరింపసాగిరి. వారిమనోగతభావములను సర్వసాక్షి యగు శ్రీ ఆంజనేయుడు గ్రహించెడు.

తుదకు బ్రహ్మదేవునియాజ్ఞానుసారముగ వారు స్నాతకమహోత్సవమునకు తరుదెంచిరి. కాని వారు అతిభయంకరరూపములను ప్రదర్శింపసాగిరి. వారిభీకరాకారములను గాంచి దేవాంగనలు భయమంది హాహాకారముల నొనరించిరి. అపుడు

లీలావతారుడగు శ్రీ ఆంజనేయుడు మహోత్కాలసన్నిభ మగు తన వాలముతో యమధర్మరాజును బంధించి గగనమున కెత్తినవాడై లోకాలోకములందు త్రిప్పుచు పరమపదమును చూపెను.

పరంధామమును గాంచి యమధర్మరాజు పరమానందభరితుడై గర్వమును వీడి శ్రీ హరిహరస్వరూపుడైన శ్రీ ఆంజనేయుని యనేక విధముల స్తుతించెను. శ్రీ ఆంజనేయస్వామి తన వాలముతో శనైశ్చరుని తలపై మోదగా ఆయన అధోముఖుడయ్యెను. శ్రీ ఆంజనేయుడు సాక్షాత్తుగా భగవంతుడని గ్రహించి గర్వమును వీడి శనైశ్చరుడు అనేక విధముల స్తుతించెను. శ్రీ యమధర్మరాజు, శ్రీ శనైశ్చరుడు ఆంజనేయునితో 'జగద్రక్షకా! నీ నిజస్వరూపమును తెలిసికొనలేక అజ్ఞానులమై గర్వించితిమి, అహంకరించితిమి. మమ్ములను క్షమింపుము. సర్వగుణసంపన్నురాలు, మహాశక్తిస్వరూపిణియు నగు మా సహోదరిని పరిణయమాడి, మమ్ముల ననుగ్రహింపుము. భక్తజనమందారా! నీ నామస్మరణము చేయు నీభక్తులను మేము ఏమాత్రమును పీడింపము. మేము వారికి ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించెదము. ఇది సత్యము' అని పలికిరి. ఆ ప్రదేశమునగల వారందరు యమధర్మరాజ శనైశ్చరగర్వభంగమును గాంచి, పరమాశ్చర్యచకితులై శ్రీ ఆంజనేయుని అనేక విధముల స్తుతించిరి.

శ్లో॥ జ్యేష్ఠశుద్ధ దశమ్యాం చ భగవాన్భాస్కరో నిజాం ।
సుతాం సువర్చలాం నామ ప్రాదాత్ప్రీత్యా హనూమతే ॥

జ్యేష్ఠశుద్ధదశమియందు శుభముహూర్తమున శ్రీసూర్యభగవానుడు తనకుమార్తె యగు సువర్చలాదేవిని శ్రీ ఆంజనేయునకు కన్యాదాన మొనరించెను. ఆ సమయములో సప్తఋషులు వధూవరుల ప్రవరల నిట్లుపలికిరి.

| శ్రీ ఆంజనేయప్రవర | శ్రీ సువర్చలాదేవి ప్రవర |
|---|---|
| ముత్తాత అంగిరసుడు | ముత్తాత బ్రహ్మదేవుడు |
| తాత మరీచుడు | తాత కశ్యపప్రజాపతి |
| తండ్రి వాయుదేవుడు | తండ్రి శ్రీ సూర్య భగవానుడు |
| కౌండిన్యగోత్రము | కాశ్యప గోత్రము |

ఆ సమయమందు దేవతలు పుష్పవృష్టి కావించిరి. ఆనకదుందుభులను మ్రోగించిరి. బ్రహ్మాదులు అనేక విధముల స్తుతించిరి. గంధర్వులు గాన మొనరించిరి. అప్సరసలు నృత్యముల నొనరించిరి. కిన్నెర కింపురుషాదిగాగల వారందరు జయజయ ధ్వానముల నొనరించిరి.

అత స్తస్యాం తిథౌ భక్తో వివాహోత్సవ మాచరేత్ ।
మూర్తిం సువర్చలాయాశ్చ తథైవ చ హనూమతః ॥
కారయిత్వా సువర్ణాద్యైః స్వగృహ్యోక్త విధానతః ।
నృత్యగీతైశ్చ వాద్యైశ్చ కారయేచ్చ యథావిధి ।
నృత్యం తు ద్వివిధం ప్రోక్త మేకం ద్రష్టుం మనోహరమ్ ॥

అంగభంగాత్మకం చాన్య త్సర్వపాప ప్రణాశనమ్ ।
వివాహే వాయుపుత్రస్య బ్రాహ్మణానపి భోజయేత్ ॥
పూర్ణిమాయాం నాకబలిం వివాహావభృథం చరేత్ ।
ఏవం యః కురుతే తస్య గేహే లక్ష్మీః స్వయం వసేత్ ॥
భుక్త్వాభోగాన్యథా కామం హనుమల్లోకమాప్నుయాత్ ॥

శ్రీసువర్చలాంజనేయ వివాహతిథియందు సువర్ణము మొదలగు శ్రేష్ఠలోహములతో మూర్తులను నిర్మించుకొని, స్వగృహములో విధానానుసారముగ నృత్యగీతాదులతో వాద్యములతో మనోహరముగా వాయుపుత్రుని కల్యాణ మహోత్సవమొనరించి, బ్రహ్మజ్ఞానులకు సంతర్పణగావింప వలెను. పిమ్మట అవభృథమును గావింపవలెను. అట్టిభక్తుల యింటియందు శ్రీలక్ష్మీదేవి స్థిరవాసముండును. ఇహలోక మందు ఇష్టసిద్ధులను పొంది వారు అంత్యకాలమందు శ్రీహనుమత్సాయుజ్యమును పొందుదురు.

శ్రీఆంజనేయుడు సత్యవ్రతుడు బ్రహ్మచారులందు శ్రేష్ఠుడు. కావున ఈకల్పాంతమువర కాయన గంధమాధన పర్వతాగ్రముపై శ్రీరామనామ సంకీర్తనమునందు సంలగ్నుడై యుండును. శ్రీ సువర్చలాదేవి ఈ కల్పాంతమువరకు పంపా తీరమున శ్రీ ఆంజనేయుని దివ్యనామజపమం దుండును. భావి కల్పమున శ్రీ ఆంజనేయుడు విధాత కాగలడు. సువర్చలా దేవి సరస్వతీదేవి కాగలదు. అందువలన శ్రీ ఆంజనేయుని యోగిజనులు అస్ఖలితబ్రహ్మచారి యని కీర్తించిరి.

శ్లో॥ జలాశ్రీనా కృషిస్సర్వా-భక్త్యాధీనం తు దైవతం
సర్వత్ర హానుమత్యో౽ధీనం ఇతి మే నిశ్చితా మతిః ॥

వ్యవసాయము వర్షముపై ఆధారపడియున్నది. భగవం తుడు భక్త్యాధీనుడై యుండును, కాని సకలము శ్రీ ఆంజనే యున కధీనమై యుండును. ఇది నా విశ్వాస మని శ్రీ పరాశర మహర్షి పలికెను.

శ్లో॥ హనుమాన్కల్పవృక్షో మే-హనుమాన్మమ కామధుక్ ।
చింతామణిస్తు హనుమాన్-కో విచారః కుతో భయమ్॥

శ్రీ ఆంజనేయస్వామియే నాపాలిట కల్పవృక్షము, హనుమంతుడే నాకు కామధేనువు, హనుమంతుడే సమ స్తము నొసంగు చింతామణి. ఇందు ఎట్టిసంశయము లేదు. ఆయనను నమ్మినవారి కిక భయ మెందుకు? అనగా భయము లేదని భావము. (శ్రీ పరాశరసంహిత- 6వ పటలము.)

శివరూపముతో నున్న శ్రీరాముని కలియుట

కర్పూరగారు డను శివునిలోను, శైలా కళేబరు డను శ్రీరామునిలోను అనన్యమగు ప్రేమగలదు. భగవాను డగు శ్రీరాముడు మహేశ్వరుడు వాస్తవముగా నొకేతత్త్వమై యున్నారు. వారిలో నెట్టిభేదము లేద నువిషయము సత్యమైనది. కనుకనే గోవిందునకు నమస్కరించువాడు శంకరునకుగూడ నమస్కరించును. అట్లే భక్తిపూర్వకముగా శ్రీహరి నర్చించు

వాడు వృషభధ్వజు డగు శివుని గూడ నర్చించును. విరూపాక్షుని ద్వేషించువాడు జనార్దనుని గూడ ద్వేషించును. అట్లే రుద్రుని నెఱుంగనివాడు అనగా రుద్రరూపము నెఱుంగనివాడు కేశవుని గూడ నెఱుంగజాలడు.* 1

అవ్యక్తు డగు నీవిష్ణువును, మహేశ్వరుడ నగు నన్ను నొకేవిధముగ జూచువానికి పునర్జన్మయుండదని భగవాను డగు శంకరుడు స్వయముగ జెప్పినాడు.* 2 కాని రసమయము మధురము నగు తమలీలలను ప్రదర్శించుటకే శీఘ్రసంతుష్టు డగు శివుడు మునిమనోరంజను డగు కేశవుడు వివిధరూపముల ధరించుచుందురు.

పాపతాపములను నివారించుటకు, ధర్మమును స్థాపించుటకు, ప్రాణులహితముకొఱకు శ్రీరాముడీ భూమిపై అవతరించుచుండును. అట్లే సర్వలోకమహేశ్వరు డగు శివుడుగూడ

* 1 హే నమస్యంతి గోవిందం తే నమస్యంతి శంకరమ్ ।
యేఽర్చయంతి హరిం భక్త్యా తేఽర్చయంతి వృషధ్వజమ్ ॥
యే ద్విషంతి విరూపాక్షం తే ద్విషంతి జనార్దనమ్ ।
యే రుద్రం నాభిజానంతి తేన జానంతి కేశవమ్ ॥
(రుద్రహృదయోపనిషత్ 6-7)

* 2 యే త్వేనం విష్ణుమవ్యక్తం మాం చ దేవం మహేశ్వరమ్ ।
ఏకీభావేన పశ్యంతి న తేషాం పునరుద్భవః ॥
(కూర్మపురాణము - ఈశ్వరగీత)

తనకు ప్రియతము డగు శ్రీరామునిమునిమనోమోహాకము, మధురము, మంగళమయము నగు లీలలను దర్శించుటకు భూమిపై నవతరించుచుండును. ఆయన తనయొకయంశతో శ్రీరామునిలీలను సహాయముచేయును, మఱియొకరూపముతో లోకపావన మగు ఆయనలీలను దర్శించి సంతుష్టు డగు చుండును. ఆసమయమున ఆతని యానందమున కవధులుండవు.

సర్వలోకపావను డగు శ్రీరాముడు మహాభాగ యగు కౌసల్యాదేవికి ప్రత్యక్షమయ్యెను. ఉమానాథు డగు శివుడు అయోధ్యానగరవీధులలో సంచరింపసాగెను. ఒకప్పు డాయన అయోధ్యాధిపతి యగు దశరథుని రాజద్వారమున ప్రభువు గుణములను గానముచేయు సాధువురూపమున, మఱియొక ప్పుడు భిక్షార్థమై విరక్తు డగు మహాత్మునివేషమున దర్శన మిచ్చెను. ఒకప్పుడు భగవానుని మంగళమయములగు నవ తారకథలను వినిపించు ప్రసిద్ధవిద్వాంసునిరూపమున రాజ ప్రాసాదమునకు విచ్చేయును, మఱియొకప్పుడు త్రికాలదర్శి యగు దైవజ్ఞునిరూపమున దశరథునికుమారు డగు బాల రాముని జాతకఫలమును జెప్పుటకు వచ్చును. ఇట్లాయన ఏదియోనొకనెపముతో శ్రీరాముని సమీపమునకు వచ్చుచుం డును. శంకరు డొకప్పుడు బాలుని ఎత్తుకొనును. ఒకప్పుడు హస్తములోని రేఖలను జూచు మిషతో కోమలతమము దివ్యము నగు శిశువుహస్తపద్మమును నిమురును. మఱియొక

ప్పుడు తనజడలతో కమలములవలె ఎఱ్ఱనైన చిన్నచిన్న అరి కాళ్ళను తుడుచును. ఇంకొకప్పుడు దేవదుర్లభములు, సుకోమలములు, అరుణోత్పలసదృశములు నగు చరణములను తన విశాలనేత్రములతో స్పృశించి పరమానందమున మగ్నుడగును. మెల్లమెల్లగ కౌసల్యానందనుడు రాజద్వారమువఱకు రాసాగెను.

ఒకనాటిమాట. పార్వతీవల్లభుడు 'భిక్షుకుని' వేషమును ధరించి డమరుకమును మోగించుచు రాజద్వారమును సమీపించెను. వానివెంట నృత్యముచేయు సుందర మగు నొకకోతి గూడ నుండెను. ఆ భిక్షుకునివెంట అయోధ్యలోని బాలురసమూహము ఉండెను.

డమరుకము మోగసాగెను, కొలదిసేపటిలోనే శ్రీరామునితో గూడ నలుగురుసోదరులు రాజద్వారముకడకు వచ్చిరి. భిక్షుకుడు డమరుకమును మోగించెను. కోతి రెండు చేతులను జోడించినది. సోదరులతో గూడ శ్రీరాముడు నవ్వెను

వృషభధ్వజు డగు నీశ్వరుడు తనయొకయంశతో శ్రీరామునియెదుట నృత్యముచేయుచుండెను. తన రెండవయంశతో స్వయముగ దాని నాడించుచుండెను. నాట్యముచేయువాడు, చేయించువాడు ఆయనయే. శ్రీరామచరణానురాగియైనవాడు పార్వతీవల్లభుడు; వానరనాట్యముచే ముగ్ధుడై మాటిమాటికి చప్పట్లుకొట్టువాడు సమస్తసృష్టిని నటమర్కట

నమస్కరించి ఆశీస్సుల బొంది పంపాపురమునకు ప్రయాణ మయ్యెను.

పవనకుమారుడు పంపానగరమునకు వచ్చుచున్నాడను వార్త వినినంతనె సుగ్రీవుడు ఎదురేగి వానికి స్వాగతమిచ్చెను. దేవదుర్లభములగు వానిగుణముల నెఱింగియుండుటచే వాలి గూడ వాని నెక్కువగా గౌరవించి ఆదరముతో దనకడ నుంచు కొనెను. హనుమంతుడు విద్వాంసుడు, బుద్ధిమంతుడు, ధైర్యవంతుడు, సదాచారపరాయణుడు, సరళత్వము మూర్తీభవించినవాడు, అందువలన వాలి వానిని తన కాంతరంగికునిగా జేసికొనెను కాని విద్యావారిధి యగు కేసరీనందనుడు తనగురుదక్షిణవిషయము నెప్పుడును మరువలేదు. అందువలన ఆయన సుగ్రీవునకు కభిన్నమిత్రు డయ్యెను. సుగ్రీవునకుగూడ వీనిపై నతిశయమగు ప్రేమయుండెను.

వజ్రకాయు డగు హనుమంతుడు పంపాపురమునకు వెడలినపుడు ఆపురమునకు నలువైపుల రాక్షసరాజ్యము లుండెను. ఒకవైపున శక్తిశాలురగు ఖరదూషణాదుల రాజ్యము, రెండవవైపు దేవద్విజద్రోహి యగు రావణుని నిష్కంటక రాజ్యము నుండెను. వానరరాజగు వాలి సాటిలేని వీరుడు, యోధుడు. అందువలన అసురులందఱు వానిని జూచి భయపడుచుండిరి. వా రాతనిరాజ్యమున అల్లకల్లోలము సృష్టించుటకు సాహసింపలేకపోవుచుండిరి. కాని రాక్షసుల దౌష్ట్యమును ఎఱిగి

యున్నవాడగుటచే వాలి నిశ్చింతగ దుష్టశిక్షణకై యెక్కడికిని దూరము వెడలెడివాడు కాడు. హనుమంతుడు పంపాపురమునకు వచ్చినపిమ్మట వానిచింత దాదాపుగ దూరమయ్యెను. అంజనా దేవి అలౌకికుడగు తనపుత్రునకు రాక్షసులనుగూర్చిన కథల నన్నింటినో చెప్పినది. అందువలన బాల్యమునుండియే హనుమం తునకు రాక్షసులన్న కోపము మిక్కుటముగ నుండెను. వానిదృ ష్టిలో బడిన ఏరాక్షసుడుఁగూడ క్షేమముగ బ్రతికి బయటపడుట యసంభవమే. ఆయన వెదకి వెదకి రాక్షసులప్రాణములను దీయు చుండును. వానిపేరు చెప్పినంతనె రాక్షసులు వణకిపోవుచుండిరి. హనుమంతుని సరళత్వమును, సాధుత్వమును, సాటిలేనివాని వీరత్వమును, ధైర్యమును, పరాక్రమమును జూచి వాలి చకితు డగుచుండెను.

వీరవరులగు వాలిసుగ్రీవుల పరస్పరప్రేమవృత్తాంతము అంతట ప్రసిద్ధి చెందియుండెను. వారిరువురు మిక్కిలి సుఖముగ జీవితమును గడుపుచుండిరి. దైవనిర్ణయము అనుల్లంఘనీయము గదా! వారిరువురు తమసహజప్రేమను మరచి ఒకరినొకరు చంపుకొనుస్థితికి దైవము వారిని దీసికొనివెడలినది. దాని వలన వారు పరస్పరము రక్త పిపాసులైరి.

అపుడు మయునిపుత్రుడగు 'మాయావి' యను దానవుడు తనపరాక్రమ గర్వముచే నున్మత్తుడై తనతో సాటివచ్చువీరుని (ప్రతిభటుని) వెదకుచు తిరుగుచుండెను. ఒకనాటివిషయము

యగు వాలితో స్నేహముచేసికొనినాడు. వాలి తనసోదరుడగు సుగ్రీవునిపై కత్తిగట్టి యున్నాడు. భయాక్రాంతుడగు సుగ్రీవుడు ఋష్యమూకపర్వతముపై నివసించుచున్నాడు. అందువలన నీవు ఋష్యమూకపర్వతముమీదకు వెడలి సుగ్రీవునితో సఖ్యముచేసికొనుము. నేను నాప్రక్కన నివసించు మారీచుని, సుబాహుని, తాటకిని ఉద్ధరించి కొలదిదినములలోనే దండకారణ్యమున ఖరదూషణులు, త్రిశిరుడు, శూర్పణఖవంటి కంటకప్రాయులను దొలగించుచు ఋష్యమూకము వైపునకు వత్తును. అచట నీవు నాతో సుగ్రీవుని గలుపుము, వానరసైన్యములద్వారా నాయవతారకార్యమున సహాయపడుము.'

హనుమంతుడు తనప్రభువు నెడ బాయుట కిష్టపడుట లేదు, అయినను ప్రభువాజ్ఞను పాలించుటయే ముఖ్యకర్తవ్యము. ఆయన శ్రీరామునిచరణములకు ప్రణమిల్లి, కళ్యాణమయములగు ఆయనమధురనామములను జపించుచు ఋష్యమూకపర్వతమునకు బయలుదేరెను.

## సుగ్రీవ సచివుడు

ఋక్షరాజగు వానరునకు వాలి సుగ్రీవు లను నిరువురు పుత్రులుండిరి.* తండ్రి తనకుమారులిరువురిని ఒకేవిధముగ

---

* వానరేంద్రం మహేన్ద్రాభమిన్ద్రో వాలినమాత్మజమ్।
సుగ్రీవం జనయామాస తపనస్తపతాం వరః

దేవతలకు రాజగు నింద్రుడు వానరరాజగు వాలిని పుత్రరూపమున కనెను, అతడు మహేంద్రపర్వతమువలె విశాలకాయుడు, బలిష్ఠుడు. తపించువారిలో శ్రేష్ఠుడగు సూర్యుడు సుగ్రీవుని కనెను (వా.రా.1-17-10)

ప్రేమించుచుండెను. బాలు రిరువురు గొప్పవీరులు, ధీరులు, బలవంతులు, బుద్ధిమంతులు, సుందరులు. వా రన్యోన్యము ప్రేమకలిగియుండిరి. వాలి సుగ్రీవుని ప్రాణములతో సమాన ముగ ప్రేమించును. సుగ్రీవుడు వాలిపై తండ్రివలె శ్రద్ధాభక్తు లను జూపుచుండును. సోదరులిరువురు భోజనశయనక్రీడాదుల నొకేవిధముగ నిర్వహించుచుండిరి. తఱచుగ వా రెల్లప్పుడు కలసియే యుందురు.

మంత్రులు తండ్రిమరణానంతరము జ్యేష్ఠుడగుటవలన వాలిని వానరరాజ్యమునకు రాజుగా జేసిరి. అతడు సర్వవానర జాతికి మిక్కిలి ప్రీతిపాత్రుడయ్యెను. అంతేకాక తనప్రజ నతడు పుత్రరూపముగ ప్రేమించుచుండెను. ఇట్లు వాలి విశాలమగు కిష్కింధా రాజ్యమును బాలించుచుండగా సుగ్రీవుడు శ్రద్ధాసక్తుల తోను వినయవిధేయతలతోను దాసునివలె తన యన్నను సేవించుచుండెను.

వానరరాజగు కేసరి అంజనాదేవి యిరువురు తమపుత్రు డగు హనుమానుని వైరాగ్యమును, ఏకాంత ప్రియత్వమును జూచి మిక్కిలిగ చింతింపసాగిరి. కేసరి వానరయూథపతి, ఋక్షరాజునకు పరమమిత్రుడై యున్నవాడు. అందువలన అతడు హనుమంతుని రాజనీతికోవిదునిగా జేయదలచి పంపాపుర మునకు పంప నిశ్చయించుకొనెను. మాతాపితృభక్తుడగు హను మంతుడు తల్లిదండ్రులయాదేశమునను సరించి వారిచరణములకు

మువలె ఆడించు సర్వలోకాధిపతియు కౌసల్యానందవర్ధనుడు నగు శ్రీరాముడు.

చివరకు భగవాను డగు శ్రీరాముడు ప్రసన్నుడై నాకీ వానరము కావలయు ననిమారాముచేసెను.

చక్రవర్తి యగు దశరథమహారాజునకు జ్యేష్ఠపుత్రుడైన శ్రీరామునికోరిక యేలనెఱవేరకుండును. భిక్షుకుడు ఎంతటి మూల్యమును దీసికొనిను వానరముమాత్రము శ్రీరామునికడ నుండవలసినదే. భిక్షుకునకుగూడ నిదియే యిష్టము. తన ప్రభువుచరణములకు సమర్పితముకావలయు నను ఉద్దేశ్యము తోడనే అతడు రాజద్వారముకడకు వచ్చెను. నూతనజలధర చ్ఛాయవంటితనువుగల శ్రీరాముడు తనకరకమలములతో వానరమును దీసికొనెను. యుగయుగములనుండి యున్న అ వానరముయొక్క కోరిక నేటికి నెఱవేరినది. అది వివిధరీతుల నాట్యముచేసినది. ఇంతవఱకును పరమశివుడు వానరరూపమున తన్నుతాను నాట్యము చేయుంచుకొనుచుండెను. ప్రస్తుత మా యనయే నాట్యముచేయుచుండెను. ఆయనను నాట్యము చేయించువాడు మునిమనోమానసమరాళమగు దశరథ కుమారుడే. ఆవానరముయొక్క సుఖమునకు, సౌభాగ్యమునకు, ఆనందమునకు హద్దు యే లేకుండెను. అది వివిధరీతుల మనో మోహకము లగు హావభావములను ప్రదర్శించుచు తనప్రభువు నెదుట నృత్యము చేయుటలో తన్మయత్వము చెందియుండెను. భిక్షుకుడు అదృశ్యమయ్యెను. ఆయన కైలాసశిఖరమునకు

వెడలినాడా లేక తన ప్రభువులీలను దర్శించుటకు మఱియొక రూపమును ధరించినాడా యను విషయము తెలియలేదు.

ఇట్లు హనుమంతునకు తనస్వామి యగు శ్రీరామునికడ నుండు అవసరము కలిగినది. శ్రీరాముడు హనుమంతుని మిక్కుటముగా ప్రేమించుచుండెను. ఆయన హనుమంతుని సమీపమున గూర్చుండును, వానితో ఆడును. బంగారుఛాయ వంటి వానిమేనిని తనకరకమలములతో నిమురును. ఒకప్పుడు నృత్యముచేయుటకు వానికి అనుమతియిచ్చును, మఱియొక ప్పుడు పరుగెత్తించి వస్తువు నొకదానిని వానిచే తెప్పించును. హనుమంతుడు తనప్రభు విచ్చు నేయాజ్ఞనైనను మిగుల ఆదరము తోడును, ఉత్సాహముతోడను, సంతోషముతోడను నెవేఱ ర్చును. అతడనేకవిధముల శ్రీరాముని సంతోషపెట్టును.

ఇట్లెన్నియో సంవత్సరములు అర్ధక్షణమువలె గడచి పోయెను. విశ్వామిత్రమహర్షి అయోధ్యకు విచ్చెసెను. ఆయన తో వెడలవలసిన అవసరము గలిగినపుడు శ్రీరాముడు హను మంతుని యొంటరిగ బిలచి యిట్లుపలికెను – 'అంతరంగిక మిత్రుడ వగు హనుమా! నే నీ భూమిపై నవతరించుటకు గల ప్రధానకార్య మిపు డారంభము కాబోవనున్నది. లంకాధిపతి యగు రావణుని దుశ్చేష్టలచే పృథివి వికలమైనది. ఇపుడు నేను వానిని వధించి పుడమిపై ధర్మమును నిలబెట్టెదను. ఈకార్య మున నీవు నాకు సహాయపడవలెను. దశాననుడు మహాబలి

అర్థరాత్రిసమయమున బలవంతు డగు ఆయసురుడు కిష్కింధా పురపుపొలిమేరలలోనికి వచ్చి వాలిని సవాలుచేయుచు భయంకరముగ గర్జించుచుండెను.

పరాక్రమశాలి యగు వాలి శత్రువుపిలుపును వినినంతనె వానిని చంపుట కెల్లప్పుడును సిద్ధముగనే యుండును. ఆయన గాఢనిద్రలో నుండెను. అయినను అసురునిసవాలు వినబడినంతనె ప్రక్కనుండి లేచి వెంటనే పరుగిడెను. శత్రువునెదుటకు వెడలు అన్నను జూచి సుగ్రీవుడుగూడ ఆయనవెంట వెడలెను. అట్లు వాలిసుగ్రీవులిరువురు వచ్చుటచూచి మాయావి భీతిచెంది వేగముగ పరుగిడెను. సోదరులిరువురు వానిని వెంబడించిరి.

చాలదూరము వెడలినపిమ్మట గడ్డిగాదముతో గప్పబడియున్న నొకవిశాలబిలము నతడు చూచి, వెంటనే దానిలో బ్రవేశించెను. క్రోధోన్మత్తు డగు వాలి సుగ్రీవుని ఆబిలద్వారముకడ సావధానముగ నుండమనిచెప్పి తాను లోనికి ప్రవేశించెను.

వాలి సోదరు డగు సుగ్రీవుని పదునైదుదినములవఱకు బిలద్వారముకడ జాగ్రత్తగ నుండమనిచెప్పెను. కాని సుగ్రీవుడు ఒకమాసమువఱకు అచట చాలజాగ్రత్తగ నుండెను. బిలద్వారమునుండి వానికి రాక్షసులకోలాహలము వినబడసాగినది. కాని వాలిశబ్ద మేదియు వినబడకపోయెను. అతడు తనయన్నను గూర్చి యాలోచింపసాగెను. ఇంతలో వానియెదుట గుహ

నుండి నురుగుతో గూడ రక్తము ప్రవహింపజొచ్చినది. భ్రాతృస్నేహమువలన సుగ్రీవుడు వ్యాకులుడయ్యెను. అన్న విషయమై వానికి సందేహ ముత్పన్నమయ్యెను.

ఎంతప్రయత్నించినను వానికి వాలిజాడ తెలియ దయ్యెను. 'ఈ విశాలబిలమున అసురులందఱు గలసి నాసోద రుని జంపియుండవచ్చును, వారు బయటకువచ్చి నన్నుగూడ జంపవచ్చు' ననిసుగ్రీవుడు తలంచెను.

మిక్కిలి దుఃఖితుడై యతడు తనరక్షణకై ఒకపెద్ద బండరాతిని బిలద్వారమున కడ్డముగ నుంచి, విచారవదనుడై వాలికి జలాంజలి వదలి కిష్కింధకు వెడలెను.

సుగ్రీవుడు తనయన్న మరణమును గుప్తముగ నుంచ దలంచెను, కాని చతురులగు మంత్రులు యువరాజగు అంగదుడు చిన్నవాడుగా నుండుటవలన సుగ్రీవునే రాజుగా నొనర్చిరి. అప్పటినుండి యతడు నీతిపూర్వకముగ రాజ్యాధి కారమును నిర్వహింపసాగెను.

అచటవీరవరు డగు వాలి రాక్షసుల నందఱను సంహ రించి రాజధానికి మరలెను. సుగ్రీవుడు తనకు బదులుగా రాజ సింహాసనము నధిష్ఠించియుండుటచూచి వాలి మిక్కిలి క్రుద్ధుడ య్యెను.

'స్వార్థపరు డగు నాయీసోదరుడు నాభార్యను, రాజ్య మును పొందదలచి బిలద్వారమును బండరాతితో కప్పివేసినాడు,

దానివలన నేను బయటకు రాజాలక లోపలే మరణింతుననియు వానియూహయై యుండనోపు' అను ఆలోచన మనస్సు లోనికి వచ్చినంతనే నేయివోయ భగ్గని దరికొన్న అగ్నివలె వాలి క్రోధోన్మత్తుడయ్యెను.

క్రోధారుణలోచను డగు తనయన్నను జూచినంతనే సుగ్రీవుడు వానిరాజ్యమును వాని కిచ్చివేసి, కలరూపెటింగింప ప్రయత్నించెను, కాని మహాక్రుద్ధుడగు వాలి సుగ్రీవునకు బద్ధశతృవయ్యెను. అతడు రాజ్యముతోపాటు సుగ్రీవునిభార్య యగు రుమనుగూడ లాగికొని, సుగ్రీవుని వధింపదలంచెను. సుగ్రీవుడు ప్రాణరక్షణార్థమై మంత్రులతో గలసి పాఱి పోయెను.

భయకంపితు డగు సుగ్రీవుడు పరుగిడుచుండెను. వాలి వానిని చంపదలచి వెంటబడెను. నదులను, నదములను, వన ములను, పర్వతములను, సముద్రములను, నగరములను దాటుచు సుగ్రీవుడు పరుగిడుచుండెను. ఎక్కడగూడ నొక్క దినమైనను నిలబడుటకు వానికి ధైర్యము లేకపోయెను. వాలి ప్రాణఘాతకు డగు శతృవువలె వెంబడించుచుండెను.

అట్లు పరుగిడుచు సుగ్రీవుడు హిమాలయమును, మేరు వును, ఉత్తరసముద్రమును సమీపించెను. అయినను వాలి వానిని విడువలేదు. సుగ్రీవున కెవ్వరును అభయమిచ్చువారు కనబడకపోయిరి. అపుడు వాని వెంట నిరంతరము నీడవలె

నున్నవాడు జ్ఞానులలో శ్రేష్ఠుడు నగు హనుమంతునకు దుందుభివధనుగూర్చిన ఘటన జ్ఞాపకమునకు వచ్చెను.

మహిషవేషములో నుండు దుందుభి యను దైత్యుడు వేయియేనుగులబలముగలవాడు. తాను గొప్పశక్తివంతుడనను గర్వము వానికి మిక్కుటముగా నుండెను. ఒకనాటివిషయము, దుందుభి సముద్రుని, హిమవంతుని తిరస్కరించి గర్జించుచు వీరశిరోమణియగు వాలితో యుద్ధముచేయుటకు కిష్కింధా పురపుపొలిమేరలలోనికి వచ్చి బిగ్గరగ దుందుభిధ్వనివలె గర్జింపసాగెను. దుందుభి తనగిట్టలతో భూమిని త్రవ్వుచు, వృక్షములను నాశముచేయుచు, పురద్వారమును కొమ్ము లతో విరుగగొట్టయత్నించుచు యుద్ధమున కాహ్వానించు చుండెను.

వానిగర్జనమును విని పరాక్రమశ్రేష్ఠు డగు వాలి కోప ముతో బయటకు వచ్చెను. అపుడు వానికంఠము ఇంద్రప్రద త్తము, విజయప్రదాయిని యగు సువర్ణమాలతో శోభిల్లుచుం డెను. దుందుభిని జూచినంతనె వానితో యుద్ధముచేయుటకు వాలి సంసిద్ధుడయ్యెను. దుందుభి తనకొమ్ములతో పొడుచు టకై మిక్కిలివేగముగ వాలిపైకి దుమికెను. వెంటనే వాలి వానిరెండుకొమ్ములను గట్టిగ పట్టుకొని నలువైపుల వానిని త్రిప్పసాగెను.

అపుడు వాలిరూపము క్రోధముచే భయంకరముగ నుండెను. అతడు మాటిమాటికి బిగ్గరగ గర్జించుచుండెను. ఇట్లతడు మొదట పర్వతాకారుడగు రాక్షసుని నలువైపుల త్రిప్పి బలముగ నేలపైగొట్టెను. దుందుభి రెండుచెవులనుండి రక్తధారలు ప్రవహింపసాగెను.

అమితశక్తిశాలి యగు దుందుభి లేచి వెంటనే మరల వాలిని ఎదుర్కొనెను. వారిరువురు ఘోరముగ పోరాడసాగిరి. వారొకరినొకరు చంపుకొనజూచుచుండిరి. దుందుభి తనగిట్టలతోను, కొమ్ములతోను వాలి నెదుర్కొనుచుండెను. వాలి పిడికిలిపోటులతోను, కాలితన్నులతోను, రాళ్ళతోను, వృక్షములతోను దుందుభిని గొట్టుచుండెను.

వీరవరుడగు వాలిదెబ్బలచే దుందుభిబలము క్షీణింపసాగెను. చివర కతడు దుర్దమనీయుడగు నాదానవుని పైకెత్తి తన సంపూర్ణశక్తితో నేలపై గొట్టెను, దుమికి వానిపైన గూర్చుండెను. సాటిలేని వాలిబరువును వాడు మోయలేక పోయెను. వానియవయవములనుండి రక్తము ప్రవహింపసాగెను. వెంటనే వాడు నేలపై గూలి ప్రాణములను విడచెను.

దుందుభిమరణానంతరము వాలి మిక్కిలి కోపముతో వానిశవము నొకయోజనముదూరము విసరెను. అది మతంగ ముని యాశ్రమమున బడెను. వేగముగ విసరుటచే చనిపోయిన

ఆయసురుని శరీరమునుండి ప్రవహించిన రక్తబిందువులు కొన్ని మహాముని శరీరముపై బడెను.

తనశరీరముపై బడిన రక్తబిందువులను జూచి మహాముని ఆలోచనామగ్నుడయ్యెను. కారణము నన్వేషింపగా ఆయనకు పర్వతాకారమున నున్న మహిషకళేబరము కనబడెను. తన తపోబలముచే మహర్షి యీదుష్టకార్యము నెవరు చేసిరో తెలిసికొనెను. వెంటనే ఆయన వాలిని 'అత డీయాశ్రమము లోనికి ప్రవేశించినచో వానితల ముక్కలు ముక్కలు కాగల' దని శపించెను.

హనుమంతుడు భయపడు సుగ్రీవునితో నిట్లు పలికెను- రాజా! మతంగమహామునిచే వాలి కీయబడిన శాపము నా కిపుడు జ్ఞప్తికివచ్చినది. కుపితుడై మహాముని వాలిని ఇట్లు శపించెను.

.... .... .... ....హ్యస్మిన్నాశ్రమమండలే ।
ప్రవిశేద్యది వై వాలీ మూర్ధాస్య శతధా భవేత్ ॥
తత్ర వాసః సుఖోఽస్మాకం నిరుద్విగ్నో భవిష్యతి ॥
(వా. రా. 4-46-22,23)

"వాలి యీ యాశ్రమములోనికి ప్రవేశించినచో వాని శిరస్సు నూఱువక్కలు కాగలదు. అందువలన అచటకు వెడలి నివసించుట మనకు మిగుల శ్రేయస్కరము, ఎట్టి భయము నుండదు"

వెంటనే సుగ్రీవుడు తనముఖ్యసచివు డగు హనుమం తుడు చెప్పిన దానిననుసరించి ఋష్యమూకపర్వతముపై గల మతంగమహాముని యాశ్రమమునకు వెడలెను. మహర్షి శాప భయముచే వాలి యచటికి పోజాలకపోయెను. చేయునదిలేక తిరిగివెడలెను.

రాజనీతివిశారదు డగు వాలి పవనకుమారుని మిగుల గౌరవముతో దనకడ నుంచుకొనదలచుచుండెను, కాని ఆంజ నేయుడు సుగ్రీవునిక్షేమమును గోరుచుండెను. సుఖముగ నున్నపు డందఱు చుట్టిముట్టియుందురు. కాని ఆపదవచ్చి నపుడు వారు విడచిపోవుదురు, నిజమగు మిత్రులు సేవకులె ఆపదసమయమున ప్రేమతోను భక్తితోను సహాయపడుదురు.

అంజనానందనుడు సుఖసమయమున సుగ్రీవునితో గూడియుండెను. ఆపత్కాలమున అతడు వాని నెట్లు విడచి పుచ్చును? అత డెల్లపుడు సుగ్రీవునితో నుండి వాని బాగోగు లను పరిశీలించుచుండును. చక్కగ పరామర్శించి, వానికి ధైర్యము చెప్పుచుండును. హనుమంతుని యోదార్పుతో సుగ్రీ వుడు కష్టకాలమునందుగూడ సుఖమునే అనుభవించుచుండెను. పవనకుమారుడు తనకు మంత్రియే కాదు, సాటిలేని మిత్రుడు, సోదరతుల్యుడు నై యున్నాడు.

సర్వస్వము లాగికొని వాలిచే బహిష్కృతుడైనను సుగ్రీవుడు తన ప్రియసచివు డగు హనుమంతునివలన ఋష్య

మూకపర్వతముపై రాజువలె సుఖముగ కాలముగడుపుచుండెను.

ఋష్యమూకపర్వతముమీదకు శాపమువలన వాలి స్వయముగ రాజాలకుండెను. అందువలన నతడు తనవారిని పంపి సుగ్రీవుని జంప ప్రయత్నించుచుండెను. ఈవిషయము సుగ్రీవునకు జక్కగా దెలియును కాని యతడు హనుమంతుని శక్తిని పరాక్రమమును, విలక్షణబుద్ధిని గట్టిగ నమ్మియుండుటచే నిశ్చింతగ నుండెను. మహావీరుడగు హనుమానుడు సుగ్రీవుని యాజ్ఞాపాలనమున ఎప్పుడును తత్పరుడై యుండును. సర్వగుణసంపన్నుడగు పవనకుమారుడు తనకు పుత్రునిగను, సచివునిగను లభించినందులకు సుగ్రీవుడు తనయదృష్టము నెల్లపుడు పొగడుకొనుచుండును.

## ఆరాధ్యుడగు శ్రీరాముని పాదపద్మములయందు

తండ్రియాజ్ఞను పాలించుటకై శ్రీరాముడు తన సహధర్మచారిణి యగు జనకనందినిని, అనుజుడగు లక్ష్మణుని వెంటనిడుకొని వనమునకు వెడలెను. ఆయన చిత్రకూటములోను, దండకారణ్యములోను పదుమూడుసంవత్సరములవఱకు ఋషులను సర్వప్రాణులను ధన్యులుగాజేయుచు సంచరించుచుండెను. అసురు లెచ్చటనైన తాపసులకు బాధను గలుగజేయుచున్నా రనువార్తను విన్నంతనె శ్రీరాముడు వారి నచట సంహరించి మునులప్రాణములను గాపాడుచుండెను.

పదునాల్గవసంవత్సరమున సీతారామలక్ష్మణులు పంచవటిలో సుందరమగు నొకపర్ణకుటీరమును నిర్మించుకొని దానిలో నివసింపసాగిరి. ఒకదినమున లంకాధిపతి యగు రావణుని ప్రేరణననుసరించి మారీచుడు బంగారులేడియై వారికుటీరముకడ తిరగజొచ్చెను. సీతాదేవి ఆయద్భుతమృగమును జూచి ముగ్ధురాలై దానిని దెచ్చియీయమని శ్రీరాముని ప్రార్థించినది. శ్రీరాముడు బంగారులేడివెంట పరుగెత్తెను. ఆసమయమున రావణుడు సీతాదేవిని మోసముతో హరించి లంకలో అశోకవనమున నుంచెను.

శ్రీరాముడు లక్ష్మణునితో గలసి జానకిని వెదకుచు, ఆయాప్రాంతములలో గల విరాధకబంధాదిరాక్షసులను వధించుచు ఋష్యమూకపర్వతమువైపునకు వెడలెను.

సుగ్రీవుడు వాలిభయమువలన నెల్లపుడు శంకాకులితస్వాంతుడై యుండెను. అతడు మంత్రులతో గూడి పర్వతశిఖరముపై నుండి ఆజానుబాహులు, ధనుర్ధారులు, విశాలనేత్రులు, దేవకుమారులవలె తేజస్సుగలవారు నగు ఆయిరువురు సోదరులను జూచినంతనె భయముచే వణకసాగెను.

వ్యాకులుడై సుగ్రీవుడు హనుమంతునితో నిట్లుపలికెను. 'ఈవీరుల నిరువురిని జూచినంతనె నామనస్సు భీతిజెందుచున్నది. ప్రాణశత్రువగు వాలి నన్ను జంపుటకు వీరిని పంపియుండవచ్చును, రాజులకు మిత్రులెందఱో యుందురు.

అందువలన వీరిని నమ్మరాదు. గూఢవేషమున సంచరించు శత్రువులను జాగ్రత్తగ గమనింపవలెను. ఏలయన, వారు ఇతరులకు తమపై విశ్వాసమును గలిగింతురు. కాని వా రెవరిని విశ్వసింపరు. సమయము వచ్చినపు డానమ్మినవారిపై దెబ్బదీయుదురు.* వాలి దీనిలో చాల సమర్థుడు. అందువలన కపిశ్రేష్ఠా! నీవు సామాన్య వ్యక్తివలె వారికడకు వెడలి వారినిగుఱించి, వారి మనోభావములను గుఱించి తెలిసికొనుము. వీరు వాలిచే పంపబడినవారైనచో నీ వచ్చటనుండియే సూచన చేయుము. నేను మంత్రులతో గూడి యీ పర్వతమును విడచి మఱియెచ్చటికైనను శీఘ్రముగ వెడలి తలదాచుకొందును.

తనకు ప్రాణప్రియులు, మహాధనుర్ధారులు, శ్యామగౌరవర్ణులు నగు శ్రీరామలక్ష్మణులను పవనకుమారుడు గుర్తింపకపోవుచుండెను. కాని ఆయన దక్షిణపార్శ్వము అదరుచుండెను, నేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండెను. హృదయము మాటిమాటికి ఆయనవైపున కాకృష్టమగుచుండెను.

వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుని యుద్దేశ్యము నెఱింగి పవనకుమారుడు ఋష్యమూకపర్వతమునుండి యెగురుచు వెడలెను. త్రోవలో నతడు బ్రాహ్మణవేషమును ధరించెను. అభూత

---

* అరయశ్చ మనుష్యేణ విజ్ఞేయాశ్ఛద్మచారిణః ।
విశ్వస్తానామవిశ్వస్తాశ్ఛిద్రేషు ప్రహరన్త్యపి ॥
( వా.రా. 4-2-22 )

పూర్వము, అశ్రుతపూర్వము నగు సౌందర్యముతో గూడిన శ్రీరామలక్ష్మణులను దర్శించినంతనే హనుమంతుని కొకవిచిత్ర మగు పరిస్థితి కలిగెను. ఆయన శిరము వారిచరణములమీదకు వంగెను. పిమ్మట ఆయన చేతుల జోడించి మనస్సునకు మిగుల సంతోషమును గలుగజేయు వాక్కుల నిట్లుపలికెను— వీరవరులారా! శ్యామగౌరవర్ణులుగను, మిక్కిలి సుందరముగను నున్న మీ రెవరు ? నిజముగ మీరు వీరపుంగవులగు క్షత్రియ కుమారులేనా! కాని మీరు మిగుల కోమలముగనున్నారు. ఈ ప్రదేశము పర్వతమయమును, మహారణ్యమును, మహాభయంకరము నైయున్నది. అంతటను వ్యాఘ్రాది క్రూరమృగములు సంచరించుచున్నవి. త్రోవ రాళ్ళతోను, ముళ్ళతోను నిండియున్నది. మీకిది సంచరింపదగిన భూమికాదు. అయినను మీరేల యీనిర్జన వనమున సంచరించుచున్నారు!.

'నేను మీ తేజస్సును స్వరూపమును జూచి చకితుడనగుచున్నాను. సామాన్య రాజకుమారు లింతటి తేజస్సు కలిగియుండరు. లోకోత్తర తేజోమయ పురుషులగు మీ రెవరు ? మీరు బ్రహ్మవిష్ణు మహేశ్వరులలో నెవరైన నొకరా ? లేక నరనారాయణులా ? లేక సర్వసృష్టికి ప్రభువగు నా పరబ్రహ్మ పరమాత్మ భూభారహరణార్థమై యుగళరూపమున నవతరించి నన్ను ధన్యునిగ జేయ నిచటికి వచ్చినాడా ?

సంభాషణచతురు డగు హనుమంతు డట్లు పలికి యూర

కున్నమీాదట శ్రీరాముడు లక్ష్మణునితో నిట్లు పలికెను- లక్ష్మణా! వీనిపాండిత్యపూర్ణ మగు స్పష్టోచ్చారణమువలన నితడు వ్యాకరణశాస్త్రపారంగతుడై నట్లును, వేదాధ్యయన సంపన్నుడై నట్లును దెలియుచున్నది. నిజముగ నితడు సర్వ శాస్త్రజ్ఞానసంపన్నుడె; ఏలయన, ఇతడు సంస్కార [1] క్రమ [2] సంపన్నము, అద్భుతము, అవిలంబితము, [3] హృదయానంద కరము, కల్యాణమయము నగు వాక్కును బలుకుచున్నాడు. హృదయము, కంఠము, మూర్ధము — ఈ మూడుస్థానముల ద్వారమున స్పష్టరూపముగ నభివ్యక్తమగు నీతని యీ విచిత్ర వాక్కును వినినచో నెవనిచిత్తము ప్రసన్నముగాదు? వధించు టకు ఖడ్గము నెత్తిన శత్రువుహృదయముగూడ నీతని యద్భుత వాక్కుచే మారిపోగలదు. [4] నీవు వీనితో మాటలాడుము.

---

(1) వ్యాకరణ నియమానుకూలమగు శుద్ధవాణిని 'సంస్కార సంపన్న' మందురు.

(2) శబ్దోచ్చారణకు సంబంధించిన శాస్త్రీయపరిపాటిని 'క్రమ' మందురు.

(3) ధారాప్రవాహరూపముతో మాటలాడుట 'అవిలంబిత' మనబడును.

(4) సంస్కారక్రమ సంపన్నామద్భుతామవిలంబితామ్ ।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహర్షిణీమ్ ॥
అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా ।
కస్య నారాధ్యతే చిత్తముద్యతాసేరరేరపి. ॥

( వా,రా. 4-3-32,33 )

అన్నగారి యీ దేశమును బొంది సుమిత్రానందనుడు బ్రాహ్మణవేషధారి యగు పవనకుమారునితో నిట్లుపలికెను - "బ్రాహ్మణుడా! మేమిరువురము ధర్మాత్ముడు, విఖ్యాతుడు, అయోధ్యాధిపతియు నగు దశరథుని కుమారులము. ఈయన నాయన్న, పేరు శ్రీరాముడు, నాపేరు లక్ష్మణుడు. తండ్రిగారి యాజ్ఞ ననుసరించి పదునాలుగు వత్సరములు అరణ్యవాసము చేయ వచ్చితిమి. ఇచట పంచవటిలో ఈయనభార్య యగు సీతాదేవిని రాక్షసు డెవడో మోసముతో హరించినాడు. మేమీ గహనారణ్యమున నామెను వెదకుచు దిరుగుచున్నాము. మీ రెవరో దయయుంచి చెప్పుడు"

పవనకుమారుడు సుమిత్రానందనుడు చెప్పు యుగళ రూపములను గూర్చి తెలిసికొనుచుండెను. కాని వానిమనస్సు జటాజాలశోభితము, నవనీరదశరీరము గల శ్రీరాముని ముఖారవిందముపై లగ్నమైయుండెను. భువనమోహనరూపము వాని రోమరోమమున ప్రవేశించుచున్నట్లుండెను. వాని నేత్రముల నుండి బాష్పములు ప్రవహించుచుండెను, శరీరము పులకరించు చుండెను. ప్రభువునుగూర్చి విన్నపిమ్మట వానికి తనస్మృతిగూడ లేకపోయెను. అతడు త్రైలోక్యదుర్లభములు, పవిత్రములు నగు శ్రీరాముని పాదపద్మములకు సాష్టాంగ నమస్కారము చేసెను. వ్యాకులుడై ప్రేమాశ్రువులతో భవాబ్ధిపోతములు, పద్మారుణములు నగు చరణములను ప్రక్షాళనము చేయసాగెను.

ఆంజనేయుని యశ్రుప్రవాహమునకు విరామము లేక పోయెను. కంఠము గద్గదమయ్యెను. ఎట్లో ధైర్యము వహించి, చేతుల జోడించి యిట్లు ప్రార్థించెను- 'దయానిధి వగు ప్రభూ! పామరుడ నగు నేను నిన్ను గుర్తింపలేకపోయితిని; ఇది స్వాభావికమైన విషయము, కాని నీవు అజ్ఞునివలె ఇట్లు ప్రశ్నించితి వేమి? నీవు నన్ను మరచితివా? మూడు లోకములకు రక్షకము లగు నీచరణకమలములుతప్ప నాకింకొక ఆధారమేమియున్నది. దయానిధీ! నాపై దయజూపుము, నన్ను నీవానినిగా జేసి కొనుము'.

నిజముగ లోకత్రయ పవిత్రకుడగు శ్రీరాముడు దయానిధియే మిక్కిలి పవిత్రములగు ఆయన పాదపద్మముల పరాగముచే కరుణావారిధి ప్రతిక్షణము ఉప్పొంగుచునే యుండును. కాని వానికి మోసమన్న గిట్టదు. ఆవరణముచే వాని దర్శనము సంభవముకాదు. పరమోదారుడగు సీతావల్లభుడు ఎల్లప్పుడు నిష్కపటునిగను, సరళహృదయునిగను నగపడును. పవనకుమారుడు బ్రాహ్మణవేషమున వచ్చినాడు, ఆయన తనవాస్తవిక స్వరూపమును కప్పివేసినాడు. అందువలన కమలనయను డగు శ్రీరాము డాయనవైపు కనులార్పకుండగ జూచుచు పూర్తిగ మౌనముగ నుండెను.

మారుతాత్మజుని యధైర్యము పెరుగుచుండెను. వ్యాకులచిత్తుడై రోదించుచు అత డిట్లు ప్రార్థింపసాగెను- ప్రభూ!

నేను మోహగ్రస్తుడను, అజ్ఞానాంధకారమున పడియున్నవాడను, కుటిలహృదయుడను, పైగా నీవు నన్ను విస్మరించితివి. ఇక నాస్థితి యేమనిచెప్పను? దయామయా! నాపై నిక దయజూపుము -

ఏకు మైం మంద మోహబస కుటిల హృదయ అగ్యాన।
పుని ప్రభు మోహి బిసారే ఉ దీనబంధు భగవాన॥

(మానసము 4-2)

ప్రభువునెదుట అశాంతచిత్తముతో ప్రార్థించు హనుమంతుడు తన్నుతాను మఱచిపోయెను. వానికి తాను ధరించిన వేషమునుగూర్చిన జ్ఞానముగూడ లేకపోయెను. వాని బ్రాహ్మణ వేషము తొలగిపోయెను - అతడపుడు వాస్తవమైన తనవానర రూపముతో ప్రభువుచరణములపై బడి రోదించుచు ప్రార్థించుచుండెను.

కరుణామయుడగు శ్రీరాముడు తన అనన్యభక్తుడగు హనుమంతుని సహజవానరరూపమున జూచెను. వెంటనే ఆయన సమీరకుమారుని లేవనెత్తి తన బాహువులతో గట్టిగ హృదయమునకు హత్తుకొనెను. ఆ సమయమున వారిరువురిదశ చాలయద్భుతముగ నుండెను. ప్రేమమూర్తియు, భక్తవత్సలుడు నగు శ్రీరాముడు తన యభయహస్తముతో హనుమానుని శిరస్సును నిమురుచుండెను. హనుమంతుడు శిశువువలె మహా

ప్రభువు హృదయమునకు హత్తుకొనియుండి రోదించుచుండెను. వానికంఠము రుద్ధమైపోయెను.

తన ప్రభువగు శ్రీరామునకు తనపై ప్రేమ యున్నదను విశ్వాస మేర్పడినతరువాత హనుమంతుడు లక్ష్మణునిచరణములకు నమస్కరించెను. సుమిత్రానందనుడుగూడ వానిని వెంటనే లేవనెత్తి హృదయమునకు హత్తుకొనెను. అనంతరము హనుమంతుడు శ్రీరామునకు సుగ్రీవుని వృత్తాంతము నంతటిని వివరించెను. నీతినిపుణు డగు పవనకుమారుడు శ్రీరాముని ముఖారవిందమును నిర్నిమేషదృష్టితో జూచుచు వినయయుక్తములగు వాక్కుల నిట్లుపలికెను– 'దేవా! తన జ్యేష్ఠసోదరుడైన వాలి భయముచే సుగ్రీవుడు ఋష్యమూకపర్వతముపై నివసించుచున్నాడు. ఇతడు రాజ్యబహిష్కృతుడు, భార్యావియోగముచే మిగుల దుఃఖితు డైయున్నాడు. అడవులలోను, కొండలలోను చాలకష్టముతో గాలమును గడపుచున్నాడు. మీరుగూడ నిదియేస్థితిలో నున్నారు. ఇపుడు సుగ్రీవునకు సమర్థుడగు స్నేహితుడు అవసరమైయున్నాడు. నీ వీయనతో స్నేహము చేసికొనినచో ఈ సుగ్రీవునకు మిక్కిలి సంతోషము కలుగును. ఆయనకు తనరాజ్యము భార్య మఱల లభించినచో నతడు సీతాన్వేషణమునందు విశేషముగ సహాయపడగలడు. అందువలన నీవు సుగ్రీవుని ఆత్మీయునిగా జేసికొనవలసినదిగా నేను ప్రార్థించుచున్నాను.

శ్రీరాముని యంగీకారము లభించినంతనే పవనకుమారుడు రామలక్ష్మణుల నిరువురిని తనభుజములపై గూర్చుండ బెట్టుకొని ఋష్యమూకపర్వతముపైకి వెడలెను. శ్రీరామలక్ష్మణసహితుడై తనవైపు వచ్చు హనుమంతుని జూడగా సుగ్రీవున కధిక సంతోషము కలిగెను.

ఆంజనేయుడు రామలక్ష్మణసహితుడై సుగ్రీవుని కడకు జేరెను. సుగ్రీవుడు పరమతేజస్వులగు నాకుమారు లిరువురకు నమస్కరించెను. హనుమానుడు సుగ్రీవుని శ్రీరామునకు పరిచయముచేసెను. అనంతర మతడు ప్రజ్వరిల్లునట్టి అగ్నిని సాక్షిగ నుంచి ధర్మవత్సలుడగు శ్రీరామునకు సుగ్రీవునకు మిత్రత్వమును గూర్చెను. భగవానుడగు శ్రీరాముడు, వానరరాజగు సుగ్రీవుడు ఇరువురు చాలప్రసన్నులైరి. పిమ్మట ఆకులు పూలు మిక్కుటముగా గల కొమ్మ నొకదానిని బఱచి దానిపై మిగుల నాదరముగ శ్రీరాముని గూర్చుండబెట్టి తానుగూడ ఆయనతోపాటు గూర్చుండెను. హనుమంతుడు పుష్పించిన మంచి గంధపుచెట్టు కొమ్మ నొకదానిని విఱచి దానిపై లక్ష్మణుని గూర్చుండబెట్టెను.

అధికసంతుష్టుడైన సుగ్రీవుడు మృదుమధురము లగు వాక్కులతో తనకథను వినిపించుచు శ్రీరామచంద్రునితో నిట్లుపలికెను - 'రఘునందనా! ప్రాణప్రియమైన నా భార్యను హరించి వాలి క్రూరముగ నన్ను వెడలగొట్టినాడు నేను వానికి భయపడి యీ పర్వతముపై నివసించుచున్నాను. నాకు

శరణు నిమ్ము, 'నన్ను నిర్భయునిగా జేయుము'

శ్రీరాము డిట్లు పలికెను- 'మిత్రుడా! సుగ్రీవుడా! నేను వాలినొకేయొక బాణముతో సంహరింతును, విశ్వసింపుము. అమోఘమగు నా బాణముచే వాని ప్రాణములు రక్షింప బడుట యసంభవము.

నిఖిలలోకపావనుడగు శ్రీరాముని బాణముచే వాలి హతుడయ్యెను. త్రైలోక్య రక్షకు డగు శ్రీరాముని యెదుట అతడు తన భౌతికశరీరమును విడచెను. భర్త మరణవార్తను విని వాలిభార్య యగు తార యచటికి వచ్చి దీనముగ నేడ్వ సాగినది. అపుడు తార నోదార్చుచు పరమపీతరాగు డగు హనుమాను డిట్లుపలికెను.

> గుణదోషకృతం జంతుః స్వకర్మఫలహేతుకమ్ ।
> అవ్యగ్ర స్తదవాప్నోతి సర్వం ప్రేత్య శుభాశుభమ్॥
> శోచ్యాశోచసి కం శోచ్యం దీనం దీనానుకంపసే ।
> కశ్చ కస్యానుశోచ్యోఽస్తి దేహేఽస్మిన్ బుద్బుదోపమే॥
> జానాస్య నియతామేవం భూతానామాగతిం గతిమ్।
> తస్మాచ్ఛుభం హి కర్తవ్యం పండితే నేహ లౌకికమ్॥
>
> (వా. రా. 4-21-2,3,5)

"దేవీ! జీవుని గుణబుద్ధులచేత లేదా దోషబుద్ధిచేత చేయబడిన కర్మలే సుఖదుఃఖ రూపఫలమును బొందించునవి యగును. పరలోకమునకు వెడలి ప్రతిజీవుడు శాంతభావముతో

నుండి తన శుభాశుభ కర్మ ఫలము నంతటిని అనుభవించును. నీవు శోచనీయవు, అట్లుండగా నీవు మఱియొక శోచనీయుని జూచి దుఃఖింపనేల ? నీవు స్వయముగ దీనురాలవై యుండి మఱియొక దీనునిపై కరుణ జూపనేల ? నీటి బుడగవంటి యీ శరీరమునందుండి యే జీవుడు మఱియొక జీవునికొఱకు దుఃఖించును ?

దేవీ ! నీవు విదుషీమణివి. అందువలన ప్రాణుల జనన మరణముల కొఱకు నిర్ణీతమగు సమయము లేదని నీకు దెలియును. కనుక శుభకర్మము చేయవలెను. దుఃఖించుట మున్నగు లౌకిక కర్మలను చేయరాదు"

అంగదస్తు కుమారోఽయం ద్రష్టవ్యో జీవపుత్త్రియా ।
ఆయత్యాం చ విధేయాని సమర్థాన్యస్య చింతయ ॥

(వా. రా. 4-21-4)

"నీపుత్రుడు అంగదుడు జీవించియున్నాడు. ఇపుడు నీవు వీనిని జూచుకొను చుండవలయును. భవిష్యత్తులో వీని యున్నతికి సాధకములగు శ్రేష్ఠకర్మలను గూర్చి యాలోచింపవలెను."

వాలి కంత్యసంస్కారము జరిగినది. లక్ష్మణుడు కపి రాజగు సుగ్రీవుని కిష్కింధాధిపతిగా నొనర్చినాడు. విధివిధానముగ పట్టాభిషేకము జరిగినది. వాలి పుత్రుడగు అంగదుడు యువరాజయ్యెను. సుగ్రీవునకు సంపద, రాజ్యము, భార్య మున్నగు నభీష్టవస్తువు లన్నియు లభించినవి. సర్వులకు శరణ్యు

డగు శ్రీరాముని కృపయున్న మానవునకు లోకమున లభింపని దేమియుండును ?

సుగ్రీవుడు కిష్కింధలో నివసింపసాగెను. కాని పితౄజ్ఞపై నాదరము గలవాడగుటచే శ్రీరాముడు నగరములోనికి ప్రవేశింపలేదు. ఆయన మాసచతుష్టయమును గడుపుటకై ప్రస్రవణ పర్వతమునకు వెడలెను.

ఆంజనేయుడు ప్రతిక్షణము తన కారాధ్యుడగు శ్రీరాముని చరణములకడ నుండుట కభిలషించుచుండెను. కాని సుగ్రీవు డిప్పుడిప్పుడే రాజపదవి నధిష్ఠించియుండుటచే కార్య నిర్వహణార్థమై నిపుణుడగు నొక మంత్రి వాని కవసరమై యుండెను, ఆకారణముచే లోకోపకారి యగు శ్రీరాముడు సుగ్రీవునకు సహాయపడవలసినదిగా హనుమాను నాజ్ఞాపించెను. ప్రభువునాజ్ఞ హనుమానునకు శిరోధార్యమయ్యెను. అతడు కిష్కింధలో సుగ్రీవునికడ నుండసాగెను.

## హనుమంతుడు సుగ్రీవునకు హితము జెప్పుట

శ్రీరాముడు భార్య యగు సీతాదేవిని గూర్చి చింతించుచు సోదరుడగు లక్ష్మణునితో గలసి ప్రస్రవణగిరిపై వర్షాకాలమును గడుపుచుండెను. కపిరాజగు సుగ్రీవుడు సంపదను, రాజ్యమును తన భార్యయగు రుమను, అనింద్యసుందరి యగు తారను బొంది సుఖముగ నుండెను. అతడు ఏవిధమగు చింతయు లేనివాడై

రాజ్యభోగముల ననుభవించుచుండెను. తనకు పరమహితైషియు సోదరసహితుడు నగు శ్రీరాముని మైత్రిని, ఆయన యుపకారమును, ఆయనకు తాను చేయవలసిన కార్యమును పూర్తిగ మరచి సుగ్రీవుడు రాజ్యసుఖములలో మగ్నుడై పోయెను. కాని పవనపుత్రు డగు హనుమానుడు శాస్త్రసిద్ధాంతములను చక్కగ నెఱిగినవాడు. కర్తవ్యాకర్తవ్య జ్ఞానముగూడ చక్కగ గలవాడు. సంభాషణ కళాచతురుడగు హనుమంతుడు ఎల్లప్పుడు సావధానముగ నుండు మంత్రియై యుండెను.

ఆయన ఎల్లప్పుడు శ్రీరాముని ధ్యానమున మగ్నుడై యుండెను, జగన్మాత యగు సీతాదేవియొక్క జాడను దెలిసికొనుట కాయన మిగుల వ్యగ్రుడైయుండెను.

ఆకాశము స్వచ్ఛముగను, నదులలోని నీరు నిర్మలముగను, మార్గములు యాత్రకు యోగ్యములుగను నున్నట్లు హనుమంతుడు తెలిసికొనెను. కాని వానరరాజగు సుగ్రీవుడు తనప్రయోజనము నెఱవేరిన పిమ్మట ధర్మార్థసంగ్రహమున నుదాసీనుడయ్యెను. అభిలషితములగు మనోరథముల బొంది యతడు స్వేచ్ఛాచారియయ్యెను. అపుడు హనుమంతుడు సుగ్రీవునికడకు వెడలి సత్యము, ప్రియము, హితము నగు వాక్కుల నిట్లుపలికెను.

రాజ్యం ప్రాప్తం యశశ్చైవ కౌలీ శ్రీరభివర్ధితా
మిత్రాణాం సంగ్రహః శేష స్తద్భవాన్ కర్తుమర్హతి

తద్భవాన్ వృత్తసంపన్నః స్థితః పథి నిరత్యయే ।
మిత్రార్థమభినీతార్థం యథావత్ కర్తుమర్హతి ॥
తదిదం మిత్రకార్యం నః కాలాతీతమరిందమ ।
క్రియతాం రాఘవస్యైతత్ వైదేహ్యాః పరిమార్గణమ్ ॥
న చ కాలమతీతం తే నివేదయతి కాలవిత్ ।
త్వరమాణోఽపి స ప్రాజ్ఞ స్తవరాజన్ వశానుగః ॥
న హి తావత్ భవేత్కాలో వ్యతీతశ్చోదనాదృతే ।
చోదితస్య హి కార్యస్య భవేత్కాలవ్యతిక్రమః ॥
శక్తిమానితి విక్రాంతో వానరర్క్షగణేశ్వర ।
కర్తుం దాశరథేః ప్రీతిమాజ్ఞాయాం కిం ను సజ్జసే ॥
ప్రాణత్యాగవిశంకేన కృతం తేన మహత్ప్రియమ్ ।
తస్య మార్గామ వైదేహీం పృథివ్యామపి చాంబరే ॥
దేవదానవగంధర్వా అసురాః సమరుద్గణాః ।
న చ యక్షా భయం తస్య కుర్యుః కిమివ రాక్షసాః ॥
తదేవం శక్తియుక్తస్య పూర్వం ప్రతికృతస్తథా ।
రామస్యార్హసి పింగేశ కర్తుం సర్వాత్మనా ప్రియమ్ ॥

(వా. రా. 4-29-9-9½-12,15,16,19,21 23-25

రాజా ! నీవు ! రాజ్యమును, యశస్సును బొందితివి. వంశపారంపర్యముగా వచ్చిన లక్ష్మిని వృద్ధిపఱచితివి. కాని యింకను మిత్రులకు చేయవలసిన కార్యము మిగిలియున్నది, దాని నిపుడు నీవు నెరవేర్చవలెను. నీవు సదాచారసంపన్నము

నిత్యము, సనాతనము నగు ధర్మమార్గమున నిలచియున్నావు. అందువలన మిత్రకార్యమును జక్కచేయుటకు నీ వొనర్చిన ప్రతిజ్ఞను తగినట్లు నెరవేర్చుము. శత్రుదమనుడా! శ్రీరాముడు మనకు పరమమిత్రుడు, ఆయనకు చేయవలసిన కార్య సమయము గడచిపోవుచున్నది. అందువలన సీతాదేవికై వెదకుట నారంభింపవలెను. రాజా! పరమబుద్ధిమంతుడగు శ్రీరాముడు కాలవేత్త. కార్యసిద్ధికై నీవు త్వరపడిన ఆయన నీకు వశుడైయుండును. కాలము గడచుచున్నదని సంకోచము వలన అయన నీతో జెప్పడు. కనుక శ్రీరాముడు చెప్పక మునుపే మనము పనిని మొదలిడినచో సమయము గడచినట్లు ఆయన భావింపడు. కాని ఆయన దీనికై ప్రేరణకలగించినచో మనము సమయమును గడిపితి మనియు, ఆయన కార్యమున ఆలస్యమొనర్చితి మనియు లోకమున వెల్లడి కాగలదు. వానర భల్లూకములకు ప్రభు వగు సుగ్రీవా! నీవు శక్తిమంతు డవు, పరాక్రమవంతుడవు. అయినను దశరథనందను డగు శ్రీ రాముని కిష్టమైన కార్యము నొనర్చుటకు వానరుల నాజ్ఞాపిం చుటకు ఏల ఆలస్యముచేయు చున్నావు? నీకై శ్రీరాముడు వాలిప్రాణములను దీయుటకుగూడ సందేహింపలేదు.

ఆయన నీకు మిక్కిలి యిష్టమైన కార్యము నొనర్చి నాడు. అందువలన మన మిప్పుడు ఆయన భార్య యగు సీతా దేవికై భూమ్యాకాశముల రెండింటియందును వెదకుదము,

దేవతలు, దానవులు, గంధర్వులు, అసురులు, మరుద్గణములు, యక్షులు మున్నగువా రెవ్వరును శ్రీరామునకు భయమును గలుగజేయజాలరు. ఇక రాక్షసుల విషయమై చెప్పునదేమి! వానరరాజా! ఇట్టి శక్తిశాలియు, మొదటనే ఉపకారము చేయువాడు నగు శ్రీరామునకు ఇష్టమైన కార్యమును నీవు నీ శక్తియుక్తులను వినియోగించి చేయుము.

శ్రీరాముని కార్యమున ఆలస్యము జరిగినందులకు సత్త్వగుణసంపన్నుడగు సుగ్రీవుడు భయగ్రస్తుడయ్యెను. ఆయన ఎల్లప్పుడు హనుమానుని సలహాలను గౌరవించుచుండెను. ప్రేమపూర్వకముగ కర్తవ్యమునుగూర్చి తెలియజేసినందులకు సుగ్రీవుడు చాలసంతోషించి వెంటనే నీలుడను వానర వీరు నిట్లాజ్ఞాపించెను- 'నీవు పదునైదు దినములలోపల నాయుద్యోగులను, శీఘ్రగాములగు యూథపతులను వీరసైనికులను నా సమీపమునకు బంపుటకు ప్రయత్నింపుము. ఈ గడువులోపల ఇచటికి చేరని వానరవీరులు తమప్రాణములపై నాశవదలుకొనవలసివచ్చును. ఇది నా దృఢనిశ్చయము'.

ఇక అచట వర్ష ఋతువుపిమ్మట శరదృతువు వచ్చెను. సుగ్రీవుడు నిశ్చింతునిగను, నిష్క్రియునిగను నుండుట జూచి భగవానుడగు శ్రీరాముడు కలతజెంది తన సోదరునితో నిట్లు పలికెను- 'లక్ష్మణా! వానరరాజగు సుగ్రీవుడు సీతాన్వేషణమునకు గడువును నిర్ణయించినాడు, కాని తనస్వార్థము నెరవేరిన పిమ్మట దుష్టబుద్ధి యగు ఆ వానరుడు నన్ను ఉపేక్షించి

నాడు. నన్ను ఆతడు రాజ్యభ్రష్టునిగను, దీనునిగను, అనాథునిగను, శరణాగతునిగను భావించి తిరస్కరించుచున్నాడు. అందువలన నీ వచటికి వెడలి స్పష్టముగ వానితో నిట్లు పలుకుము- 'బలపరాక్రమ సంపన్నులు, ఉపకారముచేయునట్టివారు కార్యార్థులు నగు పురుషులకు ప్రతిజ్ఞాపూర్వకముగ ఆశను గలుగజేసి తరువాత దానిని భగ్నముచేయువాడు ప్రపంచము నందలి పురుషులలో కెల్ల నీచుడైయున్నాడు, తన నోటినుండి ప్రతిజ్ఞారూపమున వెలువడిన మాటలు మంచివి కావచ్చును, చెడ్డవి కావచ్చును, ఎట్లున్నను ఆవాక్కులు తప్పక నెఱవేర్చ దగినవేయనిభావించి సత్యమును గాపాడు నుద్దేశ్యముతో వానిని పాలించు వీరుడు పురుషశ్రేష్ఠునిగ జెప్పబడుచున్నాడు. *

లక్ష్మణా! ఆ దురాత్మునితో ఇంకను నిట్లు పలుకుము- 'నా బాణముచే జంపబడిన వాలి యే మార్గమున వెడలినాడో ఆ మార్గ మింకను మూతబడలేదు. అపుడు నేను వాలి నొక్కనినే చంపితిని. కాని యిపుడు నీవు నీ ప్రతిజ్ఞను నెఱవేర్చనిచో బంధువులతోగూడ నిన్ను మృత్యువాతబడ వేయుదును' అని శ్రీరాముడు మిగుల బాధతో తనసోదరునితో బలికెను.

---

* అర్థినాముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణామ్।
ఆశాం సంశ్రుత్య యో హంతి స లోకే పురుషాధమః ॥
శుభం వా యది వా పాపం యో హ వాక్యముదీరితమ్।
సత్యేన ప్రతిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః ॥
(వా. రా: 4-30-71,27)

శ్రీరాముని వాక్కులను వినినంతనె సుమిత్రానందనుడు రోషపూర్ణుడయ్యెను. అతడు అన్నపాదములకు నమస్కరించి యిట్లుపలికెను - 'విషయభోగాసక్తుడు, బుద్ధిహీనుడు నగు వానరుడు అగ్నిసాక్షిగ స్నేహముజేసినాడు; కాని తనపని నెఱవేరిన పిమ్మట వానియభిప్రాయము మారినది. అసత్యవాది యగు సుగ్రీవు నిప్పుడే చంపి అంగదునకు రాజ్యపట్టాభిషేకము చేయుదును. అతడే రాజై వానరవీరుల ద్వారా సీతాదేవి జాడను తెలిసికొనగలడు.'

ధనుర్బాణములను దీసికొని సుగ్రీవవధకై బయలుదేరిన లక్ష్మణుని జూచి ధీరుడు, గంభీరుడు, పురుషోత్తముడు నగు శ్రీరాముడు సోదరునకు నచ్చ జెప్పుచు నిట్లుపలికెను- 'లక్ష్మణా ! నీ వంటి యుత్తమవీరుడు మిత్రవధవంటి నిషిద్ధకర్మ జేయుట ఉచితముగాదు. ఉత్తమమగు వివేకముద్వారా తన క్రోధమును జంపుకొనిన వీరుడు సర్వపురుషులలోను శ్రేష్ఠుడని చెప్పబడును(1). నాయనా ! సుగ్రీవుడు నాకు మిత్రుడు. వానిని నీవు చంపకూడదు అచటికి వెడలి 'వాలివలె నీవుగూడ చంపబడుదు'వని మాత్రము పలికి వానిని భయపెట్టవలసినది. శీఘ్రముగ దానికి సమాధానము దీసికొనిరమ్ము(2)

(1) కోపమార్యేణ యో హంతి స వీరః పురుషోత్తమః॥ (వా.రా.4-31-6)

(2) న హంతవ్య స్త్వయా వత్స సుగ్రీవో మే ప్రియః సఖా
కింతు భీషయ సుగ్రీవం వాలివ త్త్వాం హనిష్యసే
ఇత్యుక్త్వా శీఘ్రమాదాయ సుగ్రీవం ప్రతిభాషితమ్॥
(వా. రా. 4-5-13,14)

అట్లే యని ఇక్ష్వాకు కులసింహుడు వీరవరుడు నగు సుమిత్రానందనుడు శ్రీరాముని చరణములకు నమస్కరించి, భయంకర మగు తన ధనుర్బాణములను దీసికొని కిష్కింధకు వెడలెను. అపుడు క్రోధమువలన వాని యాకారము మిగుల భయావహముగ నుండెను. అతని అధరము వణకుచుండెను. అత్యధిక మగు కోపముచే అతడు మార్గమున గల వృక్షములను పడగొట్టుచు, పర్వతశిఖరములను దూరముగ విసరుచు వెడలుచుండెను. ఆ సమయమున అతడు ప్రలయంకరుని వలె గన్పట్టుచుండెను.

కిష్కింధకడకు వెడలి లక్ష్మణుడు తన వింటినారిని భయముగొల్పునట్లుగ ప్రయోగించెను. ఆ సమయమున కొందఱు సామాన్యవానరులు కోటగోడపై నుండు రాళ్ళను చెట్లను దీసికొని హర్ష ధ్వానములచేయసాగిరి. ఇది చూచినంతనె లక్ష్మణుని క్రోధాగ్ని ప్రజ్వరిల్లెను. ప్రళయాగ్నివలె నున్న లక్ష్మణుడు విశాల మగు తన ధనుస్సుపై భయానక మగు బాణము నెక్కుపెట్టెను. వెంటనే కిష్కింధలోని వానరవీరులందరు వణకిపోయిరి. లక్ష్మణుడు సమూలముగ కిష్కింధను నాశము చేయుటకు సిద్ధపడెను.

నగరవాసులందఱు మిగుల కలతజెందుట జూచి యువరాజగు అంగదుడు లక్ష్మణునికడకు వెడలి ఆదరపూర్వకముగ ఆతనిచరణములకు నమస్కరించెను. వానిని జూచినంతనే

భ్రాతృభక్తుఁ డగు లక్ష్మణునికోపము శాంతించెను. ఆయన యువరాజును హృదయమునకు హత్తుకొని 'వత్సా! నీవు త్వరగ సుగ్రీవునికడకు వెడలి శ్రీరాముడు నీపై కోపము పూనియున్నాడు, ఆయన పంపగా నేనిచటకువచ్చితిని అని ఆయనతోఁ జెప్పు' మనిపలికెను.

'చాలమంచి' దనిపలికి అంగదుడు వినయపూర్వకముగ జేతుల జోడించి లక్ష్మణునికడ సెలవుదీసికొని సుగ్రీవుని కడకు వెడలెను. అంగదునివలన లక్ష్మణుడు పలికిన క్రోధపూర్ణములగు మాటలను వినినంతనె సుగ్రీవుడు భయాక్రాంతుడయ్యెను. వెంటనే యతడు లక్ష్మణుని అనుకూలునిగా జేసికొనుటకు పవన కుమారుని బంపెను.

హనుమానుడు లక్ష్మణుని సమీపించి ఆయన చరణములకు భక్తిపూర్వకముగ ప్రణమిల్లి వినయముతో నిట్లు పలికెను.

> ఏహి వీర మహాభాగ భవద్గృహమశంకితమ్ ।
> ప్రవిశ్య రాజదారాదీన్ దృష్ట్వా సుగ్రీవమేవ చ ।
> యదాజ్ఞాపయసే పశ్చాత్ తత్సర్వం కరవాణి భోః ॥
> (అ. రా. 4-5-37, 38)

మహాభాగా! వీరశ్రేష్ఠా! ఎట్టిశంకయు లేకుండగ రమ్ము, ఈయిల్లు నీది. లోనికి దయచేసి రాజమహిషులను, మహారాజగు సుగ్రీవుని గలిసికొనుము. పిమ్మట నీయాజ్ఞ ననుసరించి మెలంగుదుము.'

హనుమానుడు మిగుల భక్తితో లక్ష్మణుని కరకమలము లను బట్టుకొని నగరముగుండా రాజభవనమునకు దీసికొని వెడలెను. మధురభాషిణి యగు తార లక్ష్మణునకు స్వాగత మిచ్చుచు 'మీకార్యమునుగూర్చియే సుగ్రీవు డాలోచించు చున్నాడు. దయయుంచి మీరు అంతఃపురములోనికి వచ్చి ఆయన కభయమిండని' పలికెను.

అంతఃపురమున భయపడుచున్న సుగ్రీవుడు తనభార్య యగు రుమతోగూడి లక్ష్మణుని చరణములకు నమస్కరించెను. అచటగూడ క్రుద్ధుడై యున్న లక్ష్మణునితో నీతివేత్తయగు సమీరకుమారు డిట్లుపలికెను-

త్వత్తోఽధికతరో రామే భక్తోఽయం వానరాధిపః ॥
రామకార్యార్థమనిశం జాగర్తి న తు విస్మృతః ।
ఆగతాః పరితః పశ్య వానరాః కోటిశః ప్రభో ॥
గమిష్యంత్యచిరేణైవ సీతాయాః పరిమార్గణమ్ ।
సాధయిష్యతి సుగ్రీవో రామకార్యమశేషతః ॥

(వా. రా. 4-5-54, 56)

'మహారాజా! ఈ వానరరాజు శ్రీరామచంద్రునకు నీ కంటెను గొప్ప భక్తుడైయున్నాడు. శ్రీరామకార్యార్థమై ఆయన రేయింబవళ్లు మేలుకొని యుంటున్నాడు, ఆయన దాని నేమాత్రమును మఱచియుండలేదు. ప్రభూ! చూడుము' కోట్లకొలదిగ నున్న ఈ వానరులు దీనికోసమే అన్నివైపుల

నుండి వచ్చుచున్నారు. వీరందఱు శీఘ్రముగ సీతాన్వేషణ మునకై వెడలగలరు. మహారాజగు సుగ్రీవుడు శ్రీరామ చంద్రుని సర్వకార్యమును చక్కగ నెరవేర్చగలడు !

అనంతరము వానరరాజగు సుగ్రీవుడు లక్ష్మణుని చరణ ములకు నమస్కరించి వినయముగ నిట్లుపలికెను- 'ప్రభూ ! నేను శ్రీరామచంద్రుని దాసుడను. ఆయనయే నా ప్రాణము లను గాపాడినాడు. ఈ ధనము, వైభవము, రాజ్యాదులు సర్వము ఆయన యిచ్చినవియే. ఆయన స్వయముగ త్రిభువన ములను జయింపగలడు. నేనాయన కార్యమునకు సహాయక మాత్రుడ నగుదును. విషయలోలుడను, పామరుడను నగు నేను పూర్తిగ మీ వాడనే. అందువలన నీవు నా యపరాధ ములను క్షమింపుము.

సుగ్రీవుని ప్రార్థన వినినంతనె సుమిత్రానందనుడు వాని భుజములను బట్టుకొని హృదయమునకు హత్తుకొని, ప్రేమ పూర్వకముగ వానితో నిట్లుపలికెను- 'మహాభాగా ! నేను గూడ ప్రణయకోపవశమున ఏవియో మాటలను బలికితిని. వానిని గూర్చి నీవు ఆలోచింపవలదు. శ్రీరాముడు అరణ్య మున నొంటరిగ నున్నాడు. సీతాదేవి వియోగముచే వ్యాకు లుడై యున్నాడు. అందువలన ఇపుడు ఆయనకడకు మనము త్వరగ వెడలవలయును.

'అవును, తప్పక వెడలుదము' అని పలికి సుగ్రీవుడు అర్ఘ్యపాద్యాదులచే లక్ష్మణుని పూజించి ఆయనతో పాటు తాను ఉత్తమమగు రథముపై గూర్చుండెను. సుగ్రీవునితో పాటు అంగదుడు, నీలుడు, ఆంజనేయుడు మున్నగు ప్రధానులగు వానరులుగూడ శ్రీరామునికడకు వెడలిరి. అపుడు భేరీ మృదంగాది నానావిధము లగు వాద్యములు మ్రోగసాగెను.

## సీతాన్వేషణార్థమై పయనమగుట

మృగ చర్మముచేత, జటామకుటముచేత శోభిల్లువాడు నీలమేఘశ్యాముడు నగు శ్రీరాముడు గుహాద్వారముకడ నొక శిలాఖండముపై గూర్చుండి యుదాసీన మగు మనస్సుతో పక్షులను జూచుచుండెను. దూరమునుండి శాంతమూర్తి యగు శ్రీరాముడు కనబడినంతనె సుగ్రీవుడు, లక్ష్మణుడు రథమునుండి దిగిరి. సుగ్రీవుడు వేగముగ శ్రీరామునివద్దకు వెడలి అజ్ఞానుడగు బాలునివలె ఆయన పాదపద్మములపై బడి యేడ్వసాగెను దయామూర్తి యగు శ్రీరాముడు వెంటనే వానిని లేవనెత్తి ఆలింగనముచేసికొని, సమీపమున కూర్చుండ బెట్టుకొని ప్రేమపూర్వకముగ వాని యోగక్షేమముల నడుగసాగెను,

సుగ్రీవుడు చేతులజోడించి మిగుల వినయముతో నిట్లు పలికెను- 'ప్రభూ! నా దోష మేమియు లేదు. నీ మాయ

చాల ప్రబలమైనది. నీ దయ యున్నగాని దీనిని దాటజాలము నేను భోగాసక్తుడ నగు పామరపశువును నాపై దయజూపుము'

కరుణామయు డగు శ్రీరాముడు సుగ్రీవుని శిరమును తన కరకమలముతో నిమురసాగెను, అపుడు అసంఖ్యాకులగు వానర భల్లూకవీరులు అచటికి రాసాగిరి.

వారిని జూచి సుగ్రీవుడు శ్రీరామునితో నిట్లుపలికెను- "ప్రభూ! ఈ వానరులు, భల్లూకవీరులు నీ యాజ్ఞను పాలించు చెదరు, ఫలమూలాదులను భక్షించెదరు. ఈతడు భల్లూక ముల కధిపతియైన జాంబవంతుడు, మహాయోధుడు, బుద్ధి మంతుడు. ఇత డొక కోటిమంది వానరుల కధిపతి. నా మంత్రులలో శ్రేష్ఠుడు. ఇంతేకాక నలుడు, నీలుడు, గవయుడు గవాక్షుడు, గంధమాదనుడు, శరభుడు, మైందుడు, గజుడు, పనసుడు, బలీముఖుడు, దధిముఖుడు, సుషేణుడు, తారుడు, మహాబలుడు పరమధీరుడు హనుమంతుని తండ్రియు నగు కేసరి వీరందఱు ప్రధానయూథపతులు. వీరియధీనమున పర్వత ములతో సమానమైన విశాలకాయములు గలిగిన వానరవీరులు కోట్లకొలదిగనున్నారు. మీరు వీరిని యిష్టానుసారముగ ఆజ్ఞా పింపవచ్చును.

సర్వశక్తిసంపన్ను డగు రఘునాథుడు సుగ్రీవునితో 'సుగ్రీవా! నా కార్యమునుగూర్చి నీ వెఱుగుదువు. ఉచితమని

భావించినచో శీఘ్రముగ వీరిని సీతాన్వేషణమునకై పంపు' మని పలికెను.

సావధానముగ నంతట తిరుగుచు సీతాదేవి జాడను దెలిసికొనవలసిన దని యూథపతుల కందఱకు నాజ్ఞయిచ్చుచు సుగ్రీవు డిట్లుపలికెను-

విచిన్వంతు ప్రయత్నేన భవంతో జానకీం శుభామ్।
మాసాదర్వాజ్ నివర్తధ్వం మచ్ఛాసనపురస్సరాః॥
సీతామదృష్ట్వా యది వో మాసాదూర్ధ్వం దినం భవేత్।
తదా ప్రాణాంతికం దండం మత్తః ప్రాప్స్యథ వానరాః॥
(అ రా. 4-6-25,26)

నా యాజ్ఞ ననుసరించి మీరందఱు మిగుల ప్రయత్నముతో జానకీదేవి నన్వేషింపుడు, ఒకమాసములోపల తిరిగి రండు. సీతాదేవిని జూడకుండగ మాసముకంటె నధికముగ నొక్క దినము గడిచినను నా చేతులో మీకు ప్రాణదండన తప్పదు''

ఇట్లు సుగ్రీవుడు సీతాదేవిజాడను దెలిసికొనుటకై వానర యూథపతులను, భల్లూక యూథపతులను కఠినముగ శాసించెను. అతడు సర్వదిక్కులకు నెందఱినో వానరులను బంపి దక్షిణదిక్కునకు గొప్పప్రయత్నముతో మహాబలుడు యువరాజు నగు అంగదుడు, జాంబవంతుడు, హనుమానుడు నలుడు, సుషేణుడు, శరభుడు, మైందుడు, ద్వివిదుడు మున్నగు వారిని బంపెను. అపుడు అతడు వీరవరుడగు హనుమానుని ప్రశంసించుచు వానితో నిట్లుపలికెను.

"కపిశ్రేష్ఠా! పృథివిలోగాని, అంతరిక్షమునందుగాని, ఆకాశమునందు గాని, దేవలోకమునందు గాని, జలమునందు గాని నీగతి కవరోధ మున్నట్లు నా కెక్కడను అగపడలేదు. అసుర గంధర్వ నాగ మనుష్య దేవ సముద్ర పర్వత సహిత ముగ సర్వలోకముల గుఱించి నీకు దెలియును. వీరుడా! అంతట అబాధిత మగు గతి, వేగము, తేజస్సు, స్ఫూర్తి అను గుణములన్నియు మహాపరాక్రమవంతు డగు నీ తండ్రియైన వాయుదేవునిలో నున్నట్లు నీలో నున్నవి. ఈ భూమండలమున నేప్రాణియు నీ తేజస్సుతో సరిపోయినట్టిది లేదు. అందువలన సీతాదేవి లభించునట్టి యుపాయమును నీవే యాలోచింపుము. హనుమానుడా! నీవు నీతిశాస్త్ర నిపుణుడవు. నీ యొక్కని యందే బలము, బుద్ధి, పరాక్రమము, దేశకాలానుసరణము, నీతియుక్త మగు నడవడి ఒక్కమాఱే యగపడును."

(న భూమౌ నాంతరిక్షేవా నాంబరే నామరాలయే।
నాప్సు నా గతిభంగం తే పశ్యామి హరిపుంగవ॥
సాసురాః సహగంధర్వాః సనాగనర దేవతాః।
విదితాః సర్వలోకాస్తే ససాగరధరాధరాః॥
గతిర్వేగశ్చ తేజశ్చ లాఘవం చ మహాకపే।
పితుస్తే సదృశం వీర మారుతస్య మహౌజసః॥
తేజసా వాపి తే భూతం న సమం భువి విద్యతే।
తద్యథా, లభ్యతే సీతా తత్త్వమేవాను చింతయ॥

త్వయ్యేవ హనుమన్నస్తి బలం వృద్ధిః పరాక్రమః ।
దేశాకాలాను వృత్తిశ్చ నయశ్చ నయపండిత ॥ )
(వా. రా. 4-44-3, 7)

ఇట్లు పవనకుమారుని గుణములను గీర్తించుచు సర్వ వానరులను సీతాన్వేషణార్థమై ఆదేశించి సుగ్రీవుడు శ్రీ రాముని సమీపమున గూర్చుండెను. వీరు లగు వానరులు, భల్లూకములు కమలనయను డగు శ్రీరాముని చరణములకు ప్రణమిల్లి పయనమయ్యెను. చివరకు హనుమానుడు ప్రభువు సమీపమునకు జేరెను. అపుడు శ్రీరాముడు వానితో నిట్లు పలికెను– 'వీరవరుడా! నీ ప్రయత్నము, ధైర్యము, పరాక్రమము సుగ్రీవుని సందేశము అను విషయములను బట్టి నీ వలన నాపని తప్పక నెఱవేరునని నాకు దోచుచున్నది, నీవు నాయీ యుంగరమును దీసికొనుము. దీనిపై నా నామాక్షరములు చెక్కబడియున్నవి. దీనిని నా గుర్తుగా ఏకాంతమున సీతాదేవి కిమ్ము. కపిశ్రేష్ఠా! ఈ కార్యమునకు నీవే తగిన వాడవు. నీ బుద్ధిబలము గూర్చి నాకు జక్కగ దెలియును. మంచిది, వెడలుము, నీకు శుభము కలుగుగాక!

( అభిజ్ఞానార్థమేతన్మే అంగులీయకముత్తమమ్ ।
మన్నామాక్షరసంయుక్తం సీతాయై దీయతాం రహః ॥
అస్మిన్ కార్యే ప్రమాణం హి త్వమేవ కపిసత్తమ ।
జానామి సత్త్వం తే సర్వం గచ్ఛ పంథాః శుభస్తవ ॥ )
(వా. రా. 4-6-28,29)

పవనకుమారుడు మిగుల ఆదరముతో శ్రీరాముని ముద్రికను దీసికొని, ఆయన చరణకమలములకు నమస్కరించెను. భక్తవత్సలు డగు శ్రీరాముని కరకమలము స్వయముగ హనుమానుని శిరముపైకి వెడలెను. అతికష్టముతో హనుమానుడు లేచెను. పవిత్రమగు ప్రభువు చరణధూళిని అతడు తన శిరమున నుంచుకొని, ఆయన దివ్యమూర్తిని తన హృదయమున నిలుపుకొని యత డుత్సాహముతో బయలు దేరెను. అతడు నిరంతరము శ్రీరామనామమును జపించు చుండెను.

## హనుమానుడు స్వయంప్రభను గలిసికొనుట

ఆంజనేయుడు వానరసమూహముతో గలిసి సీతాదేవిని వెదకుచు గహనమగు వింధ్యారణ్యమునకు వెడలెను. దట్ట మగు నా యరణ్యమున ముండ్లతో గూడిన ఎండిపోయిన చెట్లు తప్ప నీరనునది యెచ్చటగూడ కనబడలేదు. వానర భల్లూక సమూహము ఇటునటు తిరుగుటచేత మిక్కిలి దప్పికగొనెను. వారికి నీరెక్కడ కనిపింపలేదు. దప్పికచేత వారికంఠములు ఎండి పోవుచుండెను. కాని జ్ఞానులలో శ్రేష్ఠుడు, సంకటమోచనుడు నగు ఆంజనేయుడు వారి వెంట నుండెను. ఆయన ధైర్య ముతో నలువైపుల జూచెను. కొలదిదూరములో ఆయనకు తృణగుల్మలతాదులచే గప్పబడిన ఒకవిశాలమగు గుహ అగు

పడెను. ఆయన దానినుండి హంసలు, క్రౌంచపక్షులు, బెగ్గురు పక్షులు, చక్రవాకములు మున్నగు పక్షులు బయల్వెడలుట జూచెను. ఆ పక్షులరెక్కలు తడిసియుండెను. దానివలన నచట నీరున్నట్లు ఆయన కనుమానము గలిగెను. వెంటనే అందఱు అచటికి వెడలవలసిన దని ఆయన వారితో జెప్పెను. దుర్గమము లగు నరణ్యముల విషయము దెలిసిన ఆ హనుమంతునితో గలిసి వానర భల్లూకవీరులు ఒకరిచేతి నొకరు పట్టుకొని మెల్లమెల్లగ గుహాలోనికి ప్రవేశించిరి.

గుహలో గొలదిదూరమువఱకు గాఢాంధకారము వ్యాపించియుండెను, కాని ముందుకు వెడలినంతనె వారికి నిర్మల మగు జలముతో నిండిన సరోవరము సాల తాల తమాల, నాగకేసర, అశోక, చంపక, నాగవృక్షములను, పుష్పములతోను మధురములగు ఫలములతోను గూడియున్న వృక్షములును గనబడెను. ఇంతేకాక అచట వారు అద్భుత ములగు వస్త్రాలంకారములతో గూడి మిగుల సుందరమగు నొక భవనమునుగూడ జూచిరి. ఆ భవనమున దివ్యములగు భక్ష్యభోజ్యాది సామగ్రులన్నియు అమర్చబడియుండెను. అచట స్వర్ణసింహాసనముపై. లావణ్యమయి యగు నొకరమణి కూర్చుండియుండెను. ఆమె వల్కలములను, కృష్ణమృగచర్మ మును ధరించి ధ్యానమగ్నయై యుండెను. ఆమెను జూచి యా వానరు లొకరిముఖము నొకరు జూచుకొనసాగిరి. ధ్యానమగ్న

గా లైన ఆ యోగిని శరీరముచుండి తేజస్సు ప్రసరితమగు చుండెను. భయాక్రాంతు లగు వానరులు మిగుల శ్రద్ధతో నామె. చరణములకు ప్రణమిల్లిరి.

తనకు నమస్కరించిన యా వానరులను జూచి యా యోగిని శాంతచిత్తముతోను మధుర వాక్కులతోను నిట్లడిగెను- 'మీ రెచటినుండి వచ్చిరి? మీ రెవరు? ఏ యుద్దేశ్యముతో దుర్గమములగు నీ ప్రదేశములలో విహరించుచున్నారు? నా యీ ప్రదేశమును మీ రేల పాడుచేయుచున్నారు?'

విశాలకాయు డగు హనుమానుడు వినయముతో ఆమె కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను- ఆదరణీయురాల వగు నో దే అయోధ్యాధిపతి యగు దశరథునిపుత్రు డైన శ్రీరాముడు తన తండ్రియాజ్ఞ ననుసరించి ధర్మపత్ని యగు జానకీదేవితోను, సోదరు డగు లక్ష్మణునితోను గూడి వనవాసమునకు బయలు దేరెను. అచట పరమసాధ్వి యగు సీతను లంకాధిపతి యగు రావణుడు హరించినాడు. శ్రీరామునితో స్నేహము చేసియుండుటవలన సుగ్రీవుడు మమ్ము జానకీదేవిని వెదకుటకై పంపినాడు. ఆ శుభ కార్యమునకై మే మిటువచ్చితిమి. ఆకలిదప్పులచే కలతజెందిన మే మీ పవిత్రమగు గుహలోనికి ప్రవేశించితిమి- 'దేవీ! నీ వెవరు? దయయుంచి యీ విషయమును మాకు జెప్పు'మని యడిగెను.

తపఃపూతయగు నా యోగిని హనుమంతునితో నిట్లు

పలికెను- 'నేను చాల ధన్యురాలను. నేడు నా తపస్సు ఫలించి నది. నా యానందమున కవధులు లేవు. పూర్తిగ శంకారాహి తులై మీరు మొదట యథేచ్ఛగ మధురఫలములను భుజిం పుడు. అమృతమయ మగు జలమును ద్రాగుడు, తృప్తులై నా సమీపమున గూర్చుండి విశ్రాంతి దీసికొనుడు. అపుడు మీకు నా వృత్తాంతమును జెప్పెదను.

హనుమంతుడు వానరులతోగూడి మధుర ఫలముల భక్షించి, శీతలజలమును ద్రాగి తృప్తులు ప్రసన్నులు నయిరి. పిమ్మట వారు యోగినికడకు వెడలి చాలవినయముగ గూర్చుండిరి.

భక్తురాలగు నా యోగిని వానరసహితుడైన హనుమంతు నితో నిట్లు చెప్పసాగెను- 'పూర్వ కాలమునాటి విషయము, విశ్వకర్మకు హేమ యను నొక లావణ్యవతి యగు పుత్రిక యుండెను. ఆమెయద్భుతనృత్యమునకు సంతుష్టుడై శివుడు దివ్యము, విశాలము నగు నీ నగర మామెకు నివసించుటకై యిచ్చెను. ఇచట నామె వేలకొలదిసంవత్సరములు నివసించెను. ఆమె నాకు ప్రాణసఖి. బ్రహ్మలోకమునకు వెడలునపు డామె నన్ను నిజ మగు ముముక్షురాలననియు, క్షీరాబ్ధిశాయి యగు మహావిష్ణువును ఉపాసించు దాననినియు దెలిసికొని ప్రేమ పూర్వకముగ నాతో నిట్లు చెప్పెను- "సఖీ! స్వయంప్రభా! నీవీ యేకాంతము శాంతము నగు స్థానమున నుండి తపస్సు

చేయుము. త్రేతాయుగమున స్వయముగ శ్రీనారాయణుడు భూభారహరణార్థమై అయోధ్యాధిపతి యగు దశరథునకు ఆయన ధర్మపత్నియగు కౌసల్యకు పుత్రరూపమున జన్మించును. ఆయన ధర్మసంస్థాపనమునకు, దుష్టవినాశమునకు వనమునసంచరించును. ఆయన యొక్క భార్య నన్వేషించుచు గొందఱు వానరులు ఈ గుహాలో నున్న నీ కడకువత్తురు. నీవు భక్ష్య భోజ్యములతోను, మధురఫలములతోను వారికి స్వాగతమిచ్చి పరమప్రభువగు నా శ్రీరాముని కడకు వెడలుము. ఆయనను దర్శించి, ప్రేమపూర్వకముగ ప్రార్థింపుము. ఆయనదయచే యోగులకు దుర్లభమగు విష్ణుధామమునకు వెడలగలవు.''

కృతజ్ఞతాపూర్వకముగ హనుమంతుని జూచుచు ఆమె మఱల యిట్లుపలికినది- ''నేను దివ్యుడను గంధర్వుని పుత్రికను. నా పేరు స్వయంప్రభ. నేడిచట మీ పవిత్రచరణములు సోకుటచే నా భాగ్య భాను డుదయించినాడు. ఇపుడు నేను భగవాను డగు శ్రీరాముని దర్శనమునకై తహతహలాడుచున్నాను. మీరు మీ మీ నేత్రములను మూసికొనుడు, వెంటనే యీ గుహానుండి బయటకు వెడలగలరు. మీరు సీతాదేవిని దర్శింపగలరు. నిరాశ చెందవలదు.''

స్వయంప్రభ యాదేశమును ననుసరించి భల్లూక వానరులందఱు నేత్రములను మూసికొనిరి. వెంటనే వారు గుహాకు బయటగల అరణ్యములోనికి వెడలిరి.

## సంపాతిద్వారా సీతాదేవి జాడను దెలిసికొనుట

వానరభల్లూకవీరులు మరల సీతాన్వేషణార్థమై బయలు దేరిరి. అధికశ్రమతో వెదకినను రావణుని జాడగాని, సీతాదేవి జాడగాని తెలియరాలేదు. అలసిన వానరభల్లూకవీరులు గూర్చుండి 'ఇక యేమి చేయవలయు'నని పరస్పర మాలోచించుకొనసాగిరి. అపుడు మరల దుఃఖితుడై అంగదు డిట్లు పలికెను. ఈ గుహాలలో దిరుగుట మొదలిడి దాదాపొక మాసము గడచినది. సుగ్రీవుడు చెప్పిన గడువు గడచిపోయినది. సీతాదేవి జాడ తెలియరాలేదు. ఇక ఇపుడు కిష్కింధకు తిరిగి వెడలినచో మనకు చావు తప్పదు. నన్ను ఆయన విడువడు, నేను ఆయన శత్రువునకు పుత్రుడనుగదా! అందువలన తప్పక చంపగలడు. నన్ను ధర్మాత్ముడు, వీరవరుడు నగు శ్రీరాముడు కాపాడినాడు. ఇపుడు ప్రభుకార్యము నెరవేర్ప లేదను నెపముతో ఆయన నన్ను ప్రాణములతో విడువడు. అందువలన నేను తిరిగి వెడలను. ఏదియో నొకవిధముగ ఇచట ప్రాణములను విడుతును."

ఇట్లు శ్రునయనములతో యువరాజగు నంగదుడు విలపించుట చూచి వానరులు చాల బాధపడిరి. సానుభూతితో వారంగదునితో నిట్లు పలికిరి– "నీవు చింతింపవలదు. మేము మా ప్రాణముల నిచ్చియైనను నీ ప్రాణములను గాపాడుదుము.

మనము అమరావతీపురములోని సుఖసామగ్రులతో గూడి యున్న ఈ గుహాయందే సుఖముగ నుండగలము.

వానరులు మెల్లగ చెప్పిన మాటలు విని పరమనీతిజ్ఞుడగు పవననందనుడు యువరాజునకు ధైర్యముచెప్పుచు మిగుల ప్రేమతో నిట్లుపలికెను :- "యువరాజా ! నీవు వ్యర్థముగ ఏల చింతిల్లుచున్నావు ? నీవు మహారాణి యగు తారకు ప్రాణప్రియ పుత్రుడవగుటవలన సుగ్రీవునకుగూడ సహజముగనే ఇష్టుడవై యున్నావు. నీయందు శ్రీరాఘవేంద్రునకు ప్రేమ ప్రతి దినము లక్ష్మణునిపైకంటెను అధికమగుచున్నది. వానరులు నిన్నీగుహాలో నిష్కంటకముగ నుండ మనిపలికిరి. కాని యది వ్యర్థము. ఏలయనగా ముల్లోకములలో ఏలక్ష్యముగూడ శ్రీరాముని బాణములచే అభేద్యముకాదు. భార్యాపుత్రులను ఎప్పుడును ఎడబాయని ఈవానరులు నీకు తగిన సలహా నిచ్చుటలేదు".

పవనపుత్రుడు మిగుల ప్రేమతో అంగదునకు నచ్చ చెప్పుచు ఇంకను ఇట్లుపలికెను :- "కుమారా ! ఇంతేకాదు నేను నీ కొకరహస్యమును చెప్పుచున్నాను శ్రద్ధగ వినుము. శ్రీరామచంద్రుడు సామాన్యమానవుడుగాడు. ఆయన సాక్షాత్తుగ నిర్వికారుడైన శ్రీనారాయణుడు. సీతాదేవి జగన్మోహిని యగు మాయ. లక్ష్మణుడు త్రిభువనధారుడైన సాక్షాత్తు ఆది శేషువే. వారందఱు బ్రహ్మదేవునిప్రార్థన ననుసరించి రాక్షస

వినాశమునకై మాయామానవరూపమున జన్మించిరి. వీరిలో నొక్కొక్కరు ముల్లోకములను రక్షింపసమర్థులు.

> అన్యద్గుహ్యతమం వక్ష్యే రహస్యం శ్రుణు మే సుత।
> రామో న మానుషో దేవః సాక్షాన్నారాయణోఽవ్యయః ॥
>
> సీతా భగవతీ మాయా జనసమ్మోహకారిణీ ।
> లక్ష్మణో భువనాధారః సాక్షాచ్ఛేషః ఫణీశ్వరః ॥
>
> బ్రహ్మణా ప్రార్థితాస్సర్వే రక్షోగణవినాశనే ।
> మాయామానుషభావేన జాతా లోకైకరక్షకాః ॥
>
> (వా. రా. 4-7-16-18)

మనము పరమప్రభువులీలాకార్యమునందు కారణ మగు నుండుట నిజముగా గొప్పయదృష్టమే."

ఇట్లు యువరాజగు అంగదునకు ధైర్యము చెప్పిన మీదట మహాపరాక్రమశాలియు రామదూతయు నగు హనుమంతుడు జాంబవంతుడు, అంగదుడు మున్నగు వానరులతో గూడి సీతాదేవిని అన్వేషించుచు మెల్లమెల్లగ దక్షిణసముద్ర తటముపై గల మహేంద్రపర్వతముయొక్క లోయలోనికి జేరు కొనెను. అచట ఎదురుగా అగాధమైన హద్దులేని మహాసాగరమునందలి భయంకరములైన అలలను చూచి వానరులు భల్లూకములు భయపడిపోయిరి. సీతాన్వేషణార్థమై సుగ్రీవుడొసంగిన ఒకమాసము గడువుగూడ పూర్తిఅయ్యెను. ఎదుట మహాసముద్రము. వీరులైన వానరభల్లూకములబుద్ధి పనిచేయక

పోవుచుండెను. అందువలన వానరరాజగు సుగ్రీవునికఠోరదండ నమునుగూర్చి ఆలోచించి వారు ఇట్లు పలికిరి.

"రాజగు సుగ్రీవుడు దుర్దండుడు. ఆయన తప్పక మనలను చంపగలడు. సుగ్రీవుని చేతిలో మరణించుటకంటె ప్రాయోపవేశనమునందే (అన్నమును, నీటిని వదలి మరణించుటయందే) మనకు శ్రేయస్సు ఉన్నది" అని నిర్ణయించుకొని వారందఱు దర్భలను పఱచుకొని మరణింపదలచి అచ్చటనే కూర్చుండిరి.

వానరుల కోలాహలమును విని గృధ్రరాజయైన సంపాతి వింధ్యగిరికందరమునుండి బయటకు వచ్చి అన్నపానీయములను వదలి మరణించుటకు నిశ్చయించి కుశాసనములపై కూర్చుండియున్న వానరభల్లూకములను చూచి హర్షాతిరేకముతో నిట్లు పలికెను :-

విధిః కిల నరం లోకే విధానేనానువర్తతే।
యథాయం విహితో భక్ష్యశ్చిరాన్మహ్యముపాగతః ॥
పరంపరాణాం భక్షిష్యే వానరాణాం మృతం మృతమ్।
(వా. రా. 4-56-4-5)

లోకమున పూర్వజన్మకర్మననుసరించి మానవునకు తాను చేసికొనినఫలము లభించునట్లు నేడు దీర్ఘకాలానంతరము ఈ భోజనము నాకు దానియంతటదియే లభించినది. ఇది నేను చేసికొనిన కర్మఫలమైయుండవచ్చును. ఈ వానరులలో ఎవ

రేవరు చనిపోవుచునుందురో వారిని నేను క్రమముగ భక్షించుచుండగలను".

భోజనమునకై తహతహలాడుచున్న మహాకాయము కలిగిన సంపాతిని జూచి వానరులు మిగుల భయపడుచు నిట్లు ఆలోచింపసాగిరి — "మనము శ్రీరామునకు ఎట్టిసేవను చేయలేదు, సుగ్రీవుని ఆజ్ఞను పరిపాలింపలేదు ఇపుడు మనము వ్యర్థముగ దీనికడుపులోనికి పోనున్నాము." పిమ్మట వారు ఱెక్కలు లేని ఆగృధ్రమునకు వినబడునట్లుగ ఈవిధముగ పలికిరి —

అహో జటాయుర్ధర్మాత్మా రామస్యార్థే మృతః సుధీః ।
మోక్షం ప్రాప దురావాపం యోగినామప్యరిందమ ॥
(అ.రా. 4.7.34)

"ఆహా! ధర్మాత్ముడగు జటాయువు ఎంతధన్యుడు? బుద్ధిమంతుడగు అతడు శ్రీరామునికార్యార్థమై తనప్రాణముల నొసంగినాడు. చూడుము, ఆ శత్రుదమనుడు యోగులకుగూడ దుర్లభమగు మోక్షపదవిని పొందినాడు".

జటాయువుపేరు విని సంపాతి మిగుల దుఃఖితుడై అత్యంతాశ్చర్యములో వానరులతో నిట్లు పలికెను —

కే వా యూయం మమ భ్రాతుః కర్ణపీయూషసన్నిభమ్ ॥
జటాయురితి నామాద్య వ్యాహరన్తః పరస్పరమ్ ।
ఉచ్యతాం వో భయం మా భూన్మత్తః ప్లవగసత్తమాః ॥
(అ. రా. 4-7-35-36)

"వానరశ్రేష్ఠులారా! మీ రెవరు? మీలో మీరు నాకర్ణములకు అమృతమువలె ప్రియమును కలిగించు నా సోదరుడైన జటాయువునామము నుచ్చరించుచున్నారు. మీరు ఏమాత్రమును భయపడక మీవృత్తాంతమును నాకు వినిపింపుడు".

సంపాతి ధైర్యము చెప్పినను వానరయూధపతులు వానిని నమ్మలేదు. మాంసభోజియైన మహాకాయము కలిగిన ఆ గృధ్రమును వారు అనుమానించిరి. దీర్ఘాలోచనానంతరము వానరులు వానికడకు వెడలిరి. యువరాజగు అంగదుడు వానికి శ్రీరామునిజన్మనుండి సీతాహరణమువరకు జరిగిన కథనంతటిని సవిస్తరముగ వినిపించెను. పిమ్మట జటాయువు సీతాదేవిని రక్షించుటకై రావణునితో యుద్ధముచేసి శ్రీరామునియొడిలో సుఖముగ ప్రాణములను వదలిన విషయమును, పరమకారుణికుడగు శ్రీరాముడు ఆ జటాయువునకు చేసినఅంతిమసంస్కారమును గూర్చియు వానరులు చెప్పిరి. చివరకు వారు 'మా వానరరాజైన సుగ్రీవునియాజ్ఞననుసరించి సీతాదేవిని అన్వేషించుటకై ఇచటికి వచ్చితిమి, కాని ఇంతవరకు ఆమెజాడ తెలియలేదు, అందువలన మేము దుఃఖముచే ధైర్యహీనులము వ్యాకులరము నగుచున్నాము" అనియు చెప్పిరి.

తనప్రాణప్రియసోదరుడైన జటాయువు ప్రభువుకొఱకు ప్రాణముల నర్పించెననియు, వానియంతిమగతి సుఖపూర్ణముగ నయ్యెననియు విని సంపాతి ఆనందవిహ్వలుడయ్యెను. ఇంతే

కాదు మహాముని యగు చంద్రునివాక్కు ననుసరించి తనకు పరమశ్రేయస్సు గలుగుక్షణము ఆసన్నమయ్యె ననియెఱింగి సంపాతి తనదుఃఖమునంతటిని మరచెను. వానిశరీరమంతయు పరమానందముచే పులకితమయ్యెను.

అంగదస్య వచః శ్రుత్వా సంపాతిర్హృష్టమానసః ॥
ఉవాచ మత్ప్రియో భ్రాతా జటాయుః ప్లవగేశ్వరాః ।
బహువర్షసహస్రాన్తే భ్రాతృవార్తా శ్రుతా మయా ॥
(అ.రా. 4.7.46-47)

'అంగదునిమాటలు విని చిత్తము ప్రసన్నము కాగా సంపాతి ఇట్లుపలికెను — కపీశ్వరులారా! జటాయువు నాకు పరమప్రియుడైన సోదరుడు. నేను కొన్ని వేలసంవత్సరముల తరువాత నాసోదరునిగూర్చి వింటిని'

వాఙ్మతిభ్యాం హి సర్వేషాం కరిష్యామి ప్రియం హి వః ॥
యద్ధి దాశరథేః కార్యం మమ తచ్చాత్ర సంశయః ।
(వా.రా. 4.59.24-25)

నేను వాక్కుద్వారా, బుద్ధిద్వారా మీయందఱకు ప్రియమైన పనిని తప్పక చేయగలను. ఏలయన దశరథనందనుడైన శ్రీరామునికార్యము నాకార్యమే, ఇందులో సందేహము లేదు.

సంపాతి ఇంకను ఇట్లుపలికెను :- 'మొట్టమొదట మీరు నన్ను నీటికడకు తీసికొనివెడలుడు. అచట నేను నాసోదరునకు

తర్పణముల నొసంగవలెను. పిమ్మట మీపని నెరవేరుటకై నేను తగినమార్గమును చెప్పగలను.'

సంపాతికోరికను విని, మహావీరు డగు హనుమంతుడు వాని నెత్తుకొని సముద్రతటమునకు తీసికొనిపోయెను. అచట సంపాతి స్నానముచేసి జటాయువునకు తర్పణములొసంగెను. పిమ్మట వానరులు వానిని వానిస్థానమునకు తీసికొనివెడలిరి. అచట శ్రీరామచంద్రుని భక్తులు ఎదుట కూర్చుండగా చూచిన సంపాతియొక్క సుఖమునకు అంతములేకపోయెను. వాని శారీరక మానసిక కష్టము మొదటనే తొలగిపోయెను. అతడు నలువైపుల తనదృష్టిని ప్రసరింపజేసి ప్రభువుయొక్క ప్రియభక్తులతో ఆదరముగ నిట్లుపలికెను :-

త్రికూటపర్వతముపై లంకానగర మున్నది. అచట రావణుడు సహజముగనే శంకారహితుడై యున్నాడు. అచట అశోక మను ఒక ఉద్యానవన మున్నది. అచట సీతాదేవి శోకమగ్నయై కూర్చుండియున్నది. నేను అంతయు చూచుచున్నాను. మీకు కనబడుటలేదు. ఏలయనగా గృధ్రదృష్టి అపారమైనది అనగా బహుదూరమువరకు వెడలునట్టిది. నేను వృద్ధుడనైతిని, లేనిచో మీకు చాలసాహాయ్యము చేసి యుండెడివాడను'.

ఇంకను వారిని ప్రోత్సాహపరచుచు సంపాతి ఇట్లు పలికెను —

తద్భవన్తో మతిశ్రేష్ఠా బలవన్తో మనస్వినః ॥
ప్రహితాః కపిరాజేన దేవైరపి దురాసదాః ।
(వా.రా. 4-59-25-26)

మీరుగూడ ఉత్తమబుద్ధియుక్తులు, బలవంతులు, దేవతలకు దుర్జయులు నైయున్నారు. అందువలననే వానరరాజగు సుగ్రీవుడు మిమ్ము ఈ కార్యమునకు పంపినాడు.

తదనంతరము అతడు శ్రీరామలక్ష్మణులతీక్ష్ణశరముల మహిమను గానముచేయుచు వానరభల్లూకములతో నిట్లు పలికెను —

రామలక్ష్మణబాణాశ్చ విహితాః కంకపత్రిణః ॥
త్రయాణామపి లోకానాం పర్యాప్తాస్త్రాణనిగ్రహే ।
కామంఖలు దశగ్రీవస్తేజోబలసమన్వితః ।
భవతాం తు సమర్థానాం న కించిదపి దుష్కరమ్ ॥
(వా.రా.4-59-26-27)

కంకపత్రములతో గూడిన శ్రీరామలక్ష్మణుల బాణములు సాక్షాత్తుగ విధాతచే నిర్మితములైనట్టివి. అవి ముల్లోకములను సంరక్షించుటయందు నిగ్రహించుటయందు సమర్థములైనట్టివి. మీకు శత్రువగు రావణుడు తేజస్వియు బలవంతుడు అయినను మీవంటివీరులు వానిని ఓడించుట దుష్కరముకాదు.

ప్రోత్సహించిన పిమ్మట సంపాతి యిట్లు పలికెను- "మీరు ఏదియోవిధముగ సముద్రమును దాటుటకు

ప్రయత్నింపుడు. రాక్షసరాజగు రావణుని వీరవరుడగు శ్రీరామచంద్రుడు సంహరింపగలడు. సముద్రమును దాటి లంకలోనికి వెడలి, సీతాదేవిని దర్శించి, ఆమెతో మాటలాడి మరల సముద్రమును దాటివచ్చువీరుడు మీలో ఎవడున్నాడో ఒకసారి ఆలోచింపుడు'.

సంపాతిద్వారా సీతాదేవిజాడను తెలిసికొని వానర బృందము మహదానందమునందెను. పిమ్మట కుతూహలము గలవారై వారు సంపాతియొక్క జీవితచరిత్ర పూర్తిగ తెలిసి కొనగోరి అడిగిరి. అతడు వారికి మిగుల ఆదరముతోను ప్రేమ తోను తనరెక్కలు భస్మమగుటనుగూర్చి, చంద్రముని చెప్పిన సమస్తవిషయములనుగూర్చి చెప్పెను. అనంతరము అత డిట్లు పలికెను - "వానరులారా! రెక్కలు లేనిపక్షి యొక్క పరిస్థితినిగూర్చి యేమిచెప్పుదును! నా యీ దయనీయమైన స్థితిలో నాపుత్రుడు పక్షిప్రవరుడు నగు సుపార్శ్వుడే తగు విధముగ ఆహారము నొసంగి నన్ను పోషించుచున్నాడు. మా యాకలి మిగుల తీవ్రమైనది. ఒకనాడు నేను ఆకటిబాధచే పీడింపబడుచుంటిని, కాని నాకుమారుడు ఆలస్యముగ వట్టిచేతుల తో తిరిగివచ్చెను. అందువలన నేను వానిని చాలపరుషముగ దూషించితిని. అతడు వినయముగ నాతో నిట్లుపలికెను- "నేను మీయాహారమునకై తగినసమయమున ఆకాశమునందు ఎగిరి తిని, మహేంద్రగిరిద్వారమును అడ్డగించి నాముక్కును వంచి సముద్రములోని ప్రాణులను చూచుచుంటిని. అపుడు అచట

నేనొక కాటుకకొండవలె నున్న బలవంతుడైన ఒకపురుషుని చూచితిని. అతడు నేను చూచుచుండగనే అలౌకిక తేజస్సంపన్నురాలగు ఒకస్త్రీని బలాత్కారముగ తీసికొనిపోవుచుండెను. ఆ స్త్రీపురుషులద్వారా నేను మీయాకలిని తీర్చుటకు నిశ్చయించితిని. కాని మధురము వినమ్రము నగు ఆపురుషుని వాక్కుచే ప్రభావితుడనై నేను వానిని విడిచిపెట్టితిని.

అనంతరము నాకు మహర్షులవలన సిద్ధపురుషులవలన ఆయలౌకిక తేజస్సు కలిగిన స్త్రీ దశరథనందనుడగు శ్రీరామచంద్రుని భార్య యగు సీతయనియు, ఆ నల్లనిపురుషుడు లంకాధిపతి యగు రావణుడనియు వింటిని. సీతాదేవి జుట్టు విడివడియుండెను. ఆమె మిగుల దుఃఖముతో రామలక్ష్మణుల నామములను ఉచ్చరించుచు విలపించుచుండెను. ఆమె యాభూషణములు జారిపోవుచుండెను. అందువలన నే నిచటికి వచ్చుట ఆలస్యమైనది.

రెక్కలులేనివాడను, నిస్సహాయుడను, వివశుడను నగు నేను గిలగిలలాడుచు నుంటిని. ఏమియు చేయలేకపోయితిని. దుష్టు డగు రావణునిశక్తి నాకు తెలిసియేయున్నది. అందువలన జగదంబ యగు సీతాదేవిని రక్షింపలేకపోవుటచే నేను వానిని కఠినముగ పలికితిని".

తస్యా విలపితం శ్రుత్వా తౌ చ సీతావియోజితౌ ॥
న మే దశరథస్నేహాత్ పుత్రేణోత్పాదితం ప్రియమ్ ।

(వా. రా. 4-63-7-8)

'సీతాదేవి విలాపమును వినియు ఆమెనుండి ఎడబాటు గలిగిన రామలక్ష్మణుల పరిచయమును పొందియు, దశరథ మహారాజుతో నాకు గలస్నేహమును గుర్తుకు తెచ్చుకొనియు నాపుత్రుడు సీతాదేవిని కాపాడలేదు. తనయీ ప్రవర్తనచే అతడు నన్ను సంతోషపెట్టలేకపోయెను. అనగా నా కిష్టమైన పనిని జరుగనీయలేదు'.

గొప్ప అదృష్టవంతు డగు సంపాతి వానరులకు తనకథ చెప్పుచుండగనే వాని రెండుఱెక్కలు తిరిగి ఉత్పన్నమయ్యెను. వానికి యౌవనకాలమునాటి బలముకూడ కలిగెను. మహర్షి యగు చంద్రునివాణిని స్మరించి అతడు మిగుల సంతసించి వానరులతో నిట్లుపలికెను :-

సర్వథా క్రియతాం యత్నః సీతామధిగమిష్యథ ॥
పక్షలాభో మమాయం వః సిద్ధిప్రత్యయకారకః ।
(వా. రా. 4-63-12-13)

'వానరులారా! మీ రన్నివిధముల ప్రయత్నింపుడు. తప్పక మీకు సీతాదేవిదర్శనము కాగలదు. నాకు ఱెక్కలు మొలచుట మీకార్యసిద్ధికి సూచన'.

తరువాత అతడు మంగళమయమగు శ్రీరామచంద్రుని నామముయొక్క గొప్పతనమునుగూర్చి వర్ణించుచు సముద్రోల్లంఘనము మీకు మిగుల సులభకార్యమని చెప్పి వారితో సంపాతి యిట్లు పలికెను :-

యన్నామస్మృతిమాత్రతో౽పరిమితం సంసారవారాంనిధిం
తీర్త్వా గచ్ఛతి దుర్జనో౽పి పరమం విష్ణోః పదం శాశ్వతమ్।
తస్యైవ స్థితికారిణస్త్రిజగతాం రామస్య భక్తాః ప్రియా
యూాయం కిం న సముద్రమాత్రతరణే శక్తాః కథం
వానరాః॥ (అ. రా. 4-8-55)

'వానరులారా! ఎవనినామస్మరణముచేతనే దుష్టజనులు గూడ ఈయపారసంసార సాగరమును దాటి విష్ణుభగవానుని సనాతనపరమపదమును పొందుచున్నారో మీరు ముల్లోకము లను కాపాడు ఆ శ్రీరామచంద్రునకు ప్రియభక్తులు. ఇక క్షుద్రమైన యీసముద్రమును దాటుటకు మీరేల సమర్థులు కారు?

వినీతాత్ముడు, మహాపరాక్రమశాలియు నగు పవనకుమా రుడు అదృష్టశాలి యగు సంపాతి పలికిన ఒక్కొక్కమాటను మిగుల శ్రద్ధగ వినుచుండెను. సీతాదేవియొక్క స్పష్టమైన జాడ తెలిసెను. పిమ్మట వాని సంతోషమునకు మేరలేక పోయెను. వాని రోమరోమము పులకించిపోయెను.

అపుడు పక్షిశ్రేష్ఠుడగు సంపాతి ఆ పర్వతశిఖరము నుండి ఎగిరి వెడలిపోయెను.

# సముద్రోల్లంఘనము : లంకాప్రవేశము

గృధ్రరాజగు సంపాతివలన జనకరాజపుత్రికవార్తను విని వానరభల్లూక వీరులు హర్షాధిక్యతచే గంతులువేయసాగిరి. వారు జలధితటమునకు చేరుకొని, ఆసముద్రముయొక్క స్వరూపమును జూచి భయపడిరి. 'భయంకరముగ గర్జిల్లు ఉత్తుంగ తరంగయుక్తమగు ఈయపారసాగరము నెట్లుదాటవలెను.' అని వానరభల్లూక వీరులందఱు చింతితులు విషాదగ్రస్తులునై యుండుట చూచి యువరాజగు అంగదుడు అనేకవిధముల వారికి ధైర్యమును గలుగజేసెను. మహాసాగరమువలె వీర వానరభల్లూక సైన్యమును సుస్థిరముగ నుంచుటకు సమర్థులు అంగదుడు హనుమంతుడు ఇరువురే.

వాలికుమారుడగు అంగదుడు వానరభల్లూకవీరులందఱితో నిట్లు పలికెను— 'మిత్రులారా! మీరందఱు సాటిలేనివీరులు. మీగమనము ఎప్పుడును ఆగిపోవునదికాదు. జగన్మాతయగు జానకీదేవియొక్కజాడను కనుగొనుటకై అపారమైన ఈసముద్రమును దాటి లంకలోనికి చేరుకొనువీరుడు మీలో ఎవరున్నారు?'

అంగదునివాక్కులను విని మొదట వానరభల్లూక వీరులందఱు మిన్నకుండిరి. కాని కొంతసేపైనపిమ్మట గజనామక వానరుడు 'నేను పదియోజనములదూరము దుముకగలను.' అని

పలికెను. ఇదేవిధముగ గవాక్షుడు ఇరువదియోజనములు, శరభుడు ముప్పది, ఋషభుడు నలుబది, గంధమానుడు ఏబది, మైందుడు అఱువది, ద్వివిదుడు డెబ్బది, సుషేణుడు ఎనుబది యోజనములవరకు దూకగల మనిచెప్పిరి. వయోవృద్ధుడు, ఋక్షరాజు నగు జాంబవంతుడు ఇట్లుపలికెను — "పూర్వము యౌవనకాలమున నేనుగూడ చాలదూరము దుముకుచుండెడి వాడను. కాని ఇపుడు ఆ శక్తి నాలోలేదు. అయినను వానర రాజగు సుగ్రీవునియొక్క, కౌసల్యానందునియొక్క కార్యమును ఉపేక్షించుట సంభవముకాదు. ఈవృద్ధావస్థలో నేను కేవలము తొంబదియోజలములదూరమువరకు దుముకగలను. పూర్వకాలమున విష్ణువు త్రివిక్రమావతారమున మూడడుగులు కొలుచుకొనునప్పుడు అంతలో ముల్లోకముల నతిక్రమించి యున్న యతనియాకారమును నేను ప్రదక్షిణముగా ఇరువది యొక్కమార్లు చుట్టివచ్చితిని. కాని యిప్పుడు ఈమహాసముద్రమును దాటుట నావలనకానిపని.'

అంగదుడు పలికెను — "నేను సముద్రమును దాటగలను. కాని తిరిగిరాగలనో లేదో చెప్పజాలను.'

అంగదుని వాక్కులను విని వాక్యకోవిదుడు, వృద్ధుడు నగు జాంబవంతుడు వానిని ప్రశంసించుచు "అంగదా! నీ వీ పనిని చేయుటకు పూర్తిగ సమర్థుడవై యున్నావు. కాని నీవు మాకందఱకు నాయకుడవు. అందువలన నిన్నుపంపుట మాకు తగదు. నీవు ప్రత్యేకముగ కాపాడదగినవాడవు." అనిపలికెను,

అంగదుడు దుఃఖితుడై "అట్లయిన సముద్రోల్లంఘనము సంభవముకానట్లు తోచుచున్నది. ఇక మనము ప్రాయోపవేశముచేసి కూర్చుందుముగాక" అనిపలికెను.

"లేదు కుమారా! శ్రీరామునికార్యము తప్పక నెరవేరును." అని అంగదుని ఓదార్చుచు జాంబవంతుడు అంజనానందనునివైపు చూచెను. అతడు పూర్తిగ మౌనముగ గూర్చుండియుండెను. వజ్రకాయుడగు ఈ హనుమంతుడు శాపమువలన భస్మాచ్ఛన్నమగు అగ్నివలె శాంతముగ నున్నాడని ఋక్షరాజునకు దెలియును. వీనికి తనయపరిమేయ శక్తినిగూర్చి తెలియదు. లేనిచో నితడు తనప్రభువగు సుగ్రీవుడు సంకటగ్రస్తుడైయుండుట చూచి ఎట్లు ఊరుకొనియుండగలడు? ఇతడు నిజముగ వాలిని శిక్షించియుండెడివాడే. జాంబవంతుడు హనుమంతునకు వానిశక్తిని గుర్తుచేయుచు నిట్లుపలికెను– "శ్రీరామునకు అనన్యభక్తుడవు, వజ్రకాయుడవు నగు హనుమంతుడా! శ్రీరామునికార్యార్థమై నీవు అవతరించితివి. ఏల మిన్నకుండెదవు? మహావీరా! నీవు పవనపుత్రుడవు, అంజనాదేవి క్షీరములను త్రావితివి. బాల్యకాలమునందే నీవు సూర్యుని అరుణఫలమనితలంచి వానిని భక్షించుటకై ఒక్కదుముకులో వానికడకు వెడలితివి. బ్రహ్మాదిదేవతలు నీకు అలౌకికములగు వరముల నిచ్చిరి. మహావీరుడవగు కేసరిపుత్రా! నీవు అపరిమితశక్తిసంపన్నుడవు. నీగమనము అడ్డులేనిది. విశాలమైన ఈజలధి నీకొకలెక్కలోనిది కాదు. లెమ్ము, సముద్ర

మును దాటి లంకలోనికి వెడలుము. అచట సీతాదేవిని దర్శించి వెంటనే తిరిగిరమ్ము. మాకు ప్రాణదానమొసంగి మమ్ము కాపాడుము, వివేకమునకు, జ్ఞానమునకు నిధి వగు వాయుపుత్రా ! చూడుము. చింతించుచున్నవారు, విచార గ్రస్తులు నగు ఈ యసంఖ్యవానరభల్లూక వీరులు నీవైపు చూచుచున్నారు.

జాంబవంతునిమాటలు వినినంతనె భగవత్స్మరణమున నిమగ్నుడై యున్న హనుమానునకు తనబలపరాక్రమములు గుర్తుకువచ్చెను. వెంటనే వానిశరీరము పర్వతాకారము వలె నయ్యెను. అతడు తనలోనియపారశక్తిని గుర్తించి భయానక ముగ గర్జించెను. ఆగర్జనమువలన భూమ్యాకాశములు, సమస్త దిక్కులు కంపించిపోయెను,

కనకభూధరాకారు డగు పవనకుమారుడు గర్జించుచు ఇట్లుపలికెను — "వానరులారా! నేను భగవత్కృపవలన ఆకాశమున సంచరించు సమస్త గ్రహములు మున్నగువానిని అతిక్రమించి ముందుకు పోవుటకు సిద్ధముగనున్నాను. నేను తలచుకొనిన సముద్రమును ఎండింపజేయగలను, పృథివిని చీల్చి వేయగలను, ఎగిరియెగిరి పర్వతములను పొడిపొడిగ చేయగలను, తుచ్ఛమైన యీసముద్రము నా కొకలెక్కలోనిది కాదు. ఇప్పుడు చెప్పుడు, నే నేమిచేయవలెను? నేను లంకలోనికి వెడలి దానిని పెకలించి సముద్రములో కలిపివేయవలెనా? సీతాదేవిని ఇచటకు తీసికొనిరావలెనా? లేక రావణునితోపాటు లంకనంత

టిని తగులబెట్టి బూడిదచేయవలెనా? లేక రాక్షసరాజగు రావణుని కంఠమున త్రాడును తగిలించి వానిని లాగుచు ఇక్కడకు తెచ్చి శ్రీరామచంద్రునిపాదములకడ పడవేయవలెనా? లేక జగన్మాత యగు జానకిని చూచియే తిరిగి రావలెనా? ఏమిచేయవలెనో చెప్పుడు."

పరమశక్తిశాలి యగు పవనకుమారునివాక్కులను విని జాంబవంతుడు ప్రసన్నుడై ఇట్లు పలికెను :- "నాయనా! నీవు సర్వసమర్థుడవు. కాని నీవు భగవానునిదూతవు, నీవు కేవలము సీతాదేవిని దర్శించి ఆమెసమాచారమును తీసికొనిరమ్ము, దీని తరువాత శ్రీరాముడు అచటికి వెడలి అసురకులమును ఉద్ధరింపగలడు, ఆయన పవిత్రకీర్తివిస్తరింపగలడు, మనమందఱము ప్రభుకార్యమున సహాయకులమై ధన్యులగుదుము, మనవానర భల్లూకవీరుల ప్రాణములు నీయధీనములో నున్నవి, మే మందఱము ఆతురతతో నీకై ఎదురుచూచుచుండగలము, నీవు త్వరగా వెడలుము, ఆకాశమార్గముద్వారా వెడలు నీకు శుభమగుగాక"!

వృద్ధులైన వానరభల్లూకవీరుల యాశీర్వాదములచే ప్రసన్నుడై మహాపరాక్రముడు, శత్రుమర్దనుడు, శ్రీరామదూతయునగు హనుమానుడు ఎగిరి మహేంద్రగిరి పర్వత శిఖరముపైకి ఎక్కెను. వాని చరణములయొత్తిడిచే పర్వతము క్రిందకు కూరుకొనిపోసాగెను. వృక్షములతోపాటు పర్వతశృంగము

విరిగి క్రిందపడసాగెను. అపుడు సర్వప్రాణులకు వాయుపుత్రుడు, మహాత్ముడు నగు హనుమానుడు మహాపర్వతమువలె విశాల కాయముగలవాడుగను, సువర్ణవర్ణుడైన బాలసూర్యునివలె మనోహర మగు ముఖము గలవాడుగను, సర్పరాజువంటి దీర్ఘములైన భుజములు గలవాడుగను కనబడసాగెను.

(మహానగేన్ద్రప్రతిమో మహాత్మా సువర్ణవర్ణోఽరుణ చారువక్త్రః
మహాఫణీన్ద్రాభసుదీర్ఘ బాహుర్వాతాత్మజోఽదృశ్యత సర్వభూతైః॥ (అ. రా. 4-9-29)

సముద్రమును దాటుటకు సిద్ధముగా నున్న ఆంజనేయుడు పూర్వాభిముఖుడై తనతండ్రి యగు వాయుదేవునకు నమస్కరించి, పిమ్మట శ్రీరామచంద్రుని స్మరించి వానరభల్లూకవీరులతో నిట్లు పలికెను :- "వానరులారా! నేను పరమప్రభు వగు శ్రీరామునికృపచేత, అమోఘమైన ఆయనవాక్కు ననుసరించి లంకలోనికి వెడలి జగజ్జననిని దర్శించి మరల తిరిగివత్తును. ప్రాణాంతకాలమున ప్రభువుయొక్క నామమును స్మరించి మానవుడు సంసారసాగరమును దాటును, నేను ఆయనదూతను, దివ్యమైన ఆయన యంగుళీయకము నాకడ నున్నది. నాహృదయమున ఆయనమూర్తి, వాక్కున ఆయననామము విరాజిల్లుచున్నవి. నేను ఈతుచ్ఛసముద్రమును దాటి కృతకృత్యుడ నగుదును. ఇందులో గొప్పవిషయ మేమియున్నది ! మీరు

నేను తిరిగివచ్చువంతవఱకు కందమూలములను ఆహారముగ గొనుచు ఇచటనే నాకై ఎదురుచూచుచుండుడు".

అపుడు వాయునందనునిలో తేజస్సు, బలము, పరాక్రమను అద్భుతముగ నున్నవి. దేవతలు జయజయధ్వానములను, ఋషులు శాంతిపాఠములను చేయసాగిరి. ఆంజనేయుడు దక్షిణమువైపుగా తన రెండుబాహువులను చాచి మిగుల వేగముతో ఆకాశముమీదకు గరుడునివలె ఎగిరెను. వాని వేగముచే ఆకర్షింపబడిన ఎన్నియో వృక్షములు పెకలింపబడి తమతమకొమ్మలతోగూడ ఎగిరిపోయినవి. పుష్పించినవృక్షములపుష్పములు వానిపైబడెను, అవి వాయుపుత్రుని పూజించుచున్నట్లు ఉండెను.

పవనపుత్రు డగు హనుమానుడు వాయువేగముతో శ్రీరామకార్యార్థమై వెడలుచుండుట చూచి సాగరు డిట్లు ఆలోచించెను. ఇక్ష్వాకువంశీయు డగు సగరచక్రవర్తియొక్క పుత్రులు నన్ను పెంచియుండిరి; అభయుడు, వజ్రకాయుడు నగు హనుమానుడు ఇక్ష్వాకులోత్పన్ను డగు శ్రీరాముని కార్యార్థమై లంకకు వెడలుచున్నాడు. అందువలన వీనికి మార్గమున విశ్రాంతి నొసంగుటకు ప్రయత్నింపవలెను."

సముద్రుడు మైనాకపర్వతముతో నిట్లు పలికెను — "శైలప్రవరుడా! చూడుము, కపిశ్రేష్ఠు డగు ఈహనుమానుడు ఇక్ష్వాకువంశీయు డగు శ్రీరామునకు సాహాయ్యముచేయుటకై

తీవ్రవేగముతో లంకకు వెడలుచున్నాడు. ఈపవిత్రవంశీయులు నాకు పూజ్యులు, నీకు పరమపూజనీయులు. అందువలన నీవు హనుమానునకు సాహాయ్యము చేయుము. నీవు వెంటనే నీటిలో నుండి పైకిలెమ్ము. దానిచే ఇతడు కొలదిసేపు నీశిఖరముపై విశ్రమించుగాక"!

మైనాకుడు సువర్ణమణిమయములైన తనయనేకశిఖరములతోగూడ సముద్రమునుండి చాలపైకి లేచి, ఒకశృంగముపై మనుష్యవేషమున నిలుచుండి హనుమంతు నిట్లుప్రార్థించెను. — "కపిశ్రేష్ఠా! నీవు వాయుపుత్రుడవు, ఆయనవలె అపరిమితశక్తిసంపన్నుడవు, ధర్మజ్ఞుడవు. నిన్ను పూజించిన సాక్షాత్తుగ వాయుదేవుని పూజించినట్లే యగును.

పూజితే త్వయి ధర్మజ్ఞే పూజాం ప్రాప్నోతి మారుతః ॥
(వా. రా. 5-1-122)

అందువలన నీవు తప్పక నాకు పూజనీయుడవు. మొదట పర్వతములకు రెక్కలుండెడివి. అవి ఆకాశమున ఇటునటు వేగముగ నెగురుచుండెడివి. ఇట్లు అవి యెగురుచుండుటచే దేవతలు, ఋషులు, సర్వప్రాణులు మిగుల భయపడిపోవుచుండిరి. దీనికి కోపించి సహస్రాక్షుడు లక్షలకొలది పర్వతముల రెక్కలను నరికెను. వజ్రాయుధమును తీసికొని క్రుద్ధుడైన సురేంద్రుడు నావైపుగూడ వచ్చెను. కాని నీతండ్రి యగు వాయుదేవుడు ఈసముద్రమున పడవేసి నన్ను రక్షించినాడు".

మైనాకుడు మిగుల ఆదరముతోను ప్రేమతోను "వాయు నందనా ! నీతో నాకీ పవిత్రసంబంధ మున్నది. నీవు నాకు మాననీయుడవు. అంతేకాదు సముద్రుడు గూడ నీకు విశ్రాంతి నొసంగ మని నన్ను ఆజ్ఞాపించినాడు. నీవు నాయందు గల వివిధములైన మధురఫలములను భుజింపుము. కొలదిసేపు విశ్రాంతితీసికొనుము. పిమ్మట నీపనికై వెడలుము" అని హనుమంతునితో పలికెను.

మైనాకునిమాటలు విని ఆంజనేయుడు మిగుల ప్రేమతో "మైనాకా ! నిన్ను కలిసికొనుటవలన నాకు సంతోషము కలిగి నది. నాయాతిథ్యమైనది. నాస్వామి కార్యమునకై త్వరగా వెడలుచున్నాను. అందువలన నే నిపుడు విశ్రమించుట అసం భవము" అని పలికెను.

కేసరీనందను డగు హనుమంతుడు నవ్వుచు మైనాకుని స్పృశించి తీవ్రవేగముతో ముందు వెడలెను. అపుడు శైలప్రవరు డగు మైనాకుడు, సముద్రుడు ఇరువురు వానివైపు మిగుల ఆదరముతోను ప్రేమతోను చూచి వానిని ఆశీర్వదించిరి.

ఆంజనేయుడు శ్రీరామచంద్రునికార్యమునకై వేగముగ లంకవైపు ఎగిరి వెడలుచుండుట చూచి దేవతలు వానిబలమును బుద్ధిని పరీక్షింపదలచి నాగమాత యగు సురసను పంపిరి. దేవ తల యాదేశము ననుసరించి సురస వికటము, భయంకరము నగు రూపమును ధరించెను. దాని నేత్రములు పచ్చగను, దవడలు

భయంకరముగను నుండెను. ఆమె ఆకాశమును స్పృశించునట్లు వికటతమ మగు తననోటిని తెరచి హనుమానునిమార్గమున నిలుచుండెను.

హనుమంతుడు తనవైపు వచ్చుట చూచి నాగమాత యిట్లు పలికెను— "బుద్ధిమంతుడా! నేను తీవ్రమైన ఆకటి బాధచే వ్యాకులపడుచున్నాను. దేవతలు నిన్ను నాకు ఆహారముగ పంపిరి. నీవు నానోటిలోనికి రమ్ము. నాయాకలి బాధను శాంతపరచుము.

అంజనానందను డిట్లు సమాధాన మొసంగెను — "తల్లీ! సురసా! నానమస్కారములను స్వీకరింపుము. నేను ఆర్త త్రాణపరాయణు డగు రఘునాథునికార్యమునకై లంకకు వెడలుచున్నాను. ఇపుడు సీతాదేవిజాడను తెలిసికొనుటకై నీవు నన్ను పోనిమ్ము. అచటనుండి వెంటనే తిరిగివచ్చి రాముని సీతాదేవి క్షేమసమాచారములను తెలియజెప్పి నేను నీనోటిలోనికి ప్రవేశింపగలను".

కాని శ్రీరామదూతయొక్క బలబుద్ధులను పరీక్షించుటకై వచ్చిన సురస ఆయనను ఏవిధముగనూడ ముందుకు పోనీయకపోయెను. అపుడు హనుమంతుడు ఆమెతో 'మంచిది నీవు నన్ను భక్షించుము' అనిపలికెను.

సురస తననోటిని ఒకయోజనము వెడల్పు తెరచెను.

వాయునందనుడు వెంటనే తనశరీరమును ఎనిమిది యోజనముల వెడల్పుచేసెను. ఆమె తననోటిని పదునాలుయోజనములు పెంచగా పవనకుమారుడు వెంటనే ముప్పదిరెండు యోజనములు పెరిగెను. సురస ఎంతగా తనభయంకరమైన నోటిని తెరచుచుండెనో బృహత్కాయుడైన హనుమానుడు దానికి రెట్టింపుగ తనశరీరమును పెంచుచుండెను. సురస తననోటిని నూఱుయోజనములు పెంచగా వాయుపుత్రుడు అంగుష్ఠమాత్ర ప్రమాణుడై ఆమెనోటిలోనికి ప్రవేశించెను.

సురస తననోటిని మూసికొనపోవుచుండగా మహామతి యగు ఆంజనేయుడు ఆమెనోటినుండి బయల్వెడలి వినయముగ నిట్లు పలికెను :- తల్లీ ! నేను నీనోటిలోనికి వెడలి బయటకు వచ్చితిని. నీమాట పూర్తియైనది. ఇపుడు నన్ను నాస్వామి కార్యమును తీర్చుటకు పోనిమ్ము'.

సురస శ్రీరామదూతను పరీక్షించుటకే వచ్చినది. ఆమె యిట్లు పలికెను :- వాయునందనా ! నీవు జ్ఞాన నిధివి. దేవతలు నిన్ను పరీక్షించుటకై నన్ను పంపిరి. నేను నీ బలబుద్ధులరహస్యము నెఱింగితిని. ఇపుడు నీవు వెడలి శ్రీరాముని కార్యమును నెరవేర్చుము. నీకు తప్పక సాఫల్యము కలుగును. నేను హృదయపూర్వకముగ నిన్ను ఆశీర్వదించుచున్నాను''.

సురస దేవలోకమునకు వెడలగా ఉగ్రవేగు డగు

శ్రీమారుతాత్మజుడు గరుడునివలె ముందుకు వెడలెను. మైనాకవందితుడు, వానరశిరోమణియు, శ్రీరామదూతయు నగు హనుమానుడు వాయువేగముతో ఎగురుచు వెడలుచుండెను. మార్గమున సింహిక యను రాక్షసి సముద్రమున ఎదురపడెను. ఆమె ఆకాశమున ఎగిరి వెడలు ప్రాణులను వాని ప్రతిబింబములద్వారా లాగి చంపుచుండెను. ఛాయాగ్రాహిణి యగు సింహిక సముద్రమునుండి పవనపుత్రునిఛాయనుగూడ పట్టుకొనెను. హనుమానునిగమనము ఆగిపోయెను. ఆశ్చర్యపడిన శ్రీరామదూత నలువైపుల చూచెను, కాని వానికి ఎచ్చట ఏమియు కనబడలేదు. క్రిందకు చూడగా నీటిపై స్థూలశరీరము కలిగిన భయంకరరాక్షసి కనబడెను. అపుడు విశాలకాయుడగు హనుమంతుడు వేగముగ సింహికపైకి దుమికెను. భూధరాకారుడు, మహాతేజస్వియు, మహాశక్తిశాలియు నగు పవనపుత్రునిబరువును ఆరాక్షసి ఎట్లు సహింపగలదు? నలిగి పొడిపొడి అయ్యెను.

హనుమానుడు చేసిన ఈభయంకరకార్యమును చూచి ఖేచరులు ఆయనను స్తుతించుచు నిట్లు పలికిరి – "కపివరుడా! విశాలకాయము గలిగిన ఈప్రాణిని సంహారించి గొప్పపనిచేసితివి. ఇక ఇపుడు నీవు ఆపదలు లేనివాడవై ముందుకు పోగలవు. వానరేంద్రా! ఏపురుషునిలో నీవంటిధైర్యము, తెలివి, బుద్ధి, కౌశల్యము అను ఈనాలుగుగుణము లుండునో వానికి వాని కార్యమున ఎప్పుడును అసఫలత కలుగదు."

ఆకాశమున సంచరించు ప్రాణులవాక్కులను వినుచు పవనపుత్రుడు దక్షిణదిక్కుగా మిగులవేగముగ పయనించు చుండెను. కొలదికాలములోనే అతడు నిర్విఘ్నముగ సముద్ర తటమునకు చేరుకొనెను. అచట వివిధసుగంధపుష్పములతోను, ఫలములతోను నిండియున్న వృక్షములుగల సుందరోద్యానము లుండెను. అవి తుమ్మెదలఝుంకారములచేత, అనేకవిధము లగు సుందరపక్షులకలరవములచే ప్రతిధ్వనించుచుండెను. అచట మృగశాబకములు క్రీడించుచు ప్రసన్నముగ ఇటునటు పరుగిడు చుండెను. శీతలమందపవనము వీచుచుండెను. అది మిగుల మనోరమదృశ్యము. అచటినుండి త్రికూటపర్వతశిఖరములపై నిర్మింపబడి నలువైపుల ప్రాకారములతో చుట్టబడియున్న రావణునిలంకానగరము స్పష్టముగ కనబడుచుండెను.

ఆంజనేయుడు ఒకమారు నలువైపుల చూచెను. పిమ్మట అతడు లంకలోనికి ప్రవేశించుటకు ఆలోచింపసాగెను. దుర్ధర్షుడగు దశాననునితో యుద్ధము తప్పదు. అందువలన ఇచట అపరిమిత మగు వానరభల్లూకసేనతో స్వామి నివసించుటకు స్థలమునుగూర్చి, ఆహారపానీయములనుగూర్చి తెలిసికొనవలెను. ఈదుర్గము మిగుల దుర్గమముగా తోచుచున్నది. అందువలన ఆక్రమణదృష్టితో ఇచటివిషయముల నొక్కొక్కదానినిగూర్చి తెలిసికొనుట తప్పనిసరి. కాని యీవిశాలవేషముతో నున్న పగటిపూట వెలుగులో అసురులకు నాయాగమన రహస్యము

తెలియగలడు. అందువలన రాత్రివేళ సూక్ష్మవేషమున దుర్గమ మగు ఈదుర్గములోనికి ప్రవేశించుట తగును అనియతడు ఆలోచించెను.

ఆంజనేయుడు ఎగిరి ఒకపర్వతమును ఎక్కి, అచటి నుండి లంకాపట్టణమును చూడసాగెను. ఆపురము సుదృఢ మగు దుర్గమైయుండెను. దానిసౌందర్యము అనిర్వచనీయ ముగ నుండెను. దానికి నలువైపుల సముద్రముండెను; దాని ప్రాకారములు సువర్ణనిర్మితములైయుండెను. దానిద్వారము లన్నియు సువర్ణనిర్మితములే. ప్రతిద్వారముమీాద ఇంద్రనీల మణినిర్మితములైన వేదిక లుండెను. అచటిపథములు విస్తృతము గను, స్వచ్ఛముగను, ఆకర్షకముగను నుండెను. రావణునిచే పాలింపబడు లంకాపట్టణమున ప్రతిస్థలము నందును సుందర ములు నిర్మలజలపూరితములు నగు జలాశయము లుండెను. వానినిర్మాణమున విశ్వకర్మ తనబుద్ధి నంతటిని వ్యయముచేసి నట్లుండెను.

లంకలో అంతట శస్త్రధారులు భయంకరులు నగు సైనికులరక్షణవ్యవస్థ చాలకట్టుదిట్టముగ నుండెను. విదేహ నందినిని హరించి తెచ్చిన తరువాత రావణుడు అచటి రక్షణ వ్యవస్థను కట్టుదిట్టముచేసెను. దానికి నలువైపుల ధనుర్బాణము లను ధరించిన భయంకరు లగు రాక్షసు లెందరో రేయిం బవళ్ళు జాగ్రత్తగ పహరాయిచ్చుచుండిరి.

రాక్షసరా జగు రావణునిపట్టణ మగు లంకయొక్క యీదృశ్యమును జూచుచు మహావీరు డగు హనుమానుడు సాయంకాలమునకై ఎదురుచూచుచుండెను. ఇంతలో సాయం కాలమయ్యెను. పవననందనుడు అణిమ యను సిద్ధిననుసరించి మిగుల సూక్ష్మరూపమును ధరించి మనస్సులో శ్రీరఘు నాథుని చరణములకు ప్రణామములజేసి పవిత్ర మగు ఆయన మూర్తిని హృదయమున నిల్పుకొని లంకలోనికి ప్రవేశించెను.

హనుమంతుడు మిక్కిలి సూక్ష్మరూపమును ధరించినను లంకకు అధిష్ఠాత్రి యగు లంకిణి యనునామె ఆయనను జూచెను. అది ఆయనను గద్దించుచు 'ఓరీ! నీ వెవ్వడవు? దొంగవలె ఈనగరములోనికి ప్రవేశించుచున్నావు. చావుటకు పూర్వము నీవు నీరహస్యమును వెల్లడించు'మనిపలికెను.

కపిశ్రేష్ఠు డగు హనుమంతు డిట్లు తలంచెను — 'మొదటనే యీవ్యక్తితో వివాదపడుట మంచిదికాదు. రాక్షసులు ప్రోగైనచో నిచ్చటే యుద్ధము ప్రారంభమగును. సీతా మాతను కనుగొనుటలో అంతరాయమేర్పడును! వెంటనే ఆయన ఆవ్యక్తిని స్త్రీగా భావించి తనకుడిచేయిపిడికిలితో మెల్లగ గొట్టెను. వజ్రమయదేహు డగు హనుమానునిపిడికిలి పోటుచే లంకిణినేత్రములు బైరులు గ్రమ్మెను. అది రక్తము గ్రక్కుకొనుచు భూమిపై బడి మూర్ఛిల్లెను. కాని కొలదిసమ యములోనే ఆమె మూర్ఛనుండి లేచి కూర్చుండెను.

అపుడు లంకిణి వానరశ్రేష్ఠు డగు నాహనుమంతునితో నిట్లు పలికెను – 'శ్రీరామదూత వగు హనుమా! నీవు లంకాపట్టణముపై విజయముసాధించితివి. పొమ్ము, నీకు శుభ మగుగాక! సీతాదేవికారణముగా దురాత్ము డగు రావణుని వినాశమునకు కాలము సమీపించినది. పూర్వము చతుర్ముఖు డగు బ్రహ్మ నాతో నిట్లు పలికెను. 'త్రేతాయుగమున సాక్షాత్తుగ క్షీరోదధిశాయియు, వినాశరహితుడు నగు నారాయణుడు దశరథకుమారు డగు శ్రీరామునిరూపమున అవతరించును. ఆయనభార్యయు, మహామాయారూపిణియు నగు సీతాదేవిని రావణుడు హరించును. ఆమె నన్వేషించుచు రాత్రివేళ నొక్క వానరుడు లంకలోనికి ప్రవేశించును. వానిపిడికిలిపోటుచే నీవు కలతచెందెదవు. ఇక రాక్షసవంశమునకు చేటుమూడిన దని నీ వపుడు తెలిసికొనుము! నాయదృష్టవలన సుదీర్ఘ కాలము తరువాత నేటికి నా కా భవాబ్ధిపోత యగు శ్రీరామునిప్రియ భక్తునిదుర్లభ సాంగత్యము లభించినది. నేడు నేను ధన్యురాల నైతిని. నాహృదయమున విరాజిల్లు దశరథనందనుడగు శ్రీరాముడు నాపై నెల్లపుడు కృప జూపుగావుత."

తద్భక్తసంగోఽప్యతిదుర్లభో మమ
ప్రసీదతాం దాశరథిః సదా హృది॥
(అ.రా. 5-1-57)

బుద్ధిమంతు డగు వాయునందనుడు మిక్కిలిసూక్ష్మ రూపమును ధరించి, కరుణామయు డగు భగవానుని మనస్సులో

స్మరించుకొని అసురరక్షితము, దుర్భేద్యము నగు లంకలోనికి ప్రవేశించెను.

హనుమంతునిసముద్రోల్లంఘన లంకాప్రవేశములతో పాటు జగజ్జనని యగు జానకికి కుడిభుజము, లంకాధిపతి యగు రావణునకు ఎడమకన్ను, సురవందితు డగు శ్రీరామునకు ఎడమపార్శ్వము అదరినవి.

## హనుమంతుడు విభీషణుని గలిసికొనుట

కపికుంజరు డగు శ్రీపవనపుత్రుడు మూడులోకములచే నమస్కరింపదగినది యగు సీతాదేవిని దర్శించుటకై మిగుల వ్యాకులపడుచుండెను. అందువలన ఆయన భయంకరు లగు రాక్షసులకు కనబడకుండగ విచిత్రము లగు పుష్పమయాభరణ ముచే నలంకృత మైయున్న లంకలోనిముఖ్యస్థలములను చాల జాగ్రత్తగ జూడసాగెను. నగరమధ్యభాగమున రావణునిగూఢ చారు లెందఱో ఆయనకు గనబడిరి. అంతేకాదు ఆయన రావణునియంతఃపురమును జాగ్రత్తగ కాపలాకాయుచున్న శస్త్రసంపన్ను లగు ఒకలక్షమంది సైనికులనుగూడ జూచెను. అంజనానందనుడు దశాననునియశ్వశాలను, గజశాలను, అస్త్రాగారమును, మంత్రణాలయమును, సైన్యస్థావరమును శ్రద్ధగా జూచెను. ఆయన సీతాదేవిని అన్వేషించుచు రాక్షసులహర్మ్యములలో ప్రవేశించి వారియాహారవిహారములను, పడకలను, మనోరంజనాదుల స్థలములు మున్నగువానినిగూడ జూచెను.

అచట వీరవరు డగు ఆంజనేయుడు ఐశ్వర్యమదమత్తు లగు నిశాచరులను, మద్యపానమత్తు లగు రాక్షసులను ఎందఱినో చూచెను. శ్రీరామునిదూత యగు హనుమంతుడు జగత్త్రయ విజేత యగు రావణునిలంకలో నుత్కృష్ట మగు బుద్ధిగలవారు, సుందరముగ పలుకువారు, గొప్పశ్రద్ధగలవారు, అనేకవిధము లగు రూపములు వర్ణములు గలవారు, సుందరము లగు నామములు గలవారు నగు అసురుల నెందఱినో చూచెను. కాని వారిలో జనకనందిని మెచ్చటను గానరాలేదు. వారిసంభాషణములవలనగూడ ఆమెయునికి తెలియలేదు.

అందువలన కామరూపధారి యగు పవనకుమారుడు సీతాదేవి నన్వేషించుచు స్వర్ణమయములగు కోటగోడలచే చుట్టబడియున్న రావణునిమహాలులోనికి ప్రవేశించెను. రాజోచితములగు సామగ్రులతో నిండిన శ్రేష్ఠము సుందరము నగు ఆభవనమును జూచి సమీరకుమారుడు ఆశ్చర్యచకితుడయ్యెను. ఆభవనద్వారము మిలమిలలాడుబంగారముచే చేయబడినది. వెండిచే చేయబడిన చిత్రములతో దానిశోభ అద్భుతముగ నుండెను. దానిరక్షణకై శస్త్రములను ధరించిన లక్షలకొలది వీరులు సావధానముగ నిలబడియుండిరి. సైనికులందఱు అభేద్యము లగు కవచములను ధరించి యుండిరి. ఏనుగులతోను, గుఱ్ఱములతోను, రథములతోను నిండియున్న ఆభవనము యొక్క సాటిలేని రూపమును జూచి పవనకుమారుడు మిగుల

చకితుడయ్యెను, కాని ఆయననేత్రములు జనకనందినిని అన్వే
షించుటలోనే నిమగ్నములై యున్నవి,

సర్వవిద్యావిశారదు డగు హనుమంతుడు ఆభవనమునకు
చుట్టుప్రక్కలనున్న భవనములలో ప్రవేశించి సీతాదేవిజాడను
దీయుట మొదలిడెను. ఆయన లంఘించి కుంభకర్ణునిభవనమును
ప్రవేశించెను. అచటనుండి మహోదర విరూపాక్ష విద్యుజ్జిహ్వా
విద్యున్మాలురగృహములలోనికి వెడలెను. ఆయసురుల అమిత
సంపదలను, మహావైభవమును జూచుచు నిర్భయు డగు హను
మంతుడు లంఘించి వజ్రదంష్ట్రశుకసారణులగృహములలోనికి
వెడలెను. ఆయన సీత నన్వేషించుచు ఇంద్రజిత్తు, జంబుమాలి,
సుమాలీలయిండ్లకు గూడ వెడలెను. అచట సీతాదేవి కనబడ
లేదు. అమితవిక్రమశాలి యగు హనుమానుడు రశ్మికేతు
సూర్యశత్రు వజ్రకాయులభవనములోనికి వెడలెను. సీతాదేవి
జాడను దెలిసికొనుటకై పవననందనుడు మిగుల శ్రమపడు
చుండెను. ఆయన ధూమ్రాక్షుడు, సంపాతి, విద్యుద్రూపుడు,
భీముడు, ఘనుడు, విఘనుడు, చక్రుడు, శఠుడు, కపటుడు, హ్రస్వ
కర్ణుడు, దంష్ట్రుడు, లోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు,
ధ్వజగ్రీవుడు, ద్విజిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, పిశా
చుడు, శోణితాక్షుడు మున్నగు సుప్రసిద్ధులైన అసురులగృహ
ములలోనికి వెడలి చాలజాగ్రత్తగ పరిశీలించెను. కాని అచట
ఎక్కడగూడ జానకిదర్శనము కాలేదు, మరల ఆయన రావణుని
భవనముకడకు వేగముగ వెడలెను.

కపిశ్రేష్ఠు డగు హనుమంతుడు లంఘించి రావణుని భవనములోనికి ప్రవేశించెను. అచ్చట ఆయన శూలములు, ముద్గరములు, శక్తి, గదలు, పట్టిసములు. కోదండములు, ముసలములు, పరిఘలు, భిందిపాలములు, బల్లెములు, పాశములు, తోమరములు మున్నగు శస్త్రాస్త్రములను ధరించి యున్న అసంఖ్యాకులగు రాక్షసులను, రాక్షసస్త్రీలను జూచెను. వారందఱు విశాలకాయులు, వీరులు, అపారశక్తిసంపన్నులు. వారిదృష్టిలో బడకుండగ పింగళకేశు డగు హనుమానుడు సూక్ష్మరూపముతో రావణునిభవనములోని ప్రతికక్ష్యను జాగ్రత్తగ జూచుచు వెడలుచుండెను. అచట ఆయన బంగారమువంటికాంతిగలది, అనేకము లగు రత్నములచే నిండినది, వివిధము లగు వృక్షములపుష్పములచే నాచ్ఛాదితమైనది, అనుపమమైనది యగు పుష్పకవిమానమును జూచెను. అది తనదివ్య మగు కాంతిచే ప్రజ్వలితమగుచున్నట్లుండెను. అద్భుతము, పరమమనోహరము నగు విమానమును జూచి హనుమానుడు మిగుల విస్మితుడయ్యెను. కాని నలువైపుల తిరిగి చూచినను పూజనీయురా లగు సీతాదేవి కనబడకపోవుటచే అతడు చింతితుడయ్యెను.

చింతితు డగు హనుమానుడు సీతాన్వేషణమునకై శస్త్రాస్త్రసంపన్ను లగు రాక్షసవీరులనుండి తప్పించుకొనుచు, రాక్షసరా జగు రావణుడు నివసించు ప్రదేశమునకు జేరెను.

అచట రాక్షసజాతీయపత్నులు, హరించి తెచ్చిన వేలకొలది రాజకన్యలు నుండిరి. అచట వరుసగా సువర్ణమయము లగు దీపములు ప్రజ్వరిల్లుచుండెను. అచటినేల స్ఫటికమణినిర్మితము, సోపానములు మణిమయములు, వాతాయనములు సువర్ణనిర్మితములు. రావణునియానివాసము స్వర్గముకంటెనుమిన్నగ నున్నట్లు తోచుచుండెను.

సగమురాత్రి గడచెను. ఆభవనమున పవనకుమారుడు రంగురంగులవస్త్రములను పుష్పమాలలను ధరించి అనేకములగు వేషభూషలచే విభూషితలైయున్న వేలకొలది సుందరీమణులను జూచెను. మద్యపానముచేత, ఎక్కువగ మేలుకొనియుండుటచేత వారా యాప్రదేశములలో నారాత్రి గాఢనిద్రాపరవశలై యుండిరి. వారివస్త్రములు అస్తవ్యస్తములై యుండెను. హనుమానుడు సీతాదేవిని ఇంతకుమును పెన్నడును జూచి యుండలేదు, కాని పతివ్రత యగు జానకియొక్కపరమ సాత్త్వికము, తేజస్వంతము నగు రూపము గుర్తింపదగినట్లుండును. అందువలన హనుమానుడు ఆసుందరీమణులను శ్రద్ధగ జూచుచుండెను.

ఇటునటు జూచుచు హనుమానుడు స్ఫటికమణినిర్మితమగు దివ్యమైన ఒకవేదికను జూచెను. దానిపై రత్ననిర్మితమగు రావణునిపర్యంకముండెను. దానికి నలువైపుల చాలమంది స్త్రీలు నిలువబడి చామరములను ధరించి విసరుచుండిరి. ఉజ్వలమగు నాపర్యంకముపై లంకాధిపతి యగు రావణుడు సుఖముగ

నిద్రించుచుండెను; అచట బ్రహ్మచారి యగు హనుమానుడు రావణునిపత్నులనుగూడ జూచెను, వా రాతనిచరణముల కటు నిటు నిద్రించుచుండిరి. సమీపమునందే వానికి సంతోషమును గలుగజేయు వీణావాదిను లగు సుందరీమణులు గాఢనిద్రలో పడియుండిరి. ఇంకను కొందఱివక్షఃస్థలముపై వీణలు పడియే యుండెను. కోమలము లగు వారిప్రేళ్ళు వీణాతంత్రులను స్పృశించుచునే యుండెను.

వారందఱికంటె వేఱుగ మిగులసుందర మగు శయ్యపై పరుండియున్న అనుపమరూపలావణ్యసంపన్న యగు నొకయువతిని హనుమానుడు చూచెను. కోమలములు, సుందరములు నగు నామెయవయవములపై ముత్యములతోను మణులతోను గూడిన వివిధము లగు నాభూషణములు విరాజిల్లుచుండెను. ఆమెశరీరకాంతి సువర్ణమువలె మెఱయుచుండెను. అనుపమరూపవతి యగు నామె రావణునిభార్య యగు మండోదరి. ఆమెను జూచినంతనె హనుమానునకు 'ఈమె సీతాదేవియా' యను అనుమానము కలిగెను. ఆతనిసంతోషమునకు మేరలేక పోయెను. హర్షోన్మత్తుడై ఆయన తనతోకను నేలపై కొట్టుచు ముద్దిడుకొనసాగెను, వానరులప్రకృతిననుసరించి ఆయన ఇటు నటు పరుగిడసాగెను. ఆయన ఒకమారు స్తంభముల నెక్కును, వెంటనే మఱల క్రిందకు దుముకును.

సద్గుణములకు నిలయు డగు పవనకుమారునకు వెంటనే

మఱియొకయూహ తట్టెను - "పరమపతివ్రత యగు సీతాదేవి ప్రభు వగు శ్రీరామునివియోగమున నెప్పుడును అలంకరించు కొని వస్త్రాభరణములను ధరించదు. ఆమె భోజనము చేయదు, సుఖముగ శయనించదు, మద్యపానము స్వప్నమునందైనను చేయదు. శ్రీరామునితో నాటివచ్చు సౌందర్యవంతులు దేవ దానవనాగకిన్నరులలోగాని ఈభూమిపై గలమానవులలోగాని యెవ్వరును లేరు. ఇక సీతవంటి పతివ్రతాస్త్రీ పరపురుషునికడకు నెట్లు వెడలును! అందువలన ఈమె సీతాదేవి యేమాత్రమును గాదు".

మతిమంతు డగు హనుమానుడు రావణునియావిశాల భవనమునంతటిని దిరిగి నిదురించు వేలకొలదిసుందరీమణులను శ్రద్ధగ జూచెను. వెంటనే వానిమనస్సున నొకయాలోచన పొడ గట్టెను - 'నేను బాలబ్రహ్మచారిని, శ్రీరామునిదూతను. లోకమాతను వెదకుటకు వచ్చితిని. కాని యిచట నేను గాఢ నిద్రాముద్రిత లై యున్న పరస్త్రీలను జూచితిని, నా కిది తగదు. నాదృష్టి ఇంతవఱ కెప్పుడును నాతల్లిని విడచి మఱి యేస్త్రీమీదను పడలేదు, కాని నేడు నేను ధర్మమునుండి చ్యుతుడ నైతిని.

ధర్మమూర్తియు, వీరకర్ముడు నగు హనుమానుడు ధర్మ భయముచే శంకితుడయ్యెను, కాని ఆయనశరీరములోను, మనస్సులోను, ప్రాణములోను సర్వాంతర్యామి యగు

శ్రీరాముడే విరాజిల్లుచున్నాడు. అందువలన మరుసటిక్షణము లోనే వానిమనస్సునకు సమాధానము తట్టినది. ఆయన ఇట్లా లోచింపసాగెను — 'రావణునిస్త్రీలు సందేహము లేనివారై నిద్రించుచున్నారు, ఆయవస్థలో వారిని నేను జాగ్రత్తగ జూచితిని. కాని నామనస్సులో నెట్టివికారమును కలుగలేదు. శుభాశుభములకు ప్రేరకము మనస్సు, నా యీ మనస్సు సంపూర్ణముగ శాంతముగను స్థిరముగను నున్నది. దానికి రాగముగాని ద్వేషముగాని లేదు. అందువలన నా యీ స్త్రీ దర్శనమువలన ధర్మమున కెట్టిలోపమును కలిగియుండక పోవచ్చును. నేను కావలయునని వారిని చూడలేదు. జానకిని అన్వేషించుటకు, గుర్తించుటకు వారిపై దృష్టి నుంచితిని, స్త్రీ యగుటవలన సీతాదేవిని స్త్రీలలోనే వెదుకవలసివచ్చినది. ఆమెను నేను పరిశుద్ధ మగు మనస్సుతోనే అన్వేషించితిని, కనుక నేను పూర్తిగా దోషరహితుడనే."

కామవిజేత యగు హనుమంతుడు జానకీదేవిని అన్యస్థల ములలోగూడ వెదకెను. ఆయన లంకలో మిగిలిన గృహము లను, వనములను, ఉపవనములను, వాటికలను, వాపీకూపము లను, మందిరములను, పశుశాలలను, సభాభవనములను, సైనిక స్థావరములను, రహస్యస్థావరములను జూచెను. ఇట్లాయన సావ ధానముగ రాత్రియంతయు సీతను అన్వేషించుచునే యుండెను. కాని యామెజాడ ఎక్కడ తెలియరాలేదు. అతడు విచార

గ్రస్తుడగుచుండెను. రాత్రి గడచుచుండెను. బ్రాహ్మముహూర్తము సమీపించుచుండెను.

వెంటనే హనుమానునిదృష్టి పవిత్ర మగు నొకభవనముపై బడెను. అచట భగవానుని ఆలయమొకటి శోభిల్లుచుండెను. ఆభవనకుడ్యములపై నంతట అనేకము లగు అవతారములయొక్క, లీలలయొక్క చిత్రములు, రామనామము అంకితమై యుండెను. దానిద్వారముపై రామునిఆయుధములైన ధనుర్బాణములచిహ్నము లంకితము లై యుండెను. అచట మణుల వెలుగులలో కుంకుమపువ్వుతో పాటు, ఇతరపుష్పములతో పాటు మడులలో తులసిమొక్కలు స్పష్టముగ గనుపించుచుండెను. దీనిని జూచినంతనె హనుమంతుడు మిగుల ఆశ్చర్యమునందెను, ధర్మమునకు, వేదపురాణములకు, యజ్ఞయాగములకు, గోవులకు, ద్విజులకు, దేవతలకు, భగవానునకు సహజశత్రువు లగు రాక్షసులపట్టణములలో నీయాలయ ముండుటేమి?

అప్పుడే రావణునిసోదరు డగు విభీషణుడు నిద్రనుండి లేచి శ్రీరామునినామమును స్మరింపసాగెను. వానినోటినుండి శ్రీరామనామము వినబడినంతనె నిజముగ నితడు భగవద్భక్తుడే యనునమ్మకము హనుమానునకు గలిగెను. శరణాగతవత్సలు డగు హనుమానుడు వెంటనే బ్రాహ్మణవేషమును ధరించి భగవన్నామము నుచ్చరింపసాగెను.

రామనామమును వినినంతనె విభీషణుడు బయటకువచ్చి బ్రాహ్మణ వేషధారియు, జగత్పావనుడు నగు పవనపుత్రుని చరణములను ఆదరపూర్వకముగ నమస్కరించి యిట్లు పలికెను.—'బ్రాహ్మణదేవా! మీ రెవరు? మీరు భగవద్భక్తులే యని నామనస్సు చెప్పుచున్నది: మిమ్ము జూచినంతనె నామనస్సులో ప్రేమ ఉత్పన్నమగుచున్నది. లేదా మీరు మీభక్తులకు సుఖమును గలిగించుటకై నన్ను ధన్యునిగా జేయుటకై వచ్చిన నా స్వామియగు శ్రీరాముడవు కావు గదా! దయయుంచి నాకు మీ విషయమును జెప్పుడు.

సంసారభయనాశకు డగు అంజనీనందనుడు ప్రేమపూర్ణమగు మధురవాక్కుల నిట్లుపలికెను. 'నేను మహాపరాక్రమవంతు డగు వాయుదేవుని పుత్రుడను, నా పేరు హనుమానుడు. నేను శ్రీరాముని భార్యయు, జగజ్జననియు నగు జానకీదేవిజాడను దెలిసికొనుటకై ఆయనయాదేశమునను సరించి యిచటకు వచ్చితిని. నిన్ను జూడగనే నామనస్సు సంతోషముతో నుప్పొంగినది. దయయుంచి నీవిషయమును వివరింపుము".

శ్రీరామునిస్మరణముచేత, ఆయనదూత యగు హనుమానుని యెట్టయెదుటచూచుటచేత విభీషణునిస్థితి విచిత్రముగ నుండెను. ఆయననేత్రములు ప్రేమాశ్రువులతో నిండిపోయెను, శరీరము పులకించెను. కంఠము రుద్ధమయ్యెను-ఎట్లో తన్నుతాను

సంబాళించుకొని అత డిట్లుపలికెను-'ఆంజనేయా! నేను రాక్షస రాజగు రావణునిసోదరుడను, నన్ను విభీషణు డందురు. నేడు నీదర్శనముచేత నాజన్మ ధన్యమైనది. నే నీ రాక్షసనగరమున దంతములనడుమ నున్న నాలుకవలె జీవితమును గడుపు చున్నాను. పవనపుత్రా! నేను రాక్షసకులమున జన్మించిన తామసప్రకృతిగల జీవిని. నావలన ఎట్టిభజనము జరుగుటలేదు. శరణాశరణుడు, భవాబ్ధిపోతయు నగు ఆ భగవానుని చరణ ములపై నాకు ప్రేమగూడ లేదు. దయాళు వగు శ్రీరాము డెప్పుడైన దీనుడు, హీనుడు, అసహాయుడు, అనాథుడు నగు ఈవిభీషణునిపై దయజూపగలడా! సురమునిసేవిత చరణకమల ములయొక్క పవిత్ర మగు రజఃకణము నాకుగూడ నెప్పుడైన లభించునా? భగవత్కృపలేనిదే సత్పురుషుల దర్శనము లభింప దని నాకు దృఢ మగు విశ్వాసమున్నది. ఈనాడు కరుణామయు డగు శ్రీరాముడు నాపై కృపజూపినాడు. కను కనే నీవు దయతో అధముడ నగు నాయింటికి దయచేసితివి.

భక్తులపై దయజూపు హనుమానుడు భక్తు డగు విభీ షణుని భగవత్ప్రీతిని జూచి పులకితగాత్రుడయ్యెను. ఆయన విభీషణునితో నిట్లు పలుకసాగెను - 'విభీషణా! నీవు గొప్ప అదృష్టవంతుడవు. యోగీంద్రులకు, మునీంద్రులకుగూడ లభిం పని కరుణావతారు డగు శ్రీరామునిభక్తి నీకు సహజముగనే లభించినది. శ్రీరాముని దృష్టిలో జాతి కుల లింగభేదము

లేదు. ఆయన కేవలము నిర్మలహృదయమును, శుద్ధప్రేమను గోరును. ఈ ప్రేమచే ఆయనభక్తుల కమ్ముడు బోవును. వారి వెంటబడును. నావిషయమునుగూర్చి ఆలోచింపుము. నేను విశ్రేష్ఠవంశమునజన్మించితిని ? అన్నివిధముల నేను చంచలుడను, నీచుడను నగు వానరుడను. ఎవడైన ప్రొద్దుననే మానామమును వినినచో అత డాదినమంతయు నుపవాసముండవలెను. అట్టి నీచకులమున జన్మించిన నాపైగూడ భక్తవత్సలు డగు ఆభగవానుడు దయజూపినాడు. ఆయన నన్ను స్వజనునిగ, సేవకునిగ అనుగ్రహించెను. నీవు స్వామినె సర్వస్వముగ భావించుచున్నావు. నిశ్చయముగ నీపై ఆయన తన యద్భుతమైన కృపను ప్రసరింపజేయును. నీవు గొప్ప భాగ్యవంతుడవు. ఈ అసురపురములో నీవంటి భాగవతోత్తమునితో నాకు పరిచయము లభించుట నాయదృష్టము. శ్రీరఘునాథచంద్రుని కృపావిశేషమే నీదర్శనభాగ్యము'.

శ్రీరాఘవేంద్రుని దివ్యగుణగానములో ఆయిర్వురు భక్తులు మైమరచిపోయిరి. వారికి సమయముగాని, శరీరజ్ఞానముగాని తెలియరాలేదు. ఇరువురిశరీరములు పులకించెను. నేత్రములు ప్రేమాశ్రుపూర్ణములయ్యెను. వారిద్దరుఒకరికొకరుసన్నిహితులై సౌఖ్యవంతులు, సంతుష్టులు, ఆనంద విహ్వలురు నైరి.

తదనంతరము శ్రీపవనపుత్రుడు సావధానుడై యిట్లు పల్కెను. 'సోదరా ! విభీషణా ! నేను ప్రభువుయొక్క ఆదేశాను

సారముగ నాతల్లిని వెదకుటకు వచ్చితిని. సమయము పరిమితము. సూర్యోదయానంతరము వెలుగులో జననిచెంతకు పోవలెనన్న అత్యంత కష్టమగును. అక్కడ సముద్రమున కావలితటముపై కోటానుకోట్ల వానరభల్లూకసేనలు అత్యంతోత్సాహముతో నాకొఱకై నిరీక్షించుచున్నారు. నేను స్వయముగ తల్లిదర్శనార్థమై ఉత్కంఠతతోనున్నాను. నీవు కృపతో నాతల్లిదర్శన మెచ్చట కల్గునో వివరింపగోరుచున్నాను.

విభీషనుడు పల్కెను :

శ్రీరామభక్తాగ్రేసరా! ఇచటి కనతిదూరములో రాజప్రాసాదమునకు సమీపమున రావణున కత్యంతప్రియమైన అశోకవనము కలదు. ఆవనము అనేకములైన సుగంధపుష్పవృక్షములతోను, సుస్వాదుఫలములతో నిండిన వేలకొలది తరువులతోనునిండియున్నది. ఆవనము భ్రమరముల ఝుంకారములతో, పక్షుల కిలకిలారవములతో ప్రతిధ్వనించుచుండును.

ఆసుందరవాటికయొక్క మధ్యభాగమున నిర్మల జలపూర్ణమైన సుందరసరోవరము కలదు. ఆసరోవర తటముపై అసురకులపూజ్యుడైన శంకరభగవానుని విశాలరమణీయ మందిరము కలదు. ఆప్రాంతమును వేలకొలది రాక్షసస్త్రీలు శస్త్రములను ధరించి రక్షించుచుండెదరు. శివాలయమున కనతి

దూరములో విశాలశాఖాసమన్వితము, అత్యున్నతము నైన అశోకవృక్షము కలదు. జననియగు సీత ఆవృక్షఛాయలో కూర్చుండి ప్రభువుయొక్క వియోగముచే తపించుచు దుఃఖించు చున్నది. ఆమెసుదీర్ఘ కేశములు జటలుగ మారిపోయెను. ఆహారమును విసర్జించినకారణమున ఆమెశరీరముశుష్కించిపోయెను. ఆమెశరీరముపై మాసిన వలువదప్ప మరేమియునులేదు.

అత్యంతక్రూరలైన రాక్షసస్త్రీలు అహర్నిశము లా ఆసాధ్విని భయపెట్టుచు బెదిరించుచున్నారు. ఆతల్లిని చేరు కొను టత్యంతకష్టము. నాభార్య నాజ్యేష్ఠపుత్రిక అప్పుడప్పుడు తల్లిని దర్శించి ఓదార్చి వచ్చెదరు. తల్లియొక్క ఆ కరుణా దశను తలచుకొనినంతనే నేను కంపించెదను. ఆమెకు ఒకవేయి మంది క్రూరరాక్షసస్త్రీలు శస్త్రములను ధరించి కాపున్నారు. వాయునందనా! అత్యంత సావధానుడవై తల్లి చెంతకుజనుము.

జగజ్జనని యగు జానకీదేవియొక్క యిట్టికరుణాభరితము గు దశ నాలకింపగనే కరుణాంతరంగు డగు అంజనీనందనునకు దుఃఖము పెల్లుబికెను. హనుమ విభీషణుని అలింగనమొనర్చు కొని యిట్లుపల్కెను. "విభీషణా! నీవు చింతింపవలసినపనిలేదు. సర్వసమర్థుడైన ప్రభువుయొక్క దయవలన నేను జానకిని దర్శించెదను".

హనుమ మరల సూక్ష్మరూపధారియై అశోకవాటిక దిక్కుగ తీవ్రగతితో పయనించెను.

# హనుమంతుడు సీతాదేవికడకు చేరుట

బ్రాహ్మీముహూర్తమున అసురులు ఎక్కడివారక్కడ గాఢనిద్రామగ్నులై యుండిరి. శ్రీరామపరాయణుడు డగు పవనపుత్రుడు అశోకవనమును జేరుట కెట్టి విఘ్నములు సంభవింపలేదు. ఆ సుందరవాటిక, నిర్మలసరోవరము, అద్భుతమైన దేవాలయము మొదలగువానియొక్క శోభనెట్లు ఆంజనేయుడు తిలకింపగలడు? ఆయన సీతాదేవి దర్శనముకొఱకై అధీరుడగుచుండెను, నేరుగ అశోకవృక్షమును జేరి దట్టమైన కొమ్మలపై దాగి కూర్చుండి క్రిందకు జూచెను.

మూర్తీభవించిన కరుణాస్వరూపిణియు, పతివ్రతయు, తేజోమూర్తియు నగు సీతాదేవి తనచరణములవైపు దృష్టిని సారించుచు మౌనముగ కూర్చొని యుండెను. అప్పుడప్పుడు ఆమె నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించుచుండెను. శ్రీ జానకిని దర్శించి శ్రీరామభక్తుడగు అంజనీనందనుడు అత్యంత ప్రసన్నుడయ్యెను. ఆయనయానందమునకు హద్దులు లేవు. తన యదృష్టమును పొగడుకొనుచు తనలో తా నిట్లనుకొనెను.

శ్లో॥ కృతార్థోఽహం కృతార్థోహం దృష్ట్వా జనకనందనీమ్ ।
మయైవ సాధితం కార్యం రామస్య పరమాత్మనః ॥

(అధ్యాత్మిక రామాయణం 5-2-11-12)

నేడు జనకమహారాజుపుత్రిక యైన జానకిని గాంచి కృతార్థుడనైతిని. ఆహా! పరమాత్ము డైన శ్రీరాముని కార్యము సిద్ధించుటకు నేను కారణుడనైతినిగదా!

మరుక్షణమే తల్లియొక్క దయనీయమైన దశను గాంచి హనుమంతు డత్యంతదుఃఖితుడయ్యెను. ఆయన తా నిపుడేమి చేయవలెనోయని యాలోచింపనారంభించెను. అంతలో కోలాహలమును విని పవననందనుడు అశోకవృక్షముయొక్క కొమ్మలలో సావధానుడై దాగెను. జానకీదేవి భయముతో ముడుచుకొని కూర్చుండెను.

కాటుకకొండవంటి వర్ణముగల దశముఖుడగు రావణుడు అనేక రాక్షససుందరీమణులతో పరివృతుడై వచ్చుటను పవనపుత్రుడు గాంచెను. వారిలో రావణపట్టమహిషి మండోదరి కూడ కలదు.

సీతాదేవిని సమీపించి రావణు డిట్లుపలుకనారంభించెను. "జనకరాజకుమారీ! నేనన్న నీ వేల భయపడెదవు? నేను నిన్ను నా ప్రాణములకంటె అధికముగ వాంఛించుచున్నాను; వ్యర్థముగ నీ వేల యీకష్టములను అనుభవించుచున్నావు? నీ యీ అపారదుఃఖమును చూడలేకున్నాను. ఆ వనవాసియైన రాముని లోనేమి కలదు? ఆతనిలో నెట్టిశక్తి యున్నను ఇచటికేతెంచి నిన్ను బంధవిముక్తురాలుగ చేయగల్గెడివాడు; కాని నేను ముల్లోకములను జయించినవాడను. దేవతలైనను, అసురులైనను, నాగ కిన్నెర గంధర్వ కింపురుషాదులైనను నాపేరు విన్నంతనే కంపించెదరు. ఇక మానవు లెంత? త్రికూటస్థితమైన యీలంకానగరములో గల దుర్భేద్య దుర్గమందు ఒకపక్షియైనను నాయనుజ్ఞలేక ప్రవేశించుట

యసంభవము. ఇక శతయోజనవిస్తీర్ణముగల సాగరమును దాటి ఆవనవాసి యగు రాముడీప్రదేశమున కెట్లురాగలడు? అతడసమర్థుడు; మమకారము లేనివాడు; నిరభిమానుడు; మూర్ఖుడు. అట్టివానికొఱకై యెందులకు ఎదురుచూచెదవు? నీవు నాదానివి కమ్ము, గంధర్వులు, నాగులు, యక్షులు, కిన్నరులు మొదలగువారందఱు వారివారిస్త్రీలతో గూడనన్ను సేవించెదరు. నేను అత్యంతసమర్థుడను. నేను సంకల్పించినచో నిన్ను బలాత్కారముగా నాదానినిగచేసికొనగలను; కాని నేను నిన్నుహృదయపూర్వకముగ ప్రేమించుచున్నాను. ఈకారణము వలననే నీ కెట్టిక్లేశమును కలిగించు టుచితముకా దని ఆలో చించుచున్నాను. నీవు స్వయముగా నాకోరికను మన్నింపుము. ఇందులోనే నీకు శుభము కల్గును".

యెంతతడవు బుజ్జగించినను, బెదరించినను సీతాదేవిపై ప్రలోభముయొక్క ప్రభావము ఏమాత్రము పడకుండుట గాంచి దశకంఠుడు మరల యిట్లు పలుకసాగెను. "సుందరీ! నాలో రోషానలజ్వాల ప్రజ్వరిల్లకమునుపే నీనిర్ణయమును నాకనుకూల ముగ నొనరింపుము, లేనిచో ఈతీక్ష్ణకరవాలముచే నీశిరమును ఖండించెదను. నీశరీరమాంసమును ఈరాక్షసులు భక్షింప గలరు. క్రూరతము డైన దశముఖుని విషమయములు, బాణ సదృశములు నగు పరుషవాక్యములకు జానకీదేవి కొంచమైనను చలింపలేదు, భయపడలేదు. ఆమె తనముందు ఒకగడ్డిపోచను బడవైచి తల దించుకొని యిట్లుబల్కెను. "అధముడ వైన

రాక్షసుడా ! నీ వేమి చేయదలచుకొంటివో దానిని వెంటనే చేయుము. నీవంటి పాపాత్మునికి లొంగుటకంటె మరణించుట మేలు. నిన్ను నీవు త్రైలోక్యవిజయుడ వని తలంచుచున్నావు. ఓరీ ! నీచశునకమా ! నా ప్రాణనాథుడు లేనిసమయమున నన్నప హరించి తెచ్చి నీగృహములో అసహాయురాలనైన నాపై బింకములు పల్కుచున్నావు. శ్రీరాఘవేంద్రుడు లంకలో అడుగిడునంతవఱకే నీ విట్టి వాచాలత్వమును జూపగలవు. త్వర లోనే నీబంగరులంక అగ్నిలో కాలి బూడిద కాగలదు. నీవు నీసకలపరివారముతో శ్రీరామచంద్రుని తీక్ష్ణశరములకు బలి అయ్యెదవు. శ్రీకోసలేంద్రుని శరవర్షముచే విదీర్ణుడవై నేల కొఱిగినప్పుడుగాని ఆయనప్రతాపము నీకు తెలియరాదు. నా ప్రభువు దూరముగ నున్నంతవరకే నీ విట్టి పిచ్చిమాటలను నీ యిష్టానుసారముగ బల్కెదవు".

శ్రీరామవియోగ మనుభవించుచున్న సీతాదేవి పలి కిన యీకఠోరవచనముల నాలకింపగనే రావణునినేత్రములు రక్తవర్ణములయ్యెను. క్రోధోన్మత్తుడై ఆయసురుడు వరనుండి ఖడ్గమును దీసి జనకనందినిని సంహరించుటకు సిద్ధము కాగా, పట్టమహిషి యగు మండోదరి వానికరమును బట్టుకొని ఆపుచు ప్రేమపూర్వకముగ నిట్లుపల్కెను. "హృదయేశ్వరా! దుఃఖితు రాలైన యీదీనురాలిని వదలివేయుము. ఈమెలో నేమికలదు? నిన్నువరించుటకు దేవగంధర్వనాగాదులలో అధికలావణ్యవతు లైన స్త్రీలు ప్రతిక్షణము నిరీక్షించుచున్నారు".

ఇట్లు రావణుని పాదములపైబడి మండోదరి ప్రార్థింపగా రావణుడు క్రోధముతో నిట్లు బల్కెను. "జానకీ ! నేటికి నిన్ను విడచుచున్నాను. కాని ఒక నెలదినములలో నీవు నన్నంగీకరింపకున్న నాచేతిలో నీమరణము నిశ్చితమగును; కావున శీఘ్రముగ ఆలోచించుకొని నీనిర్ణయమును దెల్పుము".

తదనంతరము దశాననుడు అమితభయంకరముఖములుగల రాక్షసస్త్రీల కాదేశమిచ్చుచు ఇట్లుపల్కెను. "నిశాచర స్త్రీలారా ! ఆదరముతోగాని, ప్రలోభమునగాని, భయమునైనగాని, మఱియెట్లైనను సీత నాకనుకూల మగునట్లు ప్రయత్నింపుడు. ఒక నెలదినములలో ఈమె మనస్సు మార్చుకొనినచో మహారాజుభోగముల ననుభవింపగలదు. లేనిచో మరణించి నా కుదయమున ఫలహారము కాగలదు.

రావణుడు మరలిపోగానే వానికోరికప్రకారము భయముగొల్పు రాక్షసస్త్రీలు శ్రీజానకీదేవిని అనేకప్రకారముల భయపెట్టుచు బెదరింపనారంభించిరి. ఈదృశ్యమును గాంచి శ్రీపవనాత్మజుడు మిగుల కోపించెను. ఈరాక్షసస్త్రీల నిప్పుడే సంహరింపవలె నని సంకల్పించెను; కాని నీతినిపుణుడు మేధావి యగు హనుమ శ్రీరామునికార్యము సంపూర్ణమొనరింపవలె నని సహనము వహించెను.

దుష్టలైన ఆరాక్షసస్త్రీలు పతీవియోగముచే దుఃఖించుచున్న సీతాదేవిని బాధించుటను త్రిజట యను రాక్షసస్త్రీ

గాంచి వారిని వారించుచు నిట్లు పల్కెను. "అధమనిశాచర స్త్రీలారా! నిశ్చయముగ మీకు చెడుకాలము దాపురించినది. లేనిచో మీరు జగన్నాయకు డైన శ్రీరామునియర్ధాంగి నిట్లు బాధించెడివారలుకారు. నా నిద్రావస్థలో ఇంతకుమునుపే ఒక భయంకరస్వప్నమును గాంచితిని. ఆస్వప్నములో దశకంఠుని సహితముగ సకలరాక్షసవంశ వినాశమును, శ్రీ సీతారామ చంద్రుల సమాగమమును గాంచితిని". త్రిజట పల్కిన పల్కుల నాలకించి రాక్షసస్త్రీలు భయవిహ్వలలై ఆస్వప్న వృత్తాంతమును సాంగోపాంగముగ చెప్పవలసినదిగా ఆమె నడుగ నారంభించిరి.

అపుడు త్రిజట ఇట్లుపల్కెను. "అసురస్త్రీలారా! నేను స్వప్నములో రావణుడు బోడితలతో, నూనెలో స్నానమాచ రించి, ఎఱ్ఱనివస్త్రములను ధరించి యున్నట్లు గాంచితిని".

కరవీర (గన్నేరు) పుష్పమాలను ధరించి మదిరోన్మత్తు డైన రావణుడు పుష్పకవిమానమునుండి భూమిపై పడుచున్నట్లు గాంచితిని. బోడితల గలిగిన రావణుడు నల్లనివస్త్రములను ధరించెను. వానిని ఒక నల్లనిస్త్రీ యెచటికో యీడ్చుకొని పోవుచుండెను. శరీరముపై ఎఱ్ఱనిచందనము అలందుకొని, ఎఱ్ఱని పుష్పమాలను ధరించి, నూనెను త్రాగుచు, అట్టహాసమొన రించుచు, గార్దభముపై నెక్కి దక్షిణదిశగ రావణుడు పోవు చుండెను. ఒక్కవిభీషణుడుదప్ప రావణునితోపాటు వాని పుత్రులు, సేనాపతులు, పరివారమంతయు ముండితమస్తకులై

నూనెలో స్నానమాడుచున్నట్లు గాంచితిని. రావణుడు సూకరముపై, మేఘనాథుడు శింశుమారము (మొసలి) పై, కుంభకర్ణుడు ఒంటెపై ఆసీనులై దక్షిణాభిముఖముగ పోవుచున్నట్లు చూచితిని. ఇంతియేకాదు ఎఱ్ఱనిముఖముగల మహాతేజస్సంపన్నుడైన వానరుడు అసురులను పెక్కండ్రను సంహరించి లంకకు నిప్పుపెట్టినట్లు, ఆమంటలకు లంక భస్మమైనట్లు చూచితిని. ప్రాతఃకాలమున గల్గిన యీస్వప్నము త్వరలోనే సత్యమగును".

భక్తురాలు, బుద్ధిమంతురాలు అగు త్రిజట ఆరాక్షస స్త్రీలకు ఉపదేశించుచు ఇట్లుపల్కెను. "రాక్షసస్త్రీలారా! మహాచక్రవర్తియొక్క గారాలకోడలు సీతాదేవి సమస్తరాజ్య భోగములను, వైభవములను కాలదన్ని తనభర్తతో అరణ్యవాసమున కేతెంచెను. మహావీరుడైన శ్రీరామచంద్రునితో నామె కుశకంటకములతోను, రాళ్ళతోను గూడియున్న అరణ్యమార్గములందు చరించుచు కష్టముల ననుభవించుచున్నను అది తనకు పరమసుఖమే యని భావించెను. అట్టి మహాపతివ్రత, పరమాదరణీయురాలు, శ్రీరామచంద్రునకు పరమప్రియురాలు నగు సీతాదేవి నిట్లు భయపెట్టుటను, బెదరించుటను కౌసల్యానందనుడైన శ్రీరామచంద్రు డెట్లు సహింపగలడు? మీయందఱకు దుర్దినములు దాపురించినవి. మీకిక శరణు లభింపదు. కావున మూర్ఖస్త్రీలారా! ఆమెను దుర్వచనములచే బాధించుట మానుకొని, ఆరాధింపుడు. సీతా

దేవితో మధురముగ మాట్లాడుచు సౌమ్యముగ వ్యవహ రింపుడు. క్షమింపవలసినదిగ విదేహరాజపుత్రిని ప్రార్థింపుడు. ఇందువలనే మీకు శుభము కలదు.

త్రిజట పల్కిన వచనముల నాలకించి రాక్షసస్త్రీలు భయముచెంది సీతాదేవిపాదములపై బడి క్షమింపు మని ప్రార్థించి ఆప్రదేశమునుండి తొలగిపోయిరి. సీతాదేవి దుఃఖ మున కంతులేదు. ఆమె వ్యాకులయై త్రిజటతో నిట్లుపల్కెను. "తల్లీ ! ఈవిపత్కాలములో నీవు నాకు ఊరటకల్గింప ప్రయ త్నించుచున్నావు; కాని ప్రాణనాథునివియోగముచే దుఃఖించు చున్న నేను ఈభయంకరు లైన రాక్షసులమధ్య జీవించి యుండుటవలన ఎట్టిలాభమును లేదు. నీవు నాకొక సాహాయ్య మొనరింపుము. శుష్కకాష్ఠములను సమీకరించి చితిని బేర్చుము. దానిని జ్వలింపజేసి నేను అగ్నికి ఈశరీరము నాహుతిచేసెదను. నీయీ యుపకారమును నేను మరువలేను. ఈకష్టములను నేనింక భరింపలేను.

ఇట్లుపల్కి సీతాదేవి దుఃఖింపనారంభించెను. ఆమె దుఃఖమును గాంచి త్రిజట దుఃఖితురాలై అనేకయుక్తులతో ఊరడించి సమాధానపరచి వెడలిపోయెను. సీతాదేవియొక్క కరుణాక్రందనమును విని వృక్షముపై దాగియున్న వజ్రాంగు డైన శ్రీహనుమంతునిహృదయము విదీర్ణమయ్యెను. ఆయన నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహింపనారంభించెను. సీతా

దేవి సమక్షమునకు తత్ క్షణమే అఱుదెంచుటచే ఆమె భీతినొందు నేమో యనుశంకతో ఆగిపోయెను.

దుఃఖావేగముచే సీతాదేవి శరీరత్యాగమే యుచిత మని సంకల్పించుకొనెను. ఆమె యిట్లాలోచింపసాగెను. "ఉరి తగిలించుకొని మరణించుటకు నావేణి చాలును" అని ప్రాణములను విడచుటకు నిర్ణయించుకొని విదేహరాజకుమారి లేచి నిలుచుండెను. ఆమెనేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించుచుండెను.

సీతాదేవి యిట్లు (ప్రాణముల నర్పించుటకు) సిద్ధమగుటను గాంచి సూక్ష్మరూపుడైన పవనపుత్రుడు అత్యంతమధురస్వరముతో నిట్లుపలుక నారంభించెను. "ప్రఖ్యాతమైన ఇక్ష్వాకువంశములో ప్రభవించిన దశరథుడను చక్రవర్తి మహాప్రతాపవంతుడు, ధర్మాత్ముడు; ఆయనకు శుభలక్షణసంపన్నులు, దైవసమానులు, త్రైలోక్యవిఖ్యాతులు నైన శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్ను లను నల్వురుకుమారులు కలరు. అగ్రజుడైన శ్రీరాముడు తన ప్రాణాధికప్రియురాలు, సహధర్మచారిణి యైన జనకరాజపుత్రికతోను, తన అనుజుడైన లక్ష్మణునితోను తండ్రి యాజ్ఞను పాలించుటకు రాజ్యత్యాగ మొనరించి అరణ్యమునకు జనెను. వారు మహర్షులను, మౌనివర్యులను దర్శించుచు దండకారణ్యమును జేరిరి. కరుణావతారుడగు శ్రీరామచంద్రుడు గౌతమీనదీతటముపై గల పంచవటి

యను ఆశ్రమములో నివసింపసాగెను. శ్రీరామలక్ష్మణులు ఆశ్రమమునకు దూరముగ నున్న సమయములో దుష్టుడు, లంకాధిపతియు నగు దశాననుడు మోసముగ సీతాసాధ్విని అపహరించుకొనిపోయెను. ఆశ్రమమునకు దిరిగివచ్చి సీతను కనుగొనని వాడై శ్రీరామచంద్రుడు శోకసంతప్తుడయ్యెను. లక్ష్మణునితో గలసి సీతను వెదకుచు దుఃఖితుడైన శ్రీరామచంద్రుడరణ్యమార్గమధ్యములో జటాయువు ననుగ్రహించి, ఋష్యమూకపర్వతప్రాంతమున కేతెంచెను. ఆప్రదేశములో ఆంజనేయునితో సమాగము జరిగెను. వానరచక్రవర్తియగు సుగ్రీవునకు, శ్రీరామచంద్రునకు మైత్రి కుదిరెను. అగ్రజుడైన వాలి వైరముతో సుగ్రీవుని రాజ్యమునుండి వెడలగొట్టెను. దీర్ఘబాహుడగు శ్రీరామచంద్రుడు ఆ వాలిని ఒకేయొక బాణముతో సంహరించెను. సుమిత్రానందనుడైన లక్ష్మణుడు సుగ్రీవుని కిష్కింధారాజ్యసింహాసనముపై అభిషిక్తునిగనొనరించెను. కిష్కింధాధిపతియు, వానరరాజునైన సుగ్రీవుడు విదేహరాజకుమారియైన సీతాదేవిని వెదకుటకు కోటానుకోట్ల వానరభల్లూకవీరులను నాల్గుదిక్కులకు బంపెను. నేను ఆకపిరాజగుసుగ్రీవుడు పంపగా వచ్చిన సామాన్యవానరుడను. మార్గమధ్యములో జటాయువుయొక్క అగ్రజుడైన సంపాతిని కలిసికొంటిని, ఆయన విదేహరాజకుమారియొక్క నెలవు దెల్పెను.

సంపాతి చెప్పిన మార్గమునననుసరించి నేను సాగరమును దాటి లంకను జేరితిని. లంకలో అన్వేషించుచున్న నేను విభీషణుని కలసికొంటిని. విభీషణుడు చెప్పిన ప్రకారము నేను జగజ్జనని యగు సీతాదేవిని దర్శించితిని. నాయాత్ర సఫలమైనది, కాని ఆతల్లి దుఃఖమును గాంచగనే నాధైర్యము చలించుచున్నది.

ప్రాణారాధ్యుడగు శ్రీరామచంద్రుని భవ్యచరితము నాలకించుచున్న సీతాదేవియాశ్చర్యమునకు హద్దులు లేక పోయెను. ఇది సత్యమా? లేక స్వప్నమునుగాంచుచున్నానా? పరనింద నే నెన్నడుచేసి యెఱుగను. అయినచో నే నేట్లు స్వప్నమును గాంచగలను? ప్రస్ఫుటమగు మధురవాక్యముల నాలకించుచున్నాను, ఇది భ్రమ కాజాలదని సీతాదేవి మనస్సులో యోచించుకొని యిట్లుపల్కెను. "అమృతమయమగు నాప్రాణనాథుని శుభచరితమును గానమొనరించిన మహానుభావుడు నాయెదుటకు రావలసినదిగ కోరుచున్నాను."

సీతామాత యాదేశము నాలకింపగనే శ్రీరామభక్తుడగు హనుమంతుడు మెల్లమెల్లగ వృక్షమునుండి దిగి అత్యంత వినయముగ తల్లిచరణకమలముల చెంత తనశిరస్సు నుంచి నమస్కరించెను.

అత్యంతకుటిల స్వభావము గలిగిన రాక్షసస్త్రీలనడుమ పతివియోగదుఃఖముచే దుఃఖితురాలై కాలము గడుపుచున్న విదేహరాజకుమారి తన యెదుట విద్యుత్పుంజసమానుడు,

అత్యంతపింగళవర్ణుడు, పక్షిసదృశమగు ఆకారముకలవాడు నగు వానరుని గాంచి కంపించెను. వానరునినేత్రములు తప్త సువర్ణమువలె మెరయుచుండెను. ఆచిన్ని వానరమును గాంచి నన్ను మోసముతో వశపరచుకొనుటకు మాయావి యగు రావణుడు ఇటకేతెంచెనా యని సీతాదేవి అనుమానించెను. తలను దించుకొనియున్న సీతామాత తనకష్టములకు వ్యాకుల చిత్తయై దుఃఖింపనారంభించెను.

సీతాదేవి తలవంచుకొని దుఃఖించుటను గాంచి అంజనీ నందనుడు వ్యాకులుడై యిట్లుపల్కెను. "జననీ! నీకెట్టి శంకయు వలదు. నేను కరుణామయుడగు శ్రీరామునిసాక్షిగ శపథమొనరించి పల్కుచున్నాను. నేను ప్రభు వగు శ్రీరాముని దాసానుదాసుడను. వానరరాజగు సుగ్రీవుని మంత్రిని. వారుపంపగా నిన్ను వెదకుచు ఈప్రదేశమునకు వచ్చితిని. నాతండ్రిమహాపరాక్రమవంతుడగు వాయుదేవుడు" తన యెదుట అత్యంతశ్రద్ధతో తలవంచుకొని హస్తములు జోడించి నమస్కరించుచు నిలుచుండియున్న శ్రీపవనాత్మజుని గాంచి కొంత ఊరడిల్లి జానకి యిట్లుపల్కెను. "నీవు శ్రీరఘు నాథునిదాసుడ వనిచెప్పుచున్నావు; కాని మానవులకు, మీకు ఎట్లు మైత్రి కుదిరెను."

నమస్కరించుచు అత్యంతవినయపూర్వకముగ హను మంతుడిట్లు ప్రత్యుత్తర మొసంగెను. 'తల్లీ! శబరియాదేశాను

సారముగ రామానుజునితోఁ గూడి శ్రీరామచంద్రుడు ఋష్య మూకపర్వతప్రాంతమున కేతెంచెను. గిరిశిఖరముపై నున్న సుగ్రీవుడు ఈమహాతేజస్సంపన్నులను గాంచి వారివివరములను తెలిసికొనవలసినదిగ నన్ను బంపెను. ఒకబ్రాహ్మణునివేష ములో నేను స్వామిని సమీపించితిని. భక్తపరాధీనుడు, నా దైవము నగు నాశ్రీరామచంద్రుడు నన్ను ఆంజనేయునిగ గుర్తించెను. ఆయనచరణములపై బడి నేను లక్ష్మణసహితముగ భుజములపై నెక్కించుకొని సుగ్రీవునిచెంతకు జేర్చితిని. శ్రీరామునకు సుగ్రీవునకు మైత్రిని నెరపితిని. రాజ్యబహిష్కృతు డైన సుగ్రీవుడు శ్రీరామానుగ్రహముచేతనే మరల రాజ్య మునుపొంది సుఖించుచుండెను. వానిపంపుననే నే నిచ్చోట కేతెంచితిని. గుఱుతుకొఱకు ప్రభువు నాకీ రాజముద్రిక నొసంగెను.

హనుమంతుడు సీతాదేవికి శ్రీరామముద్రిక నొసం గెను. ప్రకాశపుంజములను వెదజల్లుచున్న రత్నజటితము శ్రీరామనామాంకితము నగు ఆదివ్యముద్రికను జానకీదేవి ధ్యానపూర్వకముగ జూచెను. ఆమెయానందమునకు మేరలేదు, ఆమెనేత్రములనుండి ప్రేమాశ్రువులు ప్రవహింప నారంభిం చెను. శ్రీరామచంద్రునిదూత యగు హనుమంతునిపై పరి పూర్ణ మగు విశ్వాసము కలుగగనే సీతాదేవి యిట్లుపలికెను. 'పవనపుత్రా! నీవు నాప్రాణములను రక్షించితివి. నిశ్చయముగ

నీవు నాజీవితేశ్వరునకు అనన్యభక్తుడవు. నాప్రభువు నీపై పరిపూర్ణమగు విశ్వాసముంచెను లేనిచో పరపురుషుని నాచెంతకు పంపరు. హనుమాన్! నీవు నాదశను గాంచితివి. క్రూరులగు ఈ నిశాచరులనడుమ నే నెట్లు జీవించుచున్నానో చూచితివి, శ్రీరామచంద్రుని ఎడబాసి నే నెట్లు జీవింపగలను. నాప్రభువునకు నివేదింపుము. సమయముముగియగనే పాపాత్ములగు రాక్షసులు నన్ను సంహరింతురు. నన్ను ప్రభువు ప్రాణములతో జూడవలెనన్న ఒకనెలలోపలనే లంక కేతెంచి రాక్షస వంశమును సంహరింపవలెను. అంజనీనందనా! నీవుకూడ యుక్తియుక్తముగ స్వామికి విన్నవించి వెంటనే రాక్షసులను సంహరింపజేసి నన్నుద్ధరింపజేయుము.

సీతాదేవి వ్యాకులపాటుతో మరల ఇట్లుపల్కెను, "హనుమా! ఆపత్సముద్రమున మునుగుచున్న నాకు నీవు గొప్ప సహాయకుడవైతివి. ప్రభువునకు దూరమైన నేను నీటినుండి దూరమైన మీనమువలె కొట్టుకొనుచున్నాను. దయామయుడగు ఆప్రభువు నన్నెప్పుడైనను తలంచుచుండునా?

బద్ధాంజలియై వినయపూర్వకముగ శ్రీఆంజనేయుడిట్లు పల్కెను. "తల్లీ! నీవియోగమువలన శ్రీరామచంద్రుడనుభవించుచున్న దుఃఖమును వర్ణించుటకు సర్వదా నే నసమర్థుడను. ఆర్యాంబికా! నిన్ను గాంచనికారణమున శ్రీరామచంద్రునిహృదయము ఎల్లప్పుడును శోకముతో నిండియుండును,

ఆయన మనస్సెప్పుడు నీధ్యానమందే లగ్నమై యుండును. నీ వియోగదుఃఖముచే శ్రీరాముడు తన్నుతాను మరచెను. నిన్ను గురించితప్పమఱియేవిషయమునుగూర్చియు రాముడు యోచించుటలేదు. నీయెడలగల చింతతో ఆయన నిదురించుటలేదు. ఒకక్షణము కన్నుమూసినను 'సీతా! సీతా!' యనుచు మేల్కొనుచుండెను. అమ్మా! శ్రీరామచంద్రుని శంకింపకుము. ఆయన హృదయమున ద్విగుణీకృతమగుప్రేమ నీపైకలదు. కరుణానిధానుడగు ప్రభువు సజలనేత్రములతో నీ కిట్లుసందేశమును పంపెను.

తత్వ ప్రేమకర మమ అరు తోరా ।
జానత ప్రియా ఏక మను మోరా ॥
సో మను సదా రహత తోహి పాహీం ।
జాను ప్రీతి రను ఎతనేహి మహీం ॥

(శ్రీరామచరిత మానసము 5-15-3)

సీతా! నీవు లేనినాకు ఈసృష్టియందుగల వస్తువులన్నియు దుఃఖదాయకములైనవి. బయటకు చెప్పుకొన్న మనస్సులోనిదుఃఖము కొంత తరుగగలదు. కాని నే నెవ్వరితో చెప్పుకొనగలను? నాదుఃఖమును తెలిసికొనగలవా రెవ్వరు? ప్రియా! నీనాప్రేమతత్త్వరహస్యము నామనస్సునకే తెలియును. ఆమనస్సు ఎల్లప్పుడు నీచెంతనే యుండును. నాప్రేమసారమంతయు ఇదియే యని తెలిసికొనుము.

జీవనాధారు డగు శ్రీరఘునాథచంద్రునిప్రియసందే

శము నాలకించి సీతాదేవి ఆనందమగ్నురాలయ్యెను. ఆమె హనుమంతుని సంబోధించుచు ఇట్లుపల్కెను. సుపుత్రుడా! శీఘ్రాతిశీఘ్రముగ శ్రీరామచంద్రుడు నన్నుద్ధరించునటుల ప్రయత్నమొనరింపుము; విలంబనమొనరింపకుము.

వినీతాత్ముడగు శ్రీపవనాత్మజు డిట్లుపల్కెను. తల్లీ! నీ విక చింతింపకుము. ధైర్యమువహించి పరమప్రభు వగు శ్రీరామచంద్రుని స్మరించుచుండుము. నేను మరలిపోవగనే శ్రీరామచంద్రుడు సపరివారముగ విచ్చేసి రాక్షసులను సంహరించి నిన్ను అత్యంతాదరముగ, ప్రీతిపూర్వకముగ అనుగ్ర హింపగలడు. అమ్మా! స్వామి నాకనుజ్ఞ నొసంగలేదు. లేనిచో నేను ఈక్షణమే నిన్ను నాభుజములపై ఎక్కించుకొని శ్రీరామ చంద్రునిచెంతకు చేర్చెడివాడను.

స్వల్పమైన వానరరూపమున నున్న హనుమంతు డిట్లు పలుకగా సీతాదేవి నవ్వి యిట్లు పల్కెను. "కుమారా! హను మంతుడా! ఈలంకలో నున్న రాక్షసులను నీవు గాంచితివి. వారిశక్తియుక్తు లపారములు. సుగ్రీవునిసైన్యములో నున్న వానరులందఱు నీవంటిలఘుకాయములు కలవారా యేమి! నాకు సందేహము దయించుచున్నది."

తల్లిపల్కిన పల్కుల నాలకించి సాక్షాత్తు శివస్వరూ పుడు, పవనాత్మజుడు నగు శ్రీహనుమానుడు మందహాసము చేసి తనవిశ్వరూపమును ప్రదర్శించెను.

చూచుచుండగనే హనుమంతుడు ఇంతటివాడంతై మేరువంతై గగనమంతై యెదిగిపోయెను. ప్రజ్వలితాగ్నిసదృశ మగు తేజస్సుకలవాడు, విశ్వరూపుడు, అగ్నిసదృశ మగు నేత్రములుగలవాడు, పంచశిరములు కలవాడు, ప్రతిముఖమందు త్రినేత్రములు కలవాడు, వజ్రసమము లైన కోరలు కలవాడు, వాడి యైన నఖములు కలవాడు, విశాలకాయుడు మహాబలియు నగు హనుమదీశ్వరునివిశ్వరూపమును గాంచి సీతాదేవి పరమాశ్చర్యచకితురాలయ్యెను. దేవతలు ఆవిశ్వరూపు నిట్లు ప్రార్థింపనారంభించిరి.

శ్లో॥ వన్దే వానర నారసింహ ఖగరాట్, క్రోడాశ్వవక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం, దేదీప్యమానం రుచా
హస్తాబ్జైరసి ఖేట పుస్తక సుధా కుంభాంకుశాద్రీన్ హలం
ఖట్వాఙ్గం మణిభూరుహం చ, దధతం సర్వారిగర్వాపహం.

(పరాశర సంహిత)

వానర నృసింహ గరుడ సూకర అశ్వముఖములు కలవాడు, అనేకములైన అలంకారములు కలవాడు, దేదీప్యమానముగ ప్రకాశించుచున్నవాడు, ప్రతిముఖమునందు మూడు నేత్రములు కలవాడు, పద్మములవంటి కరములందు ఖేటము (డాలు)ను, పుస్తకమును, అమృతకలశమును, అంకుశమును, పర్వతమును, నాగలిని, ఖట్వాంగమును, (శివునివింటిని),

మణులను, వృక్షమును ధరించినవాడు, వైరులందరి-గర్వమును హరించినవాడు నగు హనుమంతునకు నమస్కరించుచున్నాను.

విశ్వరూపమును ధరించి హనుమదీశ్వరుడు సీతాదేవికి నమస్కరించి యిట్లుపల్కెను. "జననీ! నేను వనపర్వతాట్టాలికాయుక్తమైన యీలంకానగరమును రావణునితోపాటు పెకలించుకొని మరలిపోగలవాడను; కావున నీవు శంకింపవలదు. శ్రీరాముని దండులో నన్ను మించినవారసంఖ్యాకముగ గలరు. శ్రీరామచంద్రునికృపావిశేషముచే అల్పకీటకమైనను గరుత్మంతుని మింగగలదు."

వానరశిరోమణియు, విశ్వరూపుడు నగు హనుమానుని వచనముల నాలకింపగనే జానకీదేవి సందేహము తొలగిపోయెను. ఆమె అత్యంతప్రసన్నురాలయ్యెను. సీతాదేవి శ్రీరామభక్తుడగు వీరహనుమంతు నాశీర్వదించుచు ఇట్లుపల్కెను."

హోహు తాత బల శీల నిధాన ॥
అజర అమర గుణనిధి సుత హోహూ ।
కరహు బహుత రఘునాయక చోహూ ॥

(రామచరిత మానసము 5-16-1)

తండ్రీ! నీవు బలశాలివి, శీలవంతుడవు, జరారహితుడవు, అమరుడవు. గుణములకు నిధివి అగుదువుగాక! శ్రీరామచంద్రుడు నీపై విశేషకృపను జూపుగాక!"

ప్రభుపు కృపజూచుగాక అను ఆశీస్సును జగజ్జననివలన ఆలకించి పవననందనుడు కృతార్థుడయ్యెను. ఆయనకు సమస్త విశ్వమందుగల అమూల్య మగు నిధులు ప్రాప్తించినట్లయ్యెను. తనవిశ్వరూపమును విడచి హనుమంతుడు జననిచరణకమలముల నాశ్రయించెను. ఆయనప్రేమానందమునకవధులు లేకపోయెను. ఆయనశరీరమంతయు పులకించెను. నేత్రములనుండి ఆనందాశ్రువులు ప్రవహించెను. భువనపావని యగు జానకి యొక్క చరణరేణువులతో శ్రీహనుమంతునిముఖమండలము ప్రకాశించెను. హస్తములను ముకుళించి గద్గదస్వరముతో ఆత డిట్లుపల్కెను. "జననీ! నేను కృతార్థుడనైతిని. నాజీవనము ధన్యమయ్యెను. నాజన్మము సఫలమయ్యెను. విశ్వపావనీ! నీయాశీర్వాదమమోఘము, జగత్ప్రసిద్ధము. అమ్మా! నాకు ఏందులకో ఆకలి గల్గుచున్నది. ఈవనములో నెన్నియో మధురఫలవృక్షములు కలవు. అమ్మా! నీవనుజ్ఞనొసంగిన ఈఫలముల నారగించి నా యాకలిని తీర్చుకొందును. అపుడు జానకి యిట్లుపల్కెను. "కుమారా! నీవు ఫలముల నారగించి తృప్తినొందవలె నని నేను ఆకాంక్షించుచున్నాను; కాని యీవనమును బలవంతులు, శూరులు, వీరులు నగుదానవసైనికులు రక్షించుచున్నారు.

నిర్భీకు డగు హనుమంతుడు "జననీ! నీయనుజ్ఞ నాకు కావలయును. ఈయసురులను గుఱించి నీవు చింతింపవలదు" అనిపలికెను.

సీతాదేవి మహావీరుడు, బలవంతుడు, బుద్ధిమంతుడు నగు హనుమంతుని గాంచి ప్రసన్నురాలై యిట్లుపల్కెను. "కుమారా! శ్రీరామచంద్రుని స్మరించుకొనుచు ఇచ్ఛానుసారముగ మధురఫలముల నారగింపుము."

## అశోకవన విధ్వంసము

సకలశాస్త్రపారంగతుడు, విద్వాంసుడు నగు శ్రీపవన కుమారుడు ఇట్లాలోచించెను - "దూతయొక్క కార్యము స్వామిహితార్థమై మార్గమును సుగమమొనరించుటయే. రాక్షసేశ్వరుడైన రావణుని యీదుర్గమభేద్యము. ప్రతిద్వారమందు అద్భుతములు, విచిత్రములు నగు యంత్రము లమర్చబడియున్నవి. అవి యుండగా ఎంతటివీరసైన్యమైనను దుర్గమున ప్రవేశించు టసంభవము. అదియునుగాక, అగమ్య మగు ఈ లంకానగరమును రాత్రియందు జూచితిని. దశకంథరునివ్యక్తిత్వము, వానివీరత్వము నా కెట్లవగతముకాగలదు? శత్రుసైన్యములశక్తియుక్తులను తెలిసికొను టత్యంతావశ్యకము. అంతియేకాదు, రావణుని వానిమనోస్థైర్యమును సడలింపజేసినచో లాభము కలుగును. సీతామాతకు నే నిచ్చిన ఆశ్వాసనమునకు విశ్వాసము కల్గించినచో ఆమె ధైర్యపూర్వకముగ శ్రీరామాగమనమునకొఱకై యెదురుచూడగలదు, కావున లంకను బాగుగ పరిశీలించి లంకాధిపతి యగు రావణుని కలసి

కొని మరలుటయే ఎక్కువయుపయోగము కాగలదు, కాని వానితో కలియుట యెట్లు సంభవింపగలదు? ఏయుపాయముచే నైనను ఈయసురులను త్తేజితుల నొనరించినచో వారెట్లైనను నన్ను రావణుని సమ్ముఖమునకు కొనిపోగలరు.

ఇట్లాలోచించుకొని పవనపుత్రుడగు హనుమంతుడు ఒకవృక్షముపైకి లంఘించి మధురఫలములను ఆరగింపనారంభించెను. కొన్నిఫలములను కొఱికి క్రిందపడవేయుచుండెను. ఒక వృక్షముయొక్కకొమ్మను విరచెను, మఱియొకవృక్షమును సామూలాగ్రముగ పెకలించివైచెను. ఈప్రకారముగ అశోక వనమును ధ్వంసమొనరింపనారంభించెను. సీతాదేవియున్న ప్రాంతము దక్క అన్యమగు అశోకవాటికనంతయు అస్తవ్యస్త మొనరించెను. అమితసుందరమగు ఆవనము క్షణములో ధ్వంసమైపోయెను. హనుమంతుడు గగనము నంటుచున్న ఒక చైత్యప్రాసాదముపై ఎగిరికూర్చుండెను. శక్తిసంపన్నుడు, మహాదేవాత్మజుడు, పరమతేజస్వియు, శివావతారుడునగు కపీశ్వరుడు విశాలశరీరుడై లంక ప్రతిధ్వనించునట్లుగ అట్టహాసమొనరించుచు ఆచైత్యప్రాసాదమును ఖండఖండములుగ భగ్నమొనరించెను.

విశాలకాయుడగు హనుమంతునిగర్జనము నాలకించి తమోగుణసంపన్నులగు రాక్షసులు అదరిపడి లేచి భయపడ సాగిరి. వారు తక్షణమే నానావిధములైన ఖడ్గతోమరముద్గర

గదాద్యస్త్రశస్త్రములను తీసికొని చైత్యప్రాసాదాభిముఖముగ పరుగిడిరి. మనోహర మగు అశోకవనము విధ్వంసమగుట కాంచి వారాశ్చర్యచకితులైరి. అయ్యసురులు కోపించినవారై నఖ దంష్ట్రాయుధములతో పవనకుమారునిపై దాడిచేయసాగిరి. కాని మహాశక్తిసంపన్నుడగు శ్రీహనుమంతునియెదుట ఆ యసురసైన్యము క్షణమైనను నిలువలేకపోయెను. భగ్నమైన ప్రాసాదముయొక్క, దానిఖండములయొక్క, తరుశాఖల యొక్క క్రిందపడి వారు మరణించిరి.

వికృతముఖములు కల్గిన కొందఱు రాక్షసస్త్రీలు సీతాదేవిచెంతకు జని వానరాకారుడు, భయంకరుడు నగు ఈవీరు డెవ్వ డని ప్రశ్నించిరి. అందులకు సీతాదేవి రాక్షసమాయలు మీకే తెలియును, దుఃఖితురాలనైన నే నేమిచెప్పగలనని ప్రత్యుత్తర మొసంగెను.

మృత్యువునుండి బయటపడిన కొందఱు అసురవీరులు పరుగుపరుగున రావణునిసభకు జని యిట్లుపల్కిరి. "ప్రభూ! వానరాకారములో నున్న ఒకప్రాణి యెచ్చటనుండియో వచ్చి అశోకవనమున ప్రవేశించినది. సీతాదేవితో సంభాషించి తదనంతరము అశోకవాటికను విధ్వంస మొనరించినది. వనమునందుగల వృక్షము లన్నియు ధ్వంసములైనవి; అంతియేకాదు మణి నిర్మిత మగు చైత్యప్రాసాదమును భగ్న మొనరించి యెదురించిన అసురవీరులను సంహరించి ఆమహావానరుడు నిర్భయుడై,

నిశ్చింతుడై, ఆవనములో కూర్చుండియుండెను. మే మిద్దరము మాత్రమే మృత్యువాతనుండి బయటపడినవారమై మిమ్ము జేరితిమి.

రావణుడు మిగుల కోపించెను. ఆతడు ప్రాతఃకాలమున దుఃస్వప్నములో గూడ వానరుడు లంకను ధ్వంసమొనరించు చున్నట్లు జూచెను.

అసురులు పల్కిన వచనముల నాలకించి లంకాధీశ్వరుడు రక్తపంకజలోచనుడై ఒకవిశాల మగు అసురసైన్యమును బంపెను.

ఆసమయములో స్వర్ణశైలసదృశు డైన కపిశ్రేష్ఠుడు విశాల మగు లోహ స్తంభమును బూని అసురసైన్యముకొఱకై నిరీక్షించుచుండెను. మహాతేజస్వి యగు ఆ పవనకుమారుని ముఖము అరుణవర్ణముగ నుండెను. ఆతనియాకృతి అత్యంత భయంకరముగ నుండెను. రక్కసుల విశాలసైన్యము వచ్చు చుండుట చూచి ఉగ్ర వేగు డగు హనుమంతుడు భయంకర ముగ గర్జించెను. మల్లవిద్యకు పరమారాధ్యుడు, వికటమూర్తి యగు ఆంజనేయుని భయంకర గర్జనము నాలకింపగనే రాక్షస వీరుల హృదయములు కంపించెను. వారు వానరేశ్వరు డగు హనుమంతునిపై భయంకరములగు అస్త్రశస్త్రముల నెన్నింటినో ఒక్కుమ్మడిగ వర్షింపనారంభించిరి; కాని అమిత విక్రముడు, క్రోధముచే రక్తపంకజ లోచనములు గలవాడు నగు పవన

కుమారుని ప్రహారముల యెదుట ఆ యసురవాహిని క్షణములో వివశయై మృత్యువాతపడెను.

విశాలమగు అసురసైనము నశించుట రావణునకు తెలిసెను. అందుల కాతడు ఆశ్చర్యచకితుడయ్యెను. అపుడు రావణుడు తనమంత్రి యగు ప్రహస్తుని కుమారుడైన జంబుమాలిని వానరుని బంధించి తేవలసినదిగ ఆజ్ఞాపించెను. జంబుమాలి విశాలకాయుడు, మహా క్రోధి, యుద్ధములో దుర్జయుడు. అతడు అసురసైన్యమును దోడ్కొని అశోకవనమునకు జనెను. చైత్యప్రాసాదభంజకుడైన హనుమంతు డొక విశాలద్వారముపై నిలుచుండియుండెను. అసురవీరులు తనను సమీపించుట గాంచి, ప్రసన్నతాపూర్వకముగ గర్జించెను. జంబుమాలి పవనపుత్రునిపై దివ్యాస్త్రములను ప్రయోగించెను. వజ్రశరీరు డగు హనుమంతుడు చలింపక ముష్టిఘాతముచే జంబుమాలిని సంహరించెను. తదనంతరము అసురసైన్యమును లోహస్తంభముచే మోది సంహరించెను.

ప్రహస్తకుమారు డగు జంబుమాలి, వానికింకరులు మరణించుట రావణునకు దెలిసెను. రావణుని యాశ్చర్యమునకు మేరలేదు. వెంటనే యాతడు మహాబలవంతులు, ధనుర్ధారులు, అస్త్రవేత్తలందు శ్రేష్ఠులు నగు ఏడుగురు మంత్రిపుత్రులను ససైన్యముగ హనుమంతునిపైకి బంపెను. ఆ ఏడుగురు మహావీరులు శస్త్రసమన్వితము లగు తమతమ సైన్యములతో

గూడి వంటరివాడగు రుద్రాంశుని నిర్జించుటకు బయలుదేరిరి. పరాక్రమవంతులగు ఆ మంత్రికుమారులు సువర్ణ ధనుష్టం కారమొనరించుచు హర్షయుక్తులై, ఉత్సాహవంతులై రణరంగమునకు జేరిరి. సూర్యసమాన తేజస్వియగు శ్రీ హనుమంతుడు ప్రచండమగు లోహస్తంభమును ధరించి అసురసైన్యముకొఱకు నిరీక్షించుచుండెను. రాక్షసులందఱు ఒక్కుమ్మడిగ హనుమంతునిపై బాణములను వర్షింపనారంభించిరి. యుద్ధప్రియుడు, పరాక్రమవంతుడు నగు హనుమంతుడు తీక్ష్ణములగు వారి శరాఘాతములనుండి తన్నుతాను రక్షించుకొనుచు, భయంకర గర్జనములచే భయపెట్టుచు వారిని ఎదుర్కొనెను. క్షణములో మంత్రికుమారులతోపాటు అసురసైన్యములు నేలకూలెను. శేషించిన వారు భయభ్రాంతులై పలాయనము చిత్తగించిరి.

ఇపుడు రావణుడు భయము నొందెను; కాని మనస్సును దిటముజేసికొని తన కర్తవ్యమును నిశ్చయించుకొని హనుమంతుని బంధించి తీసుకొనిరమ్మని మహావీరులు, రణనిపుణులు, ధైర్యవంతులు నగు విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అను నామములు గల్గిన ఐదుగురు సేనాధిపతులను ఆజ్ఞాపించెను.

దశకంఠుని ఆ యైదుగురు సేనాధిపతులు తమ తమ సైన్యములతో అశోకవనమును జేరి హనుమంతునిపై దాడిచేసిరి.

అపుడు హరాంశజు డగు అంజనీనందనుని యాకారము భయం కరముగ పర్వతమువలె పెరిగిపోయెను. ఆతనిభీషణాకృతిచేత ఆకాశమును విదీర్ణ మొనరించు గర్జనముచేత అసురులు భీతులై ప్రాణము లేనివారైరి. వారి యస్త్రశస్త్రములు శక్తిసంపన్ను డగు ఆంజనేయునకు ఆటవస్తువులవలె గోచరించెను. క్షణ కాలములోనే ఆ సర్వసైన్యమును ఐదుగురు సేనాధిపతులతో పాటు తనపదాఘాతములచే హనుమ సంహరించెను. అసురుల శవములతో ఆ ప్రదేశమంతయు నిండిపోయెను. వానరాధీశ్వరు డగు శ్రీపవనసుతుడు ఇనుప స్తంభమును ధరించి అన్యరాక్షస సైన్యములకొఱకై నిరీక్షించుచుండెను. ఆ సమయములో క్రోధముచే రక్తపంకజలోచను డైన కపిసత్తముడు రాక్షస సంహారార్థమై విజృంభించిన భయంకరు డగు మహాకాలునిగ గోచరించుచుండెను.

రావణునిసభకు ఈ యైదుగురు సేనాధిపతులు ససైన్య ముగ మరణించిన వృత్తాంతము జేరెను. ఈ దుర్ఘటన నాల కింపగనే రావణుడు తనవీరకుమారు డగు అక్షయుని జూచెను. యుద్ధముకొఱకు ఉత్కంఠితు డగు అక్షయకుమారుడు తండ్రి మనోభీష్టమును గ్రహించినవాడై, సువర్ణరథారూఢుడై కపీశ్వ రుని బంధించుటకు బయలుదేరెను. కాని రథములో ధను ర్బాణములు, చంద్రహాసము, శక్తి, తోమరము, గద మొద లగు ఆయుధములు, అస్త్రములు యథాస్థానమందు క్రమముగ నుంచబడెను.

అక్షయకుమారుడు యుద్ధవీరు డగు హనుమంతునిపై ప్రచండవేగముతో దాడిజరిపెను. కాని భూధరాకారుడు, శ్రీమహాదేవాంశజుడు నగు హనుమంతు డాకాశమార్గమున కెగిరినవాడై అక్షయునిరథముపైకి దూకెను, ఆ తాకిడికి రథము, అశ్వములు, సారథి నశించెను. అక్షయకుమారుడు రథమునుండి దూకినవాడై ఆంజనేయునిపై అస్త్రములను ప్రయోగింప నారంభించెను. అపుడు హనుమ ఆకాశమున కెగురగా అక్షయుడు వెంటబడెను. ఆకాశములో పవనకుమారుడు అక్షయకుమారుని రెండుకాళ్ళను బట్టుకొని గిరగిర ద్రిప్పి భూమిపై బడవేసెను. అంతయెత్తునుండి క్రిందకు పడిన అసుర రాజు యొక్క ప్రాణప్రియపుత్రుని శరీరము తునాతునుక లయ్యెను. ఆ మహావీరుని ప్రాణము లనంతవాయువులో కలసిపోయెను.

హనుమంతునిచే అక్షయకుమారుడు మరణించిన సమయమున నక్షత్రమండలమున విహరించుచున్న మహర్షులు, యక్షులు, నాగులు, ఇంద్రాది దేవతలు ఆప్రదేశమునకు వేగు దెంచి విస్మయముతో మహాతేజసంపన్నుడు, మహాకాలస్వరూపుడు నగు శ్రీరుద్రాంశజుని దర్శించి అనేక విధముల స్తుతించిరి. తదనంతరము శ్రీపవనకుమారుడు మరల యుద్ధము కొఱకు నిరీక్షింప సాగెను.

అక్షయకుమారుడు మరణించెనని వినగనే రావణుడు

చింతాక్రాంతుడయ్యెను, ఎట్లో తనమనస్సు నూరడించు కొనెను. ప్రజ్వలితమగు రోషాగ్నిచే దగ్ధుడగుచు, మహాకాయుడై నరావణుడు తానే స్వయముగ ఆంజనేయుని బంధించుటకు బయలుదేరగా ఇంద్రజిత్తు తనతండ్రిని వారించి యిట్లు పల్కెను. "పితృదేవా! నే నుండగా నీ వేల దుఃఖించెదవు? ఒక్క క్షణములో నేను వానరుని బంధించి నీయెదుట ఉంచ గలను.

ఇంద్రజిత్తు వానరేశ్వరుడైన హనుమంతునితో యుద్ధ మొనరించుటకు బయలుదేరగా రావణుడు కుమారుని సావ ధానపఱచుచు నిట్లుపల్కెను."

శ్లో॥ న మారుతస్యాస్తి గతిప్రమాణం ।
న చాగ్నికల్పః కరణేన హంతుమ్ ॥
(వాల్మీకి. రా. 5-48-11)

కుమారా! ఆవానరుని గమనమునకు లేదా శక్తికి ప్రమాణము గోచరించుటలేదు (అనగా అవధులు లేవు) అగ్ని సమానతేజస్వి యగు ఆవానరుని ఏసాధనముచేతనైనను నిర్జించుట సాధ్యముకాదు.

కావున నీవు నీప్రతిపక్షమున నున్న వానిని నీతో సమానుడైన పరాక్రమము కలవాడని తెలిసికొని ధనుర్బాణ ములయొక్క దివ్యప్రభావమును జ్ఞప్తియుందుంచుకొని (దివ్యా

స్త్రములను స్మరించుచు) రణరంగమున ప్రవేశింపుము. నీపరా క్రమమును జూపుము.

తన తండ్రిపలికిన వచనముల నాలకించి వీరవరు డగు మేఘనాథుడు దశకంఠునకు ప్రదక్షిణముల నాచరించి ఘోర యుద్ధముచేయ సంకల్పించినవాడై తనయద్భుతరథము నధి రోహించెను.

మహాపరాక్రమవంతు డగు మేఘనాథుడు, తనదివ్య రథము నధిరోహించి రాక్షససైన్యములచే పరివృతుడై పవన పుత్రునిసమీపమున కరుదెంచెను. ఇంద్రజిత్తు చేసిన భయంకర సింహనాదము నాలకించి సర్వసమర్థు డగు ఆంజనేయుడు లోహస్తంభమును ధరించినవాడై గగనమున కెగిరెను. ధనుర్ధరు డగు మేఘనాథుడు మహాశరప్రయోగముచే హను మంతు నొప్పించెను. బృహత్కాయు డగు ఆంజనేయుడు లోహస్తంభప్రహారముచే రథమును, రథసారథిని చూర్ణమొన రించెను. మేఘనాథుని యపారసేనా వాహిని ఆంజనేయుని ప్రహారములకు రక్తము గ్రక్కుచు మరణించెను.

ఆ కపీశ్వరునిశక్తియెదుట ఏయస్త్రములు నిలువజాలక పోవుట గాంచి మేఘనాథుడు అస్త్రశిరోమణి యైన బ్రహాస్త్రమును ప్రయోగించెను. నిత్యస్వరూపు డగు పవన కుమారునకు బ్రహ్మదేవుడు బ్రహ్మాస్త్రమునకు బంధింప బడకుండనట్లుగ ఆశీర్వదించియుండెను. కాని ఆంజనేయుడు

బ్రహ్మదేవుని గౌరవింపదలంచెను. ఆయన బ్రహ్మాస్త్రము గౌరవించుటకై తనంతటతానే బంధితుడయ్యెను.

మాయాతీతు డగు శంకరనందనుడు బ్రహ్మాస్త్రము బంధితుడగుట గాంచి భీతులై పారిపోవుచున్న రాక్షసుల మరలివచ్చిరి. వారు హనుమంతు ననేకవిధముల దూషించుచు ఆయనను గొలుసులతో బంధించిరి. అన్యబంధము బ్రహ్మాస్త్రము తొలగెను. బ్రహ్మపాశబంధనము అన్యబంధన ముచే విడిపోవునని మూర్ఖు లగు అసురులకు తెలియదు.

బ్రహ్మపాశముక్తు డగు వానరశిరోమణి కేవలము లోహపుగొలుసులచే బంధింపబడి యుండుట గాంచి ఇంద్రజిత్తు చింతాక్రాంతుడయ్యెను. బ్రహ్మాస్త్ర మొక్క-పర్యాయము విఫలమైనచో మరల ప్రయోగించు టసంభవ మని మంత్రజ్ఞుడైన ఇంద్రజిత్తునకు తెలియును. తనవిజయము తన కనుమానా స్పదమయ్యెను.

బ్రహ్మాస్త్రముచే ముక్తు డయ్యును మంగళమయుడును, జ్ఞానమూర్తియు నగు పవనాత్మజుడా విషయము మే తెలియ నట్లు ప్రవర్తింప నారంభించెను. రాక్షసులు ఆంజనేయుని రావణసభకు తోడ్కొనిపోవ సాగిరి. లంకానగరవాసులు ఆంజనేయుని దుర్భాషలాడుచు పరిహాసింప సాగిరి. కాని శ్రీరామదూత యగు శ్రీఆంజనేయుడు తనస్వామి కార్యము సంపూర్ణ మొనరించుటకు సంకల్పించుకొనినవాడై అసురుల

దూషణ తిరస్కారాదులను మౌనముగ భరించెను. లంకా నగరములోగల సైన్యవిభాగ ప్రదేశములను శ్రీహనుమంతుడు జాగ్రత్తగ గమనించెను. ఇట్లు మేఘనాథుడు ఆంజనేయుని రావణుని సభకు దోడ్కొని పోయెను.

## హనుమంతుడు రావణునకు హితోపదేశము చేయుట

తండ్రిసమ్ముఖమునకు వచ్చి మేఘనాథు డిట్లు పల్కెను. "పితృదేవా! అసాధారణ మగు ఆ వానరము అసంఖ్యాకులగు మన రాక్షసవీరులను సంహరించెను. నేను బ్రహ్మాస్త్రముచే వానిని బంధించి దెచ్చితిని. మీరు మంత్రులతో సంప్రదించి యేది యుచితమో దాని నొనరింపుడు."

నీతి నిపుణుడైన హనుమంతుడు రాక్షస చక్రవర్తియగు రావణునిసభను జాగ్రత్తగ పరిశీలించెను. తప్తమైన సువర్ణమువంటి తేజస్సు కలవాడు, బలసంపన్నుడు, బ్రహ్మవంశకులోద్భవుడు నగు దశాననుడు నానారత్నములచే జటితమై ప్రకాశించు విశాల స్ఫటికమణి సింహాసనముపై ఆసీనుడై యుండుట హనుమంతుడు గాంచెను. రావణుని శిరముల బహుమూల్యములు, దీప్తిమంతములు, రత్నజటితములు నై

మకుటములు ప్రకాశించుచుండెను. మంత్రతత్త్వవేత్త లగు దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అను నల్వురు మంత్రులు రావణుని పరివేష్టించి యుండిరి.

ప్రకాశవంతు డగు ఆ రాక్షసరాజుయొక్క తేజముచే ప్రభావితుడై ధర్మమూర్తి యగు పవనకుమారుడు తనలో తా నిట్లనుకొనెను. ఈ యద్భుతరూపముతో, అనుపమాన శక్తితో, ఆశ్చర్యకరమైన తేజముతో సంపన్నుడైన రావణునిలో ప్రబల మగు ఈ (సీతాపహరణ మను) అధర్మము లేకున్నచో నితడు సకలవిశ్వమునకు సంరక్షకుడు కాగలిగెడివాడు.

దైత్యరా జగు రావణుడు తనయెదుట పింగాక్షుడు, పింగకేశుడు, పింగరోముడు, వానరశిరోమణియునైన శ్రీ ఆంజనేయుని గాంచి రోషాగ్నిచే జ్వలించెను. కాటుక కొండవలె నల్లనివర్ణము కల్గిన ప్రహస్తుడను మంత్రిని గాంచి రావణు డిట్లు పల్కెను. ప్రహస్తా! ఈ వానరుడు తా నెవ్వడో? ఎచ్చటనుండి వచ్చినాడో? వీనిరాకకు కారణమేమో? అశోకవనమును విధ్వంస మేల జేసెనో? అసురవీరులను నా కుమారుని సంహరించుటకు కారణమేమో ప్రశ్నింపుము.

ప్రహస్తుడు హనుమంతుని జూచి యిట్లు పల్కెను. వానరా! నీవు భయముచెందకుము. ధైర్యము వహింపుము. నీ వెవ్వరవు? ఎచ్చోటనుండి వచ్చితివి? ఇచ్చటకు నిన్నెవరు

పంపిరి? సత్యమును బల్కినచో నీకు ఎట్టి హానియు కలుగదు. మేము నిన్ను వదిలివేయ గలము.

శ్రీరామభక్తుడగు ఆంజనేయుడు త్రైలోక్యవిజయుడగు రావణునిసభలో శంకారహితుడు, నిర్భయుడునై యుండెను. ఆయన మహాప్రభువగు శ్రీరామచంద్రుని స్మరించి యిట్లు పలుకనారంభించెను. లంకాధిపతీ! రావణా! అనంతుడు, మహిమాన్వితుడు, దయామయుడు, మహాప్రభువు నగు నెవ్వాని యాశ్రయమును బొంది మాయ సకలసృష్టి యొనరించెనో, ఎవనిశక్తిచే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సృష్టిస్థితిలయముల నొనరించుచున్నారో, ఎవనిబలముపై ఆదిశేషుడు ఈవిశ్వమును ధరించియున్నాడో, ఎవడు యుగయుగములందు గోబ్రాహ్మణులను, దేవతలను, భక్తులను, ధర్మమును రక్షించుటకు, భూమికి భారభూతు లగు నీవంటివారిని సంహరించుటకవనిపై అవతరించెనో ఆ శ్రీరామచంద్రుని దూతను నేను. కఠోరము దివ్యము, విశాలము నగు శంకరభగవానునిధనువును నీవు కదల్పనైనను కదల్పలేకపోతివి. ఆ ధనుస్సును భగ్నమొనరించిన దశరథనందను డగు శ్రీరామచంద్రు నెరుగవా? ఖరదూషణాదులు, త్రిశరుడు మొదలగు పదునాల్గువేల రాక్షసులను ఒక్కడే త్రుటిలో సంహరించిన శ్రీరాము నెరుగవా? ఓరీ! నిన్ను తనచంకలో బంధించిన వాలిని ఒకేయొక బాణముతో సంహరించెను. నీవు నాస్వామి నెరుగనట్లు నటించినను ఆయన

తన ధర్మపత్నిని హరించిన నిన్ను ఎట్లు మరువగలడు? రావణా! సర్వశక్తిసంపన్నుడు, మహాప్రభువు నగు ఆ శ్రీరామచంద్రుని దూతనునేను. మహాప్రతాపవంతు డగు వాయుదేవుని కుమారుడ నైన హనుమంతుడను.

కిష్కింధాధిపతియు, శ్రీరామచంద్రుని స్నేహితుడు నగు సుగ్రీవుడు సీతాదేవి నన్వేషించుటకు కోటానుకోట్ల వానర భల్లూకవీరులను నాల్గుదిశలకు బంపెను. వారిలో ఒకడనైన నేను శతయోజనవిస్తీర్ణ మగు సాగరమును లంఘించి నీలంకకు జేరితిని. సీతను గాంచితిని. లంకను వినాశ మొనరించు మహాకాల స్వరూపిణి సీతాదేవి యని తెలిసికొనుము. సీతాదేవిరూపమును ధరించి కాలపాశమే నీచెంతకు వచ్చినది. రావణా! శ్రీరామాపరాధ మొనరించి సుఖించినవాడు త్రిలోకములం దెవ్వడును లేడు. మహాయశస్వి యగు శ్రీరామచంద్రుడు చరాచరప్రాణిసహితముగ సమస్తవిశ్వమును నాశనముచేసి మరల సృష్టింపగలడు. చతుర్ముఖుడైన బ్రహ్మ, త్రినేత్రు డగు త్రిపురారి, సహస్రాక్షు డగు ఇంద్రుడు, దేవతలు, దైత్యులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు మొదలగు వారందఱు కలసివచ్చినను సమరాంగణములో శ్రీరామునియెదుట ఒక్కక్షణమైనను నిలువజాలరు.

నేను నాప్రభువు యొక్క ఆదేశానుసారముగ సీతాదేవిని దర్శించుటకు వచ్చితిని. నాకు ఆకలి కాగా ఫలములను దింటిని;

నాస్వభావానుసారముగ వృక్షములను విధ్వంసమొనరించితిని. కాని నీసైనికులు నాపై దాడిచేసితిరి. నన్ను నేను రక్షించు కొనుటకు వారిని సంహరించితిని. ఎవనిశరీరము వానికి ప్రియము కదా! ఇందు నాదోష మేమియుగలదు! అపరాధము నీకుమారు డొనరించెను. నన్ను అన్యాయముగ బంధించి తెచ్చుటను నీవే స్వయముగ జూచుచున్నావు గదా!

కపీశ్వరుడు, మహాభక్తుడు నగు హనుమంతుడు నిర్భయ ముగ చాతుర్యముగ పలికిన వచనముల నాలకించి దేవగణ ములు ప్రసన్నములయ్యెను. అసురగణములు భయాక్రాంతులై కంపింపదొడంగెను. శ్రీరామచంద్రుని శక్తిని, మహిమను విని నంతనే వారిమనోబలము సన్నగిల్లెను. రావణుడు క్రోధముతో పండ్లుకొరక నారంభించెను. పరమబుద్ధిమంతుడు, మంగళ మూర్తియు నగు శ్రీఆంజనేయుడు అత్యంతశాంతిపూర్వకముగ దశగ్రీవునిహితార్థ మిట్లుపదేశింపనారంభించెను.

శ్లో॥ త్వం బ్రహ్మణో హ్యుత్తమవంశసమ్భవః
పౌలస్త్యపుత్రోఽసి కుబేరబాన్ధవః ।
దేహాత్మబుధ్యాపి చ పశ్య రాక్షసో
నాస్యాత్మబుధ్యాపి కిము రాక్షసో నహి ॥

శరీరబుద్ధీన్ద్రియదుఃఖసన్తతిర్న తే
న చ త్వం తవ నిర్వికారతః ।

అజ్ఞానహేతోశ్చ తథైవ సన్తతే
రత్వమస్యాః స్వపతో హి దృశ్యవత్ ॥

ఇదం తు సత్యం తవ నాస్తి విక్రియా
వికారహేతుర్న చ తేఽద్వయత్వతః ।
యథా నభః సర్వగతం న లిప్యతే
తథా భవాన్ దేహగతోఽపి సూక్ష్మకః ॥
దేహేన్ద్రియప్రాణశరీరసఙ్గత
స్త్వాత్మేతి బుద్ధ్వాఖిలబన్ధభాగ్భవేత్ ॥

చిన్మాత్రమేవాహమజోఽహమక్షరో
హ్యానన్దభావోఽహమితి ప్రముచ్యతే ।
దేహోఽప్యనాత్మా పృథివీవికారజో
న ప్రాణ ఆత్మానిల ఏష ఏవ సః ॥

మనోఽప్యహంకారవికార ఏవ నో
న చాపి బుద్ధిః ప్రకృతేర్వికారజా ।
ఆత్మా చిదానన్దమయోఽవికారవాన్
దేహాదిసంఘాద్వ్యతిరిక్త ఈశ్వరః ॥

నిరంజనో ముక్త ఉపాధితః సదా
జ్ఞాత్వైవ మాత్మానమితో విముచ్యతే ।
అతోఽహమాత్యన్తికమోక్షసాధనం
వక్ష్యే శృణుష్వావహితో మహామతే ॥

విష్ణోర్హి భక్తిః సువిశోధనం ధియస్తతో
భవేద్జ్ఞాన మతీవ నిర్మలమ్ ।
విశుద్ధతత్త్వానుభవో భవేత్తతః
సమ్యగ్విదిత్వా పరమం పదం వ్రజేత్ ॥

అతో భజస్వాద్య హరిం రమాపతిం
రామం పురాణం ప్రకృతేః పరం విభుమ్ ॥
విసృజ్య మౌర్ఖ్యం హృది శత్రుభావనాం
భజస్వ రామం శరణాగతప్రియమ్ ॥

సీతాం పురస్కృత్య సపుత్రబాన్ధవో
రామం నమస్కృత్య విముచ్యసే భయాత్ ॥

రామం పరాత్మానమభావయన్ జనో
భక్త్యా హృదిస్థం సుఖరూపమద్వయమ్ ॥
కథం పరం తీరమవాప్నుయాజ్జనో
భవామ్బుధేర్దుఃఖ తరంగ మాలనః ॥

నో చేత్త్వమజ్ఞానమయేన వహ్నినా
జ్వలన్తమాత్మానమరక్షితారివత్ ।
నయస్యధోఽత్తః స్వకృతైశ్చ పాతకై
ర్విమోక్షశఙ్కా న చ తే భవిష్యతి ॥

( అధ్యాత్మరామాయణము 5-4-16 to 25 )

లంకాధిపతీ ! నీవు ఉత్తమమైన బ్రహ్మవంశములో ఉద్భవించినావు. పులస్త్యనందనుడైన విశ్రావసుపుత్రుడవు, కుబేరుని సోదరుడవు, నీవు దేహాత్మబుద్ధిచేకూడ రాక్షసుడవు కావు. ఇందెట్టి సందేహము లేదు (1)

నీవు సదా నిర్వికారుడవు, కావున యీ శరీరము, బుద్ధి, ఇంద్రియములు, దుఃఖాదులు నీవు కావు, నీగుణములు కావు వీనియన్నింటికి కారణము అజ్ఞానము. ఈ విశ్వమంతయు స్వప్నమువలె అసత్యము. (2)

నీయాత్మస్వరూపమున ఎట్టి వికారమును లేదనుట సత్యము. ఎందువలెననగా అద్వితీయమైన కారణమున ఎట్టి వికారమునుండదు. ఆకాశమంతట ఉన్నను పదార్థములగుణ దోషములచే లిప్తము కానట్లు నీవు దేహమందున్నను సూక్ష్మస్వరూపుడవు కావున దేహముయొక్క సుఖదుఃఖాదుల నంటవు. ఆత్మ దేహము, ఇంద్రియములు, ప్రాణము; శరీరము అంతయు నొక్కటియే యనుబుద్ధియే సమస్త బంధనములకు కారణమై యున్నది. (3)

నేను చిన్మయుడను, జన్మ లేనట్టివాడను, వినాశము లేనివాడను, ఆనందస్వరూపుడను అనుబుద్ధిచే జీవుడు ముక్తుడగును. పృథ్వియొక్క వికారమైన దేహము ఆత్మ కాదు ప్రాణములు వాయురూపములు, అవికూడ ఆత్మ కావు. (4)

అహంకారముయొక్క కార్యమైన మనస్సు లేదా

ప్రకృతివికారముచే ఉత్పన్నమైనబుద్ధి ఆత్మ కాజాలదు. ఆత్మ చిదానందస్వరూపము. వికారము లేనట్టిది. దేహాదుల సంఘాతముకంటె వేరుగ నున్నది. అది దేహాదులకు స్వామియై యున్నది. (5)

ఆత్మ నిర్మలము, ఎల్లప్పుడును ఉపాధిరహిత మని తెలిసికొనగనే మనుష్యుడీసంసారమునుండి ముక్తుడగును. కావున ఓమహామతీ! నేను నీకు ఆత్యంతికమైన మోక్షసాధనమును ప్రవచించెదను సావధానుడవై అవధరింపుము. (6)

విష్ణుభగవానునిశుద్ధభక్తి బుద్ధిని అత్యంతపవిత్రమొనరించును; దానిచే అత్యంతనిర్మల మగు ఆత్మజ్ఞానము లభించును; ఆత్మజ్ఞానముచే శుద్ధుడైన జీవునకు ఆత్మతత్త్వానుభవము కల్గును. దృఢమైన ఆత్మజ్ఞానబోధ గల్గిన మనుష్యుడు పరమపదప్రాప్తి నొందును. (7)

కావున నీవు ప్రకృతి కతీతుడు, పురాణపురుషుడు, సర్వవ్యాపకుడు, ఆదినారాయణుడు, లక్ష్మీపతి యగు శ్రీహరిని భజింపుము, హృదయములో గల శత్రుభావ మను మూర్ఖత్వమును వదలి వేయుము. శరణాగతవత్సలు డగు శ్రీరామచంద్రుని భజింపుము. సీతాదేవిని ముందుంచుకొని పుత్ర కళత్ర బంధు బాంధవసహితుడవై భగవాను డగు శ్రీరామునిదివ్యచరణముల నాశ్రయింపుము. దీనివలన నీవు భయమునుండి విముక్తుడవయ్యెదవు. (8)

తనహృదయములో విరాజమానుఁ డై యున్నవాఁడు, అద్వితీయుఁడు, సుఖస్వరూపుఁడు, పరమాత్మయు నగు శ్రీరామచంద్రుని భక్తిపూర్వకముగ ధ్యానమొనరింపనివాఁడు దుఃఖతరంగభరితమైన ఈసంసారసముద్రము నెట్లు దాటగలఁడు? (9)

నీవు శ్రీరామచంద్రుని భజింపనిచో అజ్ఞానరూపమైన అగ్నిలో దగ్ధమయ్యెదవు. నీ వొనరించిన యీపాపములచే భవిష్యత్తులో ఈజన్మనుండి చ్యుతుఁడవయ్యెదవు. ఇక నీకు మోక్షము అసంభవము కాఁగలదు. (10)

అసురరాజా! నేను మాటిమాటికి నిన్ను ప్రార్థించుచున్నాను. నీవు సీతను అత్యంతాదరపూర్వకముగ ముందుంచుకొని భగవంతుఁడైన శ్రీరామచంద్రునిచెంతకు పొమ్ము. ఆయన చరణారవిందములపైఁబడి నీ వొనరించిన అపరాధములను క్షమింపు మనిప్రార్థింపుము. నీవు నావాక్యములను విశ్వసింపుము. నిశ్చయముగా దయాంతరంగుఁ డగు శ్రీరామచంద్రుఁడు నిన్ను క్షమించి అనుగ్రహింపగలఁడు. ఇక నీవు లంకలో నిష్కంటకముగ సుఖముల ననుభవింపగలవు. నీలౌకికపారలౌకికజీవన ముద్ధరింపబడగలదు. నీజన్మ సఫలము కాఁగలదు. నీవు ధన్యుఁడవయ్యెదవు.

భక్తాగ్రేసరుఁ డగు శ్రీఆంజనేయనందనుఁడు దశకంఠుని శుభముకొఱ కిట్లు అమృతసదృశ మగు ఉపదేశ మొనరించుచుండెను; కాని దుర్బుద్ధి యగు రాక్షసరాజునకు దౌర్భాగ్యము

వలన ఆయుపదేశ మప్రియమయ్యెను. రావణుడు మిగుల కోపించెను. వానినేత్రములు ఎఱుపెక్కెను. శ్రీహనుమంతునితో రావణు డిట్లుపల్కెను. "వానరాధమా! దుష్టబుద్ధీ! నాసమ్ముఖమున ఇట్లు వాచాలత్వముతో పల్కు దుస్సాహస మెట్లొనరించితివి? వనవాసు లగు శ్రీరాముడు, సుగ్రీవుడు, ఏపాటిశక్తిగలిగినవారు? మొదట నేను ఇచ్చోటనే నిన్ను సంహరించెదను. తదనంతరము సీతను జంపి, తుదకు శ్రీరామ లక్ష్మణ సుగ్రీవసహితముగ సకలసైన్యమును మృత్యుముఖమున బడవేసెదను." దశకంఠునియీమిథ్యాదర్పపుపలుకులను విశుద్ధాత్ము డగు శ్రీవానరేశ్వరుడు సహింపలేకపోయెను. పండ్లు పటపటకొఱకుచు నిట్లుపల్కెను."అధముడా! రాక్షసరాజా! నీ తలపై మృత్యువు తాండవమాడుచున్నది. ఆకారణమువలనే ఇట్లు ప్రలాపము లొనరించుచున్నావు. నేను భగవంతు డగు శ్రీరామచంద్రునకు సేవకుడను. నాశక్తిపరాక్రమాదులను నీవు ఊహించనైనను ఊహింపజాలవు. నీవంటిపాపాత్ములు నన్నెదిరింపలేరు.

దురాత్ము డగు రావణుడు క్రోధాగ్నిజ్వాలలతో జ్వలించుచు కేకలుపెట్టుచు 'రాక్షసులారా! వెంటనే యీ దుష్టవానరమును వధింపుడు.' అనిఅసురసైనికుల నాజ్ఞాపించెను. వీరులైనరాక్షసులు కపీశ్వరుని సంహరించుట కుద్యుక్తులు కాగా మధురవాక్యకుశలు డగు విభీషణుడు రావణుని శాంతింప

వలసిన దని ప్రార్థించుచు ఇట్లు పల్కెను. "వీరవరుడా! లంకేశ్వరా! ధర్మమునకు వ్యాఖ్యానమొనరింపవలెనన్న, లోకాచారములను పరిపాలింపవలెనన్న, శాస్త్రీయసిద్ధాంతముల నవగతమొనరించుకొనవలెనన్న నీకంటెను సమర్థుడు మరి యొకడులేడు. కోపమును పరిత్యజించి శాంతచిత్తుడవై ఆలోచించుము. దూతను ఎక్కడైనను, ఏసమయమందైనను, ఎట్టి పరిస్థితులలోనైనను సంహరింపరా దని సత్పురుషులు నొక్కి వక్కాణించిరి. దూత మంచివాడైనను, చెడ్డవాడైనను శత్రువులచే పంపబడినవాడు కావున యాతడు శత్రువర్గమునే కొనియాడును. దూత ఎల్లప్పుడు పరాధీనుడు, కావున వానికి మృత్యుదండన విధింపరాదు. దూతయొక్క అవయవములను ఖండించుట మొదలగు ఇతరదండనలను విధింపవచ్చును.

తనతమ్ముడైన విభీషణుడు దేశకాలమున కుపయుక్తముగ హితవచనములను బల్కగా రావణుడు శాంతించి యిట్లు పల్కెను. "విభీషణా! నీవు చెప్పినది బాగుగనున్నది. వీనికి మరణదండనముదక్క అన్య మగు శిక్షను విధించు టత్యంతము ఉచితము. వానరులకు వానివాలము ప్రియము: వాలమే వారి కాభూషణము, కావున వీనివాలమును తగులబెట్టుము. ఈ వానరుడు తనస్వామి చెంతకు జని స్వయముగ వానిని మృత్యుముఖమునకు తోడ్కొనిరాగలడు.

దుష్టు డగు దశాననుడు అసురగణము నిట్లాజ్ఞాపించెను

"దైత్యవీరులారా! ఈవానరుని దూషించుచు లంకానగర మంతయు దిప్పి, తుదకు వీనివాలమునకు నిప్పుబెట్టుడు."

## లంకా దహనము

సత్వగుణసంపన్నుడు, పరమపరాక్రమవంతుడు, కపికుంజరుడు నైన శ్రీఅంజనానందవర్ధనుడు శ్రీరామకార్యమును పరిపూర్ణ మొనరించుటకు తనదివ్యరూపమును దాచియుంచెను. లంకాధిపతి యగు రావణునియాజ్ఞానుసారముగ రాక్షస యోధులు అనేకవస్త్రములను దెచ్చి వానిని నేతిలో ముంచి హనుమంతునివాలమునకు జుట్ట నారంభించెను. దుష్టు డగు దశాననునియాజ్ఞాపాలకు లైన అసురులు హనుమంతుని వాలమున కెన్నివస్త్రములను జుట్టినను అది పొడవగుచునే యుండెను. కపీశ్వరునియాక్రీడవలన లంకానగరములోని వస్త్రములకు, ఘృతమునకు కరవేర్పడును; కాని రాక్షసులు లంకానగరములో వెదకివెదకి వస్త్రములను దెచ్చి ఘృతములో తడిపి శ్రీఆంజనేయునివాలమునకు జుట్టి వానిని పగ్గములతో బంధించిరి.

దృఢ మగు రజ్జువులతో కట్టబడిన శ్రీకపికుంజరు డగు శ్రీకేసరికిశోరుని రాక్షసులు పట్టుకొని సంతోషముతో తీసుకనిపోవదొడంగిరి. వారు భేరీమృదంగాదులను మ్రోగించుచు

శ్రీహనుమంతు డొనరించిన అపరాధములను వర్ణించుచు రాజమార్గములందు త్రిప్పదొడంగిరి. శత్రుదమనుడగు శ్రీహనుమంతుని వెనుక అసురులు, అసురబాలకులు చప్పట్లు చరచుచు వానిని దూషింపనారంభించిరి. కొందఱు శ్రీపవనాత్మజునిపై రాళ్ళు వేయగా మఱికొందఱు పిడికిళ్ళతో గ్రుద్దనారంభించిరి; కాని బుద్ధిమంతు డగు శ్రీహనుమంతుడు తన ప్రభువుయొక్క కార్యసిద్ధికొఱకై కించిన్మాత్రమైనను బాధనొందక వారు పెట్టు యాతనల నన్నింటిని ప్రసన్నతాపూర్వకముగ సహించెను. రాత్రికాలమందు శ్రీహనుమంతుడు లంకానగరదుర్గనిర్మాణమును సాంగోపాంగముగ దర్శింపలేకపోయెను: కాని యిపుడు రావణుడు విధించిన యీదండనవలన లంకానగరమంతయు తిరుగుచు సావధానముగ పరికింపనారంభించెను. ఆనగరములో అద్భుతములైనపురములను, సుందరము లగు అట్టాలికలను, సుందరగృహాపంక్తులతో ఆవృతమైయున్న మార్గములను, ప్రఖ్యాతము లగు రాక్షసులనివాసములను, సైనికస్థావరములను, మహత్త్వపూర్ణము లగు ప్రదేశములను శ్రీహనుమంతుడు చూచెను.

రాక్షసులు కపీశ్వరుని బంధించి లంకానగరమంతయు త్రిప్పిరి. తనివిదీర దూషించిరి. తుదకు వారు శ్రీహనుమంతుని ఒకకూడలియందు నిలిపి ఆనందోత్సాహములతో అట్టహాసముల నొనరించుచుండిరి. అదేసమయములో ఒకప్రముఖుడైన

అసురవీరుడు వాలమునకు నిప్పుబెట్టెను. వాలమున అగ్ని రగుల్కొనగనే రాక్షసులు, రాక్షసస్త్రీలు హర్షాతిరేకముచే నృత్యమొనరించుచు కరతాళధ్వనులు చేయదొడంగిరి.

బలబుద్ధినిధానుడైన హనుమానుని యుద్దేశ్యము పరిపూర్ణమయ్యెను. ఆయన తనయాకారమును తగ్గించుకొనినంతనె అసురులు చేసిన బంధనములు జారెను. శ్రీపవనకుమారుడు బంధవిముక్తుడై తనబృహద్రూపమును ధరించెను. ఆయన మండుచున్న తనవాలమును గిరగిర త్రిప్పనారంభించెను. వాలముతో రాక్షసులను మోదుచుండగా ఆహఠాత్పరిణామమునకు వారు ఆశ్చర్యముతో భయభ్రాంతులైరి, శ్రీహనుమంతుని వాలాఘాతము వజ్రఘాతసదృశముగ వారికి దోచెను. బాలకులు, యువతీయువకులు, వృద్ధులు నగు రాక్షసులందఱు భయముతో పారిపోవదొడంగిరి. కాని వారెచ్చోటకు పరుగిడినను అచ్చోటకు వారిని ప్రజ్వలించు వాలము వెంటాడి మోదనారంభించెను. అగ్నిజ్వాలలలో చిక్కి అసురులు మరణింపసాగిరి. ఇట్లు ఆప్రదేశమందున్న రాక్షసులనందరిని సంహరించి శ్రీహనుమంతుడు లంకానగరములో గల యెత్తయిన అట్టాలిక పైకెగిరెను.

శ్రీహనుమంతుని వాలమునకు నిప్పంటించిన విషయమును కొందఱు రాక్షసస్త్రీలు పరుగుపరుగున సీతకడకు పోయి పల్కిరి. "జానకీ! నీతో మాడలాడిన వానరమును బంధించి

అవమానపరచుచు లంకానగరమంతయు త్రిప్పి వాని వాలమునకు నిప్పుబెట్టిరి."

ఈవృత్తాంతము నాలకింపగనే సీతాదేవి కంపించెను. ఆమె తల యెత్తి చూడగా లంకానగరము అగ్నిజ్వాలలతో మండుచుండెను. ఆమె వ్యాకులచిత్తయై అగ్నిదేవు నిట్లు ప్రార్థించెను. "అగ్నిదేవా! నేను నా ప్రాణనాథునకు సేవకురాలనైనచో, నాలో పాతివ్రత్యము తపము నున్నచో పవనపుత్రుడగు శ్రీహనుమంతునకు నీవు శీతలత్వమును ప్రసాదింతువుగాక!" పతివ్రతాశక్తి అతులనీయము, సాధ్వి తలంచినచో సకలసృష్టి స్తంభించును. సీతాదేవి పతివ్రత మాత్రమే కాక సకలసృష్టి కధిష్ఠాత్రి, జగజ్జనని, మూలప్రకృతి, ఈశ్వరి. ఆమె యిట్లు ప్రార్థింపగనే అగ్నిదేవుడు శ్రీ హనుమంతుని యెడల శీతలత్వము ధరించెను. అగ్నిశిఖలు ప్రదక్షిణ మొనరించుచున్నట్లు శ్రీహనుమంతునకు గోచరింపగా ఆశ్చర్య చకితుడై యిట్లాలోచించెను. ఆహా! అగ్నియొక్క గుణము జ్వలించుట. అగ్నిస్పర్శచే గొప్ప భవనములే బూడిదయగుచున్నవి. కాని నా కెట్టి తాపము కలుగకపోగా చల్లదనము ననుభవించుచుంటిని. నిశ్చయముగ ఈ వైచిత్ర్యమునకు సీతాదేవియనుగ్రహమో, శ్రీరామచంద్రుని ప్రభావమో, నా తండ్రికి అగ్నిదేవునకు గల స్నేహమో కారణము కావచ్చునని తోచుచున్నది.

"జయ శ్రీరామ జయ శ్రీరామ" యనుచు హను
మంతు డొక భవనము పైనుండి మరియొక భవనము పైకెగురుచు
లంకకు నిప్పుబెట్టెను. ఆయన యొనరించిన భీషణ గర్జనము
లకు ఆకాశము ప్రతిధ్వనించెను. దానివలన అసురులు ప్రాణము
లను గోల్పోయిరి. అసురపత్నుల గర్భములు పతనమయ్యెను.
మహావీరు లగు రాక్షసుల హృదయములు కంపించెను. ఇట్లు
"జయ శ్రీసీతారాం" అనుచు మైనాక వందితుడు, మహావేగ
వంతుడు నగు కపీశ్వరు డెగురుచు ప్రహస్తుని మందిరము పైకి
జేరి దానికి నిప్పుపెట్టి అచటనుండి మహాపార్శ్వుని గృహమును
తగులబెట్టి క్రమముగ వజ్రదంష్ట్ర, శుక, సారణ, మేఘనాథ,
జంబుమాలి, సుమాలి మొదలగు అసురశ్రేష్ఠుల నివాసములను
బూడిదగ నొనరించెను. ప్రజ్వలిత భయంకరాగ్ని జ్వాలలతో
అరుణవర్ణముతో ప్రకాశించు శ్రీమారుతాత్మజుడు ప్రత్యక్ష
కాలస్వరూపునిగ గోచరించెను. భయముతో వణకుచున్న
అసురులు ఆయనవైపు చూచుటకైనను సాహసింపలేకపోయిరి.
అత్యంత వేగశాలి యగు కపీశ్వరునిలో అద్భుతమగు స్ఫూర్తి
కలదు. ఆయన ఒకసౌధమునుండి మఱియొక సౌధముపైకి
దుముకుచు గవాక్షములగుండా ప్రవేశించి తనవాలముతో
శీఘ్రముగ నిప్పుపెట్టుచుండెను. ఆయన సర్వత్ర చరించుచు
విలయతాండవ మొనరించెను. శ్రీహనుమంతు డెచ్చోట
నున్నాడో తెలిసికొనుట వారికి కఠినమయ్యెను. వారు
సర్వత్ర మర్కటాధీశ్వరు డగు శ్రీహనుమంతుడు నిప్పుపెట్టు

చున్నట్లు గాంచిరి. ఒక హనుమంతుడే యున్నాడా? లేక అసంఖ్యాకముగ నున్నారా యని రాక్షసులు భ్రమపడిరి.

ఇట్లు శ్రీహనుమంతుడు, రశ్మికేతువు, సూర్యశత్రువు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, రణోన్మత్తుడు, భుజగ్రీవుడు, భయానకుడు, విద్యుజ్జిహ్వుడు, హస్తిముఖుడు, కరాళుడు, విశాలుడు, శోణితాక్షుడు, మకరాక్షుడు, నరాంతకుడు, కుంభుడు, దురాత్ముడు, నికుంభుడు, యజ్ఞశత్రువు, బ్రహ్మశత్రువు మొదలగు ప్రముఖులైన రాక్షసవీరుల భవనములను, అశ్వశాలలను, గజశాలలను, అస్త్రాగారములను, సైన్యశిబిరములను తగులబెట్టెను.

ఆ సమయములో కుమారుని కార్యమునకు సహాయమొనరించుటకై వాయుదేవుడు తన వేగమును తీవ్రము చేసెను. వాయువేగమునకు అగ్ని అధికముగ ప్రజ్వరిల్లుచు సర్వత్ర వ్యాపింపసాగెను. బంగారము, వెండి, రత్నాదులతో నిర్మించిన భవనములు మంటలకు కరగి భూమిపై ప్రవహించెను. లంకా నగరములో గల స్త్రీ పురుషులు, బాలకులు, వృద్ధులు మొదలగు అసురులందరు మంటలకు తాళలేక 'రక్షింపుము రక్షింపు'మనుచు, ఆక్రందించుచు అటునిటు పరుగిడ దొడంగిరి. లక్షలాది రాక్షసులు ఆ ప్రచండమగు అగ్నిజ్వాలలలో పడి మరణించిరి. మిగిలినవారు ప్రాణముల నరచేతబట్టుకొని పారిపోయిరి. అన్నములు, వస్త్రములు, ఆభూషణములు, గజ

తురగాదులు, అస్త్రములు మొదలగునవన్నియు అగ్నిలోబడి మండుచుండెను. తమ ప్రాణములను తాము రక్షించుకొనుటకు ప్రయత్నించుచున్న దానవులు వాటిని రక్షించుటకెట్టి ప్రయత్నము చేయలేకపోయిరి. అనాథవలె, అసహాయురాలివలె రావణునిలంకానగరము అగ్నిజ్వాలలలో బడి భగభగ మండనారంభించెను. పశువులు, స్త్రీలు, బాలకులు రోదించుచుండగా త్రైలోక్యవిజయులైన అసురులు అగ్నిని నివారింపలేక అసహాయులవలె చూచుచుండిరి. అగ్ని శాంతించిన గృహములకు పవననందనుడు మరల నిప్పుపెట్ట నారంభించెను. ఆయన లంకపై నెగురుచు లంకానగరదహన కార్యక్రమమును పర్యవేక్షించెను.

తన మహత్తరమగు భవనము అగ్నికి ఆహుతి యగుట గాంచిన దశగ్రీవుని హృదయము కంపించెను. అయినను తన మనోగతభావములను దాచుకొని ఆతడు శ్రీ ఆంజనేయుని బట్టి వధింపవలసినదిగ రాక్షసుల నాజ్ఞాపించెను.

ప్రభువు నాజ్ఞ నాలకింపగనే మేఘనాదాది వీరులు శస్త్రములను ధరించి హనుమంతుని బట్టుటకు సమావేశమైరి. వారెచ్చోట దృష్టిసారించిన అచ్చోట కాలస్వరూపుడైన శ్రీహనుమంతుని భయంకరమూర్తి కనబడసాగెను. జ్వలించుచున్న శ్రీపవనాత్మజునివాలము వజ్రతుల్యము, సుదీర్ఘము. ఎందఱో రాక్షసవీరులు వాలముపై కలియబడిరి. వారందఱు

వాలాఘాతములకు గురియై అసువులను బాసిరి. ప్రబలమగు ప్రభంజనముయొక్క, భయంకర మగు అగ్నిజ్వాల యొక్క నడుమ అసహాయులగు అసురులు శ్రీఆంజనేయు నెదిరింప లేకపోయిరి. వారు రావణునియెదుట విషణ్ణవదనులై తమ యశక్తతను ప్రకటించుకొనిరి.

లోకపాలకులు, దేవతలు మొదలగు వారందఱు రావణునకు వశులై యుండిరి. వారినందరిని శ్రీఆంజనేయుని నిర్జించుట కా రాక్షసరాజు పంపెను. లంకను దహించుచున్న శ్రీహనుమంతుడు యముని తన నోటితో పట్టుకొని దేవతలను వాలముతో మోదెను. ఆ మహావీరునిధాటికి వారు నిలువ లేక పలాయనము చిత్తగించిరి. యముడు శ్రీఆంజనేయునిచే బంధింపబడెను. సృష్టికార్యములు స్తంభించెను. అపుడు దేవతాసహితుడై హంస నధిష్ఠించి చతుర్ముఖుడైన బ్రహ్మ ఆ ప్రదేశమున కేతెంచి శ్రీహనుమంతుని ప్రార్థించెను. శుభ ప్రదాతయగు శ్రీహనుమంతుడు యముని తనదంష్ట్రముల బంధమునుండి ముక్తుని గావించెను. యముడు ఆ కాలమూర్తిని అనేక విధముల ప్రార్థించి నీ భక్తుల సమీపమునకు పోజాల నని ప్రతిజ్ఞ చేసెను.

చివరకు రావణుడు మేఘములను లంకానగరముపై వర్షింపవలసినదిగ ఆజ్ఞాపించెను. మేఘములు గుంపులు గుంపులుగ వెడలి మండుచున్న లంక పైజేరి ఘోరముగ వర్షింపనారం

భించెను, కాని శ్రీహనుమంతుడు రగిల్చిన అగ్నిజ్వాల లా వర్షముచే మరింతగ ప్రజ్వరిల్ల నారంభించెను. జలధారలు ఘృతమువలె ఆ యగ్నికి సహాయమొనరించెను.

విచిత్రమైనదశ. మేఘము లెంతగ వర్షించినను ఈ విప రీతమగు పరిణామమును గాంచి అవి శుష్కములై యిట్లు ఆక్రందన మొనరింప నారంభించెను.

దోహా॥ ఇహా జ్వాల జరే జాత,
సూఖే సకుచాత సబ, కహత పుకార హై।
జుగ షట భాను దేఖే, ప్రళయ కృసాను దేఖే.
శేషముఖ అనల విలోకి బార బార హై॥
'తులసీ' సున్యో న కాన సలిలు సర్పి సమాన,
అతి అచిరిజు కియో కేసరీకుమార హై।
బారిద బచన సుని ధున సాప సచివన్హా,
కహై దససీస! 'ఈస బామతా వికార హై'॥
(కవితావళి 5-20)

మేము ద్వాదశసూర్యులను జూచితిమి, ప్రళయాగ్నిని దర్శించితిమి. ఎన్నోపర్యాయములు ఆదిశేషుని ముఖమునుండి బయల్వెడలు జ్వాలలనుగూడ గాంచితిమి; కాని జలములు ఘృతమువలె పరిణామముచెంది అగ్నిని ప్రజ్వరిల్లజేయుట యెపుడును గాంచలేదు, వినలేదు. ఆశ్చర్యకర మైన విషయ మును శ్రీ కేసరీనందనుడు మాత్రమే చేసి చూపించెను.

మేఘముల వచనముల నాలకించి రావణుని మంత్రులు తలలు త్రిప్పినవారై వానితో నిట్లుబల్కిరి. ఇదియంతయు ఈశ్వరుని యెడల ప్రతికూలతకు ఫలము.

సువర్ణమయ మగు లంక భగభగ మండుచుండెను. లంకానగరవాసులు ఆక్రందనల నొనరించుచుండిరి; కాని వారలను రక్షించువా రెవ్వరు లేకపోయిరి. మండోదరి మొదలగు రాణులు రోదించుచు పరస్పరమిట్లు పల్కిరి.'' జానకీదేవిని శ్రీరాముని చెంతకు బంపుమని, ఆయనతో వైరము వలదని, మే మెన్నిపర్యాయములో రావణుని ప్రార్థించితిమి. కాని అహంకారవశుడై ఆతడు మా మొరల నాలకింపలేదు. ఇపు డాతనిబలము, సైన్యము, ప్రతాపము ఏమైనవి? ఒక దొంగ వలె ముఖమును దాచుకొని మూల కూర్చుండెను. ఇక మమ్ముల రక్షించువారెవ్వరు''? ఈ ప్రకారముగ బాలకులు, వృద్ధులు, స్త్రీపురుషు లెచ్చటివారచ్చట విలపింప నారంభించిరి. ఈ లంకాదహనకాండలో అనేకభవనములు, రాక్షససమూహములు గజతురగరథాదులు, పశుపక్షి వృక్షాదులు మాడి మసియయ్యెను. మిగిలినవారు దీనులై గోడుగోడున విలపింప సాగిరి.

లంకను తగులబెట్టుచు మహాపరాక్రమవంతుడైన శ్రీ హనుమంతుడు తనమనస్సులో పరమప్రభువైన శ్రీరామచంద్రునే స్మరించుచుండెను. మర్కటాధీశ్వరు డొనరించుచున్న

ఈయద్భుతము, అప్రమేయము నగు లంకాదహనకార్యక్రమ
మును గాంచి దేవతలు, మహర్షులు, గంధర్వులు, విద్యాధరులు,
నాగులు, యక్షులు మొదలగు ప్రాణులంద రత్యంత ప్రసన్నులైరి.
దేవతలు శ్రీహనుమంతు ననేకవిధముల స్తుతించిరి.

లంకాధిపతి యగు రావణుడు సూర్యకుమారు డైన
శనైశ్చరుని బంధించెను. ఆ కారాగారము శ్రీహనుమదీశ్వరుని
పదఘట్టమునకు శిథిలముకాగా హనుమ శనైశ్చరుని దర్శించి
రావణు డొనరించిన దుష్కృత్యములను జెప్పెను. అపుడు
శనైశ్చరుడు ముక్తిదాత యగు శ్రీహనుమంతుని ప్రార్థించి
లంకకు సర్వనాశనము దాపురించిన దనిపలికి భస్మముకాగా
మిగిలిన లంకానగరముపై తన దృక్కులనుసారించెను. ఆ దృష్టి
పాతముచే ఒక్క విభీషణుని గృహముదక్క మిగిలిన లంక
యంతయు భస్మమయ్యెను.

లంకానగరములో గల సైనిక కేంద్రములు, యుద్ధోప
కరణములు నశించుటను, చావగా మిగిలిన అసురులు ఆక్రంద
నముల నొనరించుటను, అతులితబలధాము డగు శ్రీపవన
కుమారుడు చూచెను. అపు డాయనకు సీతాదేవి జ్ఞప్తికి
వచ్చెను. విభీషణుని గృహముదప్ప లంకయంతయు భస్మ
మయ్యెను; కాని జానకి ఎట్లున్నదో యని విచారించెను.
ఇట్లు చింతించి శ్రీహనుమంతుడు విశాలసముద్రమును జేరి
తనవాలము నావరించియున్న మంటల నార్పుకొనుచుండెను.

అపుడు మహాత్ములైన చారణు లిట్లుపల్కిరి. పవనకుమారు డగు శ్రీహనుమంతుడు స్వర్ణమయ మగు లంకకు నిప్పుబెట్టి గొప్ప దుస్సాహస మగు కార్యమును జేసెను. గృహములను వీడి పారిపోయిన రాక్షసులు, స్త్రీలు, బాలకులు, వృద్ధులు దుఃఖించుచు లంకానగరమును వీడిరి. లంకానగర మంతయు అగ్నిజ్వాలలో బడి భస్మమయ్యెను. కాని శ్రీరామచంద్రు నర్ధాంగి యగు సీత సురక్షితముగ నుండుట పరమాశ్చర్యకర మైనవిషయము. చారణులు పల్కిన యీ మధుర వచనముల నాలకింపగనే శ్రీహనుమంతుని హృదయావేదనము దూర మయ్యెను.

## సీతాదేవికడ సెలవు దీసికొనుట

హర్షాతిరేకముచే శ్రీహనుమంతునినోటినుండి 'జయ జయ శ్రీసీతారాం' అను జయధ్వని బయల్వెడలుచుండెను. ఆయన తీవ్రగతితో పరుగుపరుగున జానకిని దర్శించుటకు బయలుదేరెను. శ్రీఆంజనేయుడు కుశలమేనా ? యనెడి చింతతో జానకి కూర్చొనియుండెను. శ్రీపవనకుమారుడు పరుగుపరుగున ఆ ప్రదేశమునకు జేరి "అమ్మా! అమ్మా" యనుచు సీతాదేవిచరణకమలములపై తనశిరము నుంచెను. తల్లి హృదయమునుండి వాత్సల్యరసము పొంగి ఆమె నేత్ర ములు సజలములయ్యెను. ఆమె పరమభాగ్యవంతు డగు శ్రీ ఆంజనేయుని శిరముపై తన యభయ కరారవిందము నుంచెను.

అత్యంతస్నేహముతో సీతాదేవి యిట్లు ప్రశ్నించెను. "కుమారా! నీవు కుశలముగ నుండుట గాంచి వ్యాకులమగు చున్న నామనస్సు శాంతించినది. నీయవయవములు దగ్ధము కాలేదా? శ్రీపవనాత్మజుడు తల్లి యొక్క సహజ స్నేహమును బొంది పులకితుడై యిట్లుపల్కెను. "జననీ! పరమపావనము, అభయప్రదమునగు నీకరకమలము నాశిరముపై నుండగ ఈ త్రిభువనములలో నా కెట్టిహానియు సంభవించునా? నీకరుణ వలన నే నీలంకానగరమునకు వచ్చినకార్యము సిద్ధించినది. నేను నీదివ్యపారవిందములను దర్శించితిని. లంకానగరరహస్యములను గ్రహించితిని; రాక్షసుల శక్తియుక్తులు నాకవగతమయ్యెను. లంకయందు గల కీలకప్రదేశములను బాగుగ పరికించితిని. అమ్మా! నీ విక కృపతో నాకు అనుజ్ఞను ప్రసాదింపుము. నే నీక్షణమందే ప్రభువుయొక్క చరణములచెంతకు చేరుకొని నీసందేశమును వినిపించెదను. సర్వసమర్థుడు, కరుణానిధానుడు నగు ప్రభువు శీఘ్రముగ లంకను ప్రవేశించి క్రూరులగు ఈయసులను సంహరింపగలడు."

వైదేహి నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించెను. ఆమె యెంతో బాధతో నిట్లుపల్కెను. "కుమారా! నీ యాగమనముచే నాకొకింత ఆధారము దొరికెను. నీవుకూడ ప్రయాణమగుచున్నావు. నీవు మరలిపోయిన పిమ్మట నా కిక ఆదుఃఖపు దినములు, రాత్రులు సంప్రాప్తించును. వత్సా! నీవు ఒకింత

డస్సినచో ఈ ప్రదేశమందు ఏదోయొక స్థావరమందు దాగి విశ్రాంతి దీసికొనుము. నేడు విశ్రమించి రేపు పొమ్ము".

అత్యంత శ్రద్ధాభక్తులతో పవనాత్మజు డిట్లు నివేదించెను. తల్లీ ! ప్రభువు కార్యము పరిపూర్ణము కాకుండగ నాకు విశ్రాంతి యెక్కడ? నీ యమోఘ మగు ఆశీర్వాదము నాకు కలదు. నేను ఏవేగముచే నిచ్చోట కేగుదెంచితినో, అదే వేగముతో సముద్రమును దాటి ఆవలియొడ్డును జేరెదను. అచ్చోట కోటానుకోట్ల వానరభల్లూకవీరులు నాకొఱకై నిరీక్షించుచున్నారు. నీశుభసమాచారము నాలకింపగనే వారికి ప్రాణములు తిరిగివచ్చును. తదుపరి వానరసైన్యముతో ప్రభువు ఈప్రదేశమునకు రాగలడు. మీరిర్వురు దివ్యసింహాసనముపై అధిష్ఠించియుండగ దర్శించి మాజన్మములను చరితార్థ మొనరించుకొనగలము.

సీతాదేవి ఆప్యాయతతో నిట్లుబల్కెను. "కుమారా! నామనస్సులో నొకసందేహము ఇప్పటివరకును తొలగిపోలేదు. ఈవిశాలసాగరమును దాటగల సమర్థులీవిశ్వములో ముగ్వురకు కలదు. నీకు, గరుత్మంతునకు, వాయుదేవునకు. ఇక యీవానర భల్లూకముల సహాయమున్నను మహాబలశాలియగు సుగ్రీవుడం ఈదుర్లంఘ్య మగు మహాసముద్రము నెట్లు దాటగలడు ? ఆ విశాలసైన్యముతోను శ్రీరామానుజునితోను గూడి శ్రీరాముడు ఎట్లీదరి కిరాగలడు ?

వినయపూర్వకముగ శ్రీహనుమంతు డిట్లుపలికెను. "జననీ! ఈవానర భల్లూకముల శక్తి ఏపాటిది? వీరు ఒకచెట్టు కొమ్మనుండి మరియొక కొమ్మపైకి గెంతగలరు; కాని పరమ ప్రభు వగు శ్రీరామచంద్రుని దివ్యశక్తివలన సర్వము సంభవ మగును. ఆయనదయ గల్గినచో ఒకక్షుద్రసర్ప మైనను మహా బలవంతు డగు గరుత్మంతుని సహితము మ్రింగివేయగలదు. అవిటివాడు ఆకాశమునంటు పర్వతములైనను దాటుటకు సమర్థుడగును. అవాఙ్మానసగోచరుడును, అచింత్యుడును నగు శ్రీరామచంద్రుని దర్శింపగనే సముద్రుడే స్వయముగ మార్గము నీయగలడు. సముద్రుడు మార్గము నీయక విలంబ మొనరించినచో వానిని శుష్కింపజేయుటకు సుమిత్రానంద నుని బాణ మొకటిచాలును. ఇక వానరేశ్వరుడైన సుగ్రీవుడు కోట్లకొలది వానరభల్లూక యోధులతో కదలివచ్చును. ఆ మహాశక్తిసంపన్నుడైన కపీశ్వరుడు శ్రీరామచంద్రుని యాజ్ఞా పరిపాలకుడు. ఆప్రభువు నిన్నుద్ధరించెదనని ప్రతిజ్ఞబూనెను. శ్రీరామచంద్రునిచెంత సకలసాధనములు కలవు. నీవు ధైర్య మునువహింపుము. నా ప్రభువు వెంటనే యీ ప్రదేశమున కేతెంచి నిన్నుద్ధరింపగలడు. శ్రీఅంజనీనందనుని సమాధాన మును విని సీతాదేవి ప్రసన్నురాలయ్యెను. ఆమె గద్గదమగు కంఠముతో నిట్లుపలికెను. "కుమారా! నాథుని చరణార విందములకు నాప్రణామములను నివేదింపుము. దయనీయ మగు నాస్థితిని ఆయనకు విన్నవింపుము. వెంటనే నన్నుద్ధరించుటకు

రావలసినదిగ అంజలి ఘటించి ప్రార్థింపుము. నేను ప్రతి క్షణము శ్రీరామచంద్రుని నిరీక్షణములోనే జీవించుచుంటిని. రావణుడు పెట్టిన గడువు సమాప్తమైన మరుక్షణము నా ప్రాణము లాగవు.

సీతాదేవి నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించు చుండెను. ఆమె వానిని తుడిచివేయుచు ధైర్యపూర్వకముగ తన ప్రాణనాథునకు సందేశము నిచ్చుచు మధ్యలో నిట్లు పల్కెను. "కుమారా! స్నేహపాత్రుడగు నామరదితో నన్ను క్షమింపవలసినదిగ చెప్పుము. నాయాశీర్వచనము నాతని కందింపుము. వానరరాజగు సుగ్రీవునకు, జాంబవంతు నకు, యువరాజైన అంగదుడు మొదలగువారికి నాయాశీస్సుల నందింపుము. నేను మీతో గలసి వచ్చుచున్న శ్రీరామ చంద్రునికొఱకై అనుక్షణము నిరీక్షించుచుంటి నని పల్కుము." ఇట్లు పల్కి అరవిందలోచన యగు సీత దుఃఖముచే పమిట చెంగుతో ముఖమును గప్పుకొనెను.

తల్లియొక్క యీదయనీయమగు పరిస్థితిని గాంచగనే మహావీరుడగు శ్రీహనుమంతుని ధైర్యముసహితము సన్న గిల్లెను. దుఃఖము పెల్లుబుగా ఆయన వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను. ఎంతో కష్టముతో తన్నుతాను సంబాళించు కొని యిట్లుపల్కెను. "అమ్మా! నీవు ధైర్యమును వహింపుము. నేను అవలకు జేరగనే నిన్నుద్ధరించుటకు ప్రభువు బయలుదేరి

రాగలడు.” కొంచెమాగి ధైర్యముతో శ్రీహనుమంతు డిట్లు బల్కెను. “జననీ! శ్రీరామచంద్రుడు నీకొఱకై ముద్రికను పంపినట్లుగ నీవుకూడ ఒకచిహ్నము నిమ్ము. దానిని నేను ప్రభువునకు చూపింపగలిగెదను.”

సీతాదేవి తన కేశపాశమునుండి చూడామణిని బయటకు తీసి శ్రీపవనాత్మజున కిచ్చుచు నిట్లుబల్కెను. “వత్సా! ఈ చూడామణిని గాంచగనే ఆర్యపుత్రుడు లక్ష్మణుడు, నిన్ను విశ్వసింపగలరు. నిన్ను విశ్వసించుటకు నీకొక రహస్యమును చెప్పెదను. దానిని నాప్రాణనాథునకు నివేదింపుము. ఇది చిత్ర కూట పర్వతముపై జరిగిన సంఘటన. ఒకదినమున నా జీవన సర్వస్వ మగు శ్రీరామభద్రుడు నాయొడిలో శిరము నుంచి నిద్రించుచుండెను. ఆ సమయములో ఇంద్రకుమారు డగు జయంతుడు వాయసవేషమును ధరించి మాంసలోభియై ఎఱ్ఱని నాకాలివ్రేళ్ళను తన తీక్ష్ణమగు ముక్కుతో పొడవనారంభిం చెను. ప్రభువునకు నిద్రాభంగము కాగా జరిగినది గాంచి ఎదురుగ నున్న రక్తసిక్తముఖముగల వాయసమును జూచి కోపించినవాడై ఒకతృణమును తీసికొని దివ్యాస్త్రముగ జయంతునిపై ప్రయోగించెను. కాకరూపమున నున్న జయం తుడు భయమునొంది పలాయనము చిత్రగించెను. దివ్యా స్త్రము వానిని వెంటాడెను. జయంతుడు బ్రహ్మాది దేవతలను శరణువేడగా ఆ శ్రీరామచంద్రునకు వ్యతిరేకముగ వారాశ్రయ

మును ఈయలేమనిరి. తుదకు 'రక్షింపుము, నాయపరాధమును క్షమింపు'మనుచు ప్రభుచరణముల నాశ్రయించెను. ఆ యస్త్ర మమోఘము; అందువలన జయంతుడు తన యెడమ కంటిని సమర్పించి ప్రాణములను రక్షించుకొనెను. శరణాగత వత్సలు డగు ప్రభువును అనేకవిధముల ప్రార్థించినవాడై నిజ ధామమున కేగెను. కుమారా! అచింత్యమగు శక్తిసంపన్నుడగు ప్రభువును శీఘ్రమే రావలసినదిగ ప్రార్థింపుము.

శ్రీఆంజనేయుడు సీతా దేవి చరణారవిందములపై శిరము నుంచి "తల్లీ! నా కనుజ్ఞని"మ్మని ప్రార్థించెను.

సీతాదేవి నేత్రములు మరల అశ్రుపూరితములయ్యెను. కండ్లను తుడుచుకొనుచు ఆమె "కుమారా! హనుమాన్! వెంటనే వెళ్ళుము. ప్రభువును దోడ్కొని శీఘ్రముగ తిరిగి రమ్ము. విలంబన మొనరింపకుము. నీకు శుభమగుగాక!" యని పల్కెను.

సృష్టిస్థితిసంహారకారిణి యగు సీతాదేవివలన ఆశీర్వాదమును పొంది, శ్రీరామచంద్రుని చరణారవిందములను మనమునందు స్మరించుకొనుచు శ్రీహనుమంతుడు ఎగిరి అరిష్టగిరిపైకి జేరెను. ఆ విశాలశైలముపై నిలువబడి వాయునందనుడు, కపిశ్రేష్ఠుడు నైన శ్రీహనుమంతుడు తన శరీరమును పెంచెను. ఆయన దక్షిణమునుండి ఉత్తరదిశగ సముద్రమును దాటుటకు

వేగముగ ఆకసమున కెగిరెను. ముప్పది యోజనముల యెత్తు, పది యోజనముల వెడల్పు కలిగిన శోభాయుతమైన ఆ మహీధరము శ్రీ ఆంజనేయుని పదఘట్టనముచే వృక్షశిఖర సహితముగ భూమిలోనికి కుంగిపోయెను.

అరిష్టగిరినుండి గగనతలమున కెగిరినవాడై మహాబలవంతుడు, వజ్రాంగుడు నైన శ్రీహనుమంతుడు భయంకరముగ గర్జించెను. ఆభీషణ గర్జనమునకు దిశలు కంపించెను. ఆకసము విదీర్ణమయ్యెను; మేఘములు అటునిటు చెదరిపోయెను. సముద్రతరంగములు ఆకసమునకు లేచెను. గిరిశృంగములు భగ్నమై దొర్లదొడంగెను. అదియిది యననేల! లంకానగరమంతయు కదలిపోయెను. భూకంపము వచ్చినదా యని అసురులెక్కడివా రక్కడనే యుండి కంపింప దొడంగిరి. గర్భవతులగు రాక్షసస్త్రీలకు గర్భపాతమయ్యెను. సభలో సభాసదుల మధ్యలో సింహాసనము నధిష్ఠించియున్న దశకంఠు డాతాకిడికి సింహాసనము పైనుండి క్రిందపడెను. రత్నమయ మగు వాని కిరీటము శిరమునుండి జారిపడెను. ఇట్లనేకములైన అపశకునములను గాంచి అసురులు రాబోవు వినాశనమును గుఱించి చర్చించుకొనుచుండిరి. అందఱియందు భయము, ఉదాసీనత వ్యాపించెను

సముద్రమధ్యమున నున్న పర్వతరాజగు సునాభుని (అనగా మైనాకుని) స్పృశించినవాడై అత్యంతవేగశాలి యగు

పవనకుమారుడు ధనుస్సునుండి వదలిన బాణమువలె సముద్రమున కావల నున్న తటమును చేరెను. మహేంద్ర పర్వతమును గాంచగనే శ్రీ ఆంజనేయుడు గంభీరమగు స్వరముతో అనేక పర్యాయములు గర్జించెను.

## సముద్రమున కావలి యొడ్డునకు చేరుట

లంకాదాహకుడు డగు శ్రీ కపీశ్వరుని సింహనాదము నాలకించి సముద్రమునకు ఆవలి తటమునం దున్న కోటాను కోట్ల వానర భల్లూకవీరులు సంతోషముతో కిలకిలారవముల నొనరించుచు, ఎగురుచు నృత్యమొనరించిరి. శ్రీ హనుమంతుడు సీతాదేవిని దర్శించి తిరిగి వచ్చుచున్నాడని వారికి విశ్వాసము కలిగెను. శూరులు, వీరులు, మహాబలవంతులు నగు వానరభల్లూకములు ఉత్తరతటముపై నిలువబడి కందర్ప కోటి లావణ్యసుందరాకారుడైన శ్రీ రామదూత యగు శ్రీ ఆంజనేయుని రాకకై కండ్లు తెరచుకొని నిరీక్షింపసాగిరి. కపిశ్రేష్ఠుడు, శ్రీ మారుతాత్మజుడు నగు శ్రీ ఆంజనేయుని సింహనాదమును గుర్తించినవారై ఆయనను దర్శింపవలెనని ఆ వానర భల్లూక వీరులు గిరుల నెక్కిరి; కొందఱు ఆకసమున కెగిరిరి. ఆ దేసమయమందు వేగవంతుడు, బృహత్కాయుడు నగు శ్రీ ఆంజనేయుడు మహేంద్రగిరి శిఖరముపై దిగెను.

గోద్విజులకు హితము నొనరించువాడు, పరమప్రభువు, పాపతాపములను నివారించువాడు నగు భగవంతుడు ధర్మ సంస్థాపనార్థము ధర్మాభ్యుదయముకొఱకు ప్రతియుగమునం దవతరించును. మధురములు, శుభప్రదములు నగు ఆ ప్రభుని లీలలు పరమాశ్చర్యకరములు. తననుండి దూరముగ పోయిన జీవులను తన చెంతకు చేర్చుకొనుటకై భగవంతు డిట్టి అద్భుత లీలల నొనరించును. ఆనందరామాయణములో ఒక కల్పములో భగవానుడైన శ్రీరామచంద్రుని యవతారలీలలు వర్ణింపబడెను. ఆ రామాయణమందు పవనకుమారుని యద్భుత పావనకథ కలదు. అది సంక్షేపముగ నిట్లున్నది.

దశకంఠుని బంగారులంకకు నిప్పుపెట్టి శ్రీకేసరీనందనుడు జగజ్జనని యగుజానకి సమీపమునకు బోయెను. ఆయనతల్లి చరణారవిందములకు ప్రణామము లాచరించి యిట్లు ప్రార్థించెను. "తల్లీ! నీవు నాభుజస్కంధములపై కూర్చుండుము. ఈ క్షణమే నిన్ను సముద్రము దాటించి శ్రీరామచంద్రుని చెంతకు చేర్చగలను".

అందులకు వైదేహి యిట్లుత్తర మొసంగెను. "కుమారా! అప్రమేయుడు, శూరుడు, వీరుడు నగు నాప్రాణనాథునకు అన్యులు నన్ను చెరనుండి విడిపించుట స్వప్నమందైనను సమ్మతము కాజాలదు. రావణునివధ, నా బంధవిమోచనము నాప్రాణనాథుని కరకమలములచే జరుగుట నాకు

ఆయనకు శోభాకరము. అందువలన నీస్వామియొక్క కీర్తి దశదిశల వ్యాపించును. నీవు చూడామణిని, శ్రీరామ నామాంకితమునైన ముద్రికను తీసికొని వెళ్ళి ప్రభువున కిమ్ము, క్షణమైననువిలంబనమొనరింపక వెంటనే నన్నుద్ధరించుటకు రావలసినదిగ ప్రభువును ప్రార్థింపుము.

శ్రీ ఆంజనేయుడు తల్లినుండి చూడామణిని, శ్రీరామ ముద్రికను అత్యంతాదరపూర్వకముగ దీసికొని పరమపావనము లగు సీతాదేవి పాదపద్మములకు నమస్కరించి బయలుదేరెను. ఆమహావీరుడు సముద్రతటమునం దున్న గిరిశిఖరము నధిరోహించి ఆకసమున కెగిరెను. పర్వత మాతనివేగమును సహింపలేక చూర్ణమయ్యెను. ఆ సమయములో లోకపితామహుడగు బ్రహ్మదేవుడు లంకాదహన కార్యక్రమమును గూర్చి విస్తృతవర్ణనము గల ఒకపత్రమును శ్రీరామచంద్రునకు చేర్చవలసినదిగ శ్రీహనుమంతున కిచ్చెను. శ్రీరామ దూత చతురాననుని పత్రమును, జానకి యొసంగిన చూడామణి ముద్రికలను తీసికొని భయంకరమగు సింహనాద మొనరించినవాడై ఆకాశమార్గమున సముద్రమును దాటెను.

ఉత్తరదిశయందుగల సముద్రతటముపై శ్రీఆంజనేయుడు దిగెను. ఆప్రదేశములో భగవంతుని భజించుచున్న ఒకముని వర్యుని గాంచెను. శ్రీహనుమంతుడు విరక్తుడగు నామహర్షితో నిట్లుపలికెను. "మునివరా! నేను శ్రీరామ

చంద్రునియాదేశానుసారముగ ఆయన ప్రాణాధికురాలగు జనక రాజనందిని వార్తను తెలిసికొని సముద్రమును దాటి వచ్చు చున్నాను. దప్పికచే వ్యాకులుడనగుచున్నాను. దయతో నాకు జలాశయమును చూపించుము".

తపస్వి యగు ఆముని జపమొనరించుచు తన చూపుడు వ్రేలితో ఒకజలాశయమును చూపెను. శ్రీహనుమంతు డామహర్షికి తన లంకాయాత్రావిశేషములను చెప్పుచు తా నొనరించిన ఘనకార్యములకు తనలో తాను కించిద్గర్వమును పొందెను. సర్వవ్యాపకు డగు భగవంతున కావిషయము విదితమేగదా! భగవంతుడు భక్తగర్వాపహారి. ఆయన ఆదర్శ సేవకుడైన శ్రీహనుమంతుని హృదయములో సూక్ష్మాతి సూక్ష్మముగానైనను గర్వభావము స్ఫురించు టెట్లు సహింప గలడు? తత్క్షణమే ఆగర్వభావమును తొలగించుటకు ఆయన యొకదివ్యలీలను రచించెను.

శ్రీపవనాత్మజుడు చూడామణిముద్రికలను, విధాత యొసంగిన పత్రమును జపమొనరించుచున్న ఆమునిసమీపమున నుంచి తన దప్పికను చల్లార్చుకొనుటకు జలాశయముచెంతకు జనెను. ఆదేసమయములో ఒక చిన్నవానరము ఎగురుచు వచ్చి శ్రీరామనామాంకితమైన ముద్రికను మహర్షి కమండల ములో బడవైచి వెడలిపోయెను.

జలములను త్రాగి శ్రీహనుమంతుడు తిరిగివచ్చెను. చూడామణిపత్రములతో ముద్రికను కనుగొనలేక ముద్రిక యేమైనదని మహర్షిని ప్రశ్నించెను.

ఆ మహర్షి కమండలము వైపు చూపెను. శ్రీహనుమంతుడాకమండలములో హస్తము నుంచి ముద్రికకై వెదకగా శ్రీరామనామాంకితముద్రికలు వందలకొలదిగ నుండెను. మరల పవనాత్మజుడు కమండలములో చేయినుంచగా వేలకొలదిగ శ్రీరామనామాంకితముద్రికలు బయల్వెడలెను. ఎన్ని పర్యాయములు తీసినను అవి యసంఖ్యాముగ బయల్వెడలుచుండెను. అంగులీయకములలో తాను తెచ్చిన ముద్రికను శ్రీహనుమంతుడు గుర్తింపలేకపోయెను. మహావీరుడు, అంజనీనందనుడు నగు హనుమంతుడు పరమాశ్చర్యమును బొందెను. చకితుడైన శ్రీపవనాత్మజు డామహర్షి నిట్లు ప్రశ్నించెను. మునీశ్వరా! అసంఖ్యాకములగు నీముద్రికలెచటి నుండి వచ్చినవి? వీనిలో నే తెచ్చిన ముద్రిక యేది?

వయోవృద్ధు డగు ఆ మహర్షి యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "ఆంజనేయా! భగవంతుడగు శ్రీరామచంద్రు డనేకపర్యాయము లీభూమిపై అవతరించెను. ప్రతిఅవతారమందు సీతాపహరణము జరుగుచునే యుండెను. సీత నన్వేషించుటకు హనుమంతుడు పంపబడుచుండును. ఆయన సీతనుదర్శించి మరలి

వచ్చుచు నావద్దనుంచిన ముద్రికలను వానరములు నాకమండలములో పడవైచినవియివి. వీనిలో నీముద్రికను వెదకికొనుము.

శ్రీ హనుమంతునిలో ఉద్భవించిన గర్వాంకురము ఆమూలాగ్రముగ నశించెను. ఆశ్చర్యచకితుడై ఆయన మహర్షిని పూతచరితా! నేటివరకు శ్రీరామచంద్రు డెన్ని అవతారములను ధరించెను అని ప్రశ్నించెను. అందులకు మహర్షి కమండలములోని ముద్రికలను లెక్కింపవలసినదిగ పల్కెను. శ్రీ హనుమంతుడు తనదోసిళ్ళతో శ్రీరామ ముద్రికలను కమండలమునుండి తీయనారంభించెను. వాని కంతులేదు, అవి అసంఖ్యాకములు. శ్రీహనుమంతుడు ఆమహర్షి చరణారవిందములకు నమస్కరించి యిట్లాలోచించెను. భగవంతు డగు శ్రీరామచంద్రుని గుణములకు, శక్తులకు అంతములేదు. ఆయన అవతారములకుగూడ లెక్కలేదు. నాకు పూర్వము కూడ జగత్ప్రభువగు శ్రీరామచంద్రుని యాజ్ఞానుసారముగ ఎందఱో ఆంజనేయులు సీతాన్వేషణార్థమై బయలుదేరి శ్రీరామకార్యమును సాధించిరి. వారిలో నేనెంతటివాడను.

అభిమానము నశించినంతనె శ్రీఆంజనేయుడు శ్రీసీతారామచంద్రుల చరణారవిందములకు అనేక పర్యాయములు ప్రణామముల నాచరించెను. తదనంతర మాగిరిశృంగము నుండి సముద్రతటము జేరెను. శ్రీఆంజనేయుడు ప్రకాశించు

సూర్యునివలె వచ్చుచుండుటగాంచిన వానరులందఱు జయజయ ధ్వానముల నొనరించుచు ఆయనచుట్టును జేరిరి.

నేను సీతాదేవి చరణారవిందములను దర్శించి, స్పృశించి ధన్యుడనైతినని శ్రీహనుమంతుడు పలుకగా జాంబవంతుడామహాభక్తుని ప్రేమతో ఆలింగనమొనరించుకొనెను. ఆ భల్లూకవీరుడు గద్గదస్వరముతో 'పవనకుమారా! నీవు మాయందఱి ప్రాణములను రక్షించితి'వని కొనియాడెను. సీతాదేవి సురక్షితముగ నుండెననెడి విషయము తెలుపగనే వానర భల్లూగ వీరులందఱు కిలకిలారవము లొనరించుచు ఎగుర నారంభించిరి. హర్షాతిరేకముచే వానరులందఱు తమవాలమునను పైకెత్తినవారై నృత్యమొనరించిరి. కొందఱు బలిష్ఠములు దీర్ఘములు నైన తమవాలములను గిరగిర ద్రిప్పిరి. మఱికొందరు శ్రీఆంజనేయుని వాలమును ముద్దాడ నారంభించిరి; మఱి కొందఱు ఆయన సమ్ముఖమున కందమూలఫలముల నుంచి ఆరగింపవలసినదిగ ప్రార్థించిరి. మఱికొందఱు తదితరములగు సేవల నొనరింపసాగిరి. ఈశ్వరనందనుడు కొందఱి చరణములకు ప్రణామముల నర్పించెను. మఱికొందరి నాలింగన మొనరించుకొనెను, పిన్నవయస్కుల శిరముపై దక్షిణహస్తము నుంచి ఆశీర్వదించెను. మఱికొందరిని వీపుపైనిమిరి ప్రశంసించెను. సర్వసమర్థుడగు ఆ రుద్రాంశుడు కొలదిక్షణములలోనే సకల వానర భల్లూక వీరులను గలిసికొనెను.

శోకహారు డగు శ్రీకపిసత్తముడు సీతను దర్శించిన విధానమును, రావణున కొనరించిన ఉపదేశమును, లంకా దహనకార్యక్రమమును యువరాజైన అంగదునకువి వరించెను. శ్రీరామభక్తుడైన అంగదుడు పరమానంద భరితుడై శ్రీఆంజనేయునితో నిట్లు పల్కెను.

శ్లో॥ సత్త్వే వీర్యే న తే కశ్చిత్ సమో వానర విద్యతే॥
యదవప్లుత్య విస్తీర్ణం సాగరం పునరాగతః।
జీవితస్య ప్రదాతా న స్త్వమేకో వానరోత్తమ॥
త్వత్ప్రసాదాత్ సమేష్యామః సిద్ధార్థరాఘవేణ హ।
అహో స్వామిని తే భక్తిరహో వీర్యమహో ధృతిః॥
(వాల్మీకి రామాయణము 5-57-45-4)

వానరశ్రేష్ఠా! బలపరాక్రమములలో నీతో సములు మరియొకరు లేరు. నీ వీ విశాలమగు సముద్రమును దాటి ఆవలియొడ్డు చేరి మరలివచ్చితివి. కపిశిరోమణీ! మాయందఱికి జీవనదాతవు నీవొక్కడవే. నీ యనుగ్రహ విశేషముచేతనే మేమందఱము సఫలమనోరథులమై శ్రీరామచంద్రుని దర్శింపబోవుచున్నాము. పరమప్రభువైన శ్రీరఘునాయకుని యెడల నీ భక్తి అద్భుతము. నీ పరాక్రమము, నీ ధైర్యము ఆశ్చర్య జనకములు.

నీవు మహాసాధ్వియైన సీతాదేవి దర్శనమును బొందు

అత్యంతము సౌభాగ్యకర మగు విషయము. సుఖప్రద మగు సమాచారముచే శ్రీరామచంద్రుని శోకమంతయు నశించును.

తదనంతరము అంగదజాంబవంతాదులను పరామర్శించి శ్రీ ఆంజనేయుడు వానరభల్లూక సముదాయములను వెంట నిడుకొని శ్రీరామచంద్రునకు సుఖదాయకమైన యీ సమాచారమును వినిపించుటకు వానరరాజైన సుగ్రీవుని చెంతకు బయలుదేరెను. శ్రీఆంజనేయుడు ముందునడచుచుండగా హర్షహృదయులై వానరభల్లూకములు ఎగురుచు, దుముకుచు ఆయన ననుసరించిరి. ఆసమయములో సిద్ధులు, సాధ్యులు మొదలగు వారందఱు వేదశాలియు, మహాబలవంతుడు, బుద్ధి మంతుడునైన పవనాత్మజుని సజల నయనములతో దర్శించుచు అనేకవిధముల ప్రశంసింప దొడంగిరి.

ఆకాశములోనికి దుముకుచు, నెగురుచు హర్షోన్మత్తులైన వానరభల్లూక వీరులు నందనవనమువలె భాసించు మనోహరమగు మధువనమును సమీపించిరి. కిష్కింధాధిపతి యైన సుగ్రీవుడు మధువన రక్షణార్థమై తనమేనమామయు, మహాబలవంతుడు నగు దధిముఖు డను వానరశ్రేష్ఠుని నియోగించెను. మనోహరమైన ఆ వనమును గాంచగనే వానరభల్లూకములకు మధువు నాస్వాదింపవలెనని, ఫలముల నారగింప వలెనని కోరిక జనియించెను. వారు యువరాజగు అంగదు ననుమతి నడిగిరి. జాంబవంతుని, మహావీరుడైన శ్రీహనుమంతుని సంప్ర

దించి యువరాజు వారికోరికను మన్నించెను. ప్రసన్నులైన తామ్రవర్ణముగల వానరభల్లూకవీరులందఱు మధువనమును ప్రవేశించి మధువును ద్రాగుచు మధురఫలముల నారగించుచు నెగురసాగిరి. వానరులు మధువును ద్రాగి మత్తులైరి. సీతాదేవి యొక్క సమాచారము తెలిసికొని ప్రసన్నులై మధువును ద్రాగి మత్తులైన వానరులస్థితి విచిత్రముగ నుండెను. ఆనంద మగ్నులై కొందఱు పాడుచుండిరి, కొందఱు నవ్వుచుండిరి, కొందఱు నృత్యమొనరించుచునుండిరి, కొందఱు ఆకసమున కెగురుచు దూకుచుండిరి, కొందఱు వాచాలురై బలుకుచుండిరి, కొందఱు మధువును ద్రాగి మిగిలిన దానిని ఒలకబోయుచుండిరి. కొందఱు ఫలభరితములైన వృక్షశాఖలను ద్రుంచుచుండిరి. ఉద్దండులైన మఱికొందఱు మదమత్తులై వృక్షములను పెకలింప నారంభించిరి. ఇట్లు అత్యంత రమణీయమగు మధువనమంతయు నష్టభ్రష్టమయ్యెను.

దధిముఖుడు మొదలగు వనరక్షకులు ఆమహావీరుల నడ్డగించిరి. యువరాజైన అంగదునియొక్క శ్రీరామభక్తుడైన ఆంజనేయునియొక్క అండచూచుకొని మధువును ద్రాగి మత్తులైనఆవానరవీరులు వనరక్షకులను తిరస్కరించి వారిని మోద నారంభించిరి.

వివశుడైన దధిముఖుడు వానరేశ్వరుడైన సుగ్రీవుని చెంతకు జని యిట్లు నివేదించెను. "రాజా! నీవు చిరకాలము

నుండి రక్షించుకొనుచున్న సుందరమగు మధువనమును హను మదంగదాదుల ప్రోద్బలముచే వానరులు నష్టమొన రించిరి. అంతియేగాక వారు వనరక్షకులమైన మమ్ము బాగుగ గొట్టిరి."

సుగ్రీవుని యానందమునకు మేరలేకపోయెను. అతడు దధిముఖునితో నిట్లు పలికెను. "మామా! నిశ్చయముగ శ్రీ ఆంజనేయుడు జానకిని దర్శించియే యుండును, లేనిచో మధు వనమును సమీపించు సాహసము వారి కెక్కడిది? యువరాజు అట్టి యనుజ్ఞ నివ్వజాలడు. నీవు వారిని క్షమింపుము."

అపుడు భగవానుడైన శ్రీరామచంద్రుడు సుగ్రీవు నితో "రాజా! నీవు సీతాసంబంధమైన మాట లేల పలుకు చున్నా"వని యనెను. అందుకు సుగ్రీవుడు వినయపూర్వక ముగ ప్రభూ! శ్రీహనుమంతుడు సీతను దర్శించినట్లుగ దోచు చున్నది. లేనిచో మధువనమున ప్రవేశించి దానిని నష్టమొన రించుటకు వానరులు సాహసింపజాలరు"అని విన్నవించెను. ఈశుభసమాచారముచే శ్రీరామచంద్రుని హృదయ మానంద ముతో ఉప్పొంగెను. సుగ్రీవుడు దధిముఖుని "మామా! నీవు తక్షణమే వెళ్ళి ఆవానరశ్రేష్ఠులను సీతాదేవియొక్క శుభ సమాచారమును ప్రభువునకు యథాశీఘ్రముగ విన్నవించుటకు రావలసినదిగ తెలుపు"మని ఆజ్ఞాపించెను. దధిముఖుడు వెడలి పోయెను. శ్రీరామలక్ష్మణుల ముఖములపై తాండవించు

ప్రసన్నతను గాంచి వానరేశ్వరు డైన సుగ్రీవుడు కూడ ఆనందమగ్నుడయ్యెను.

## శ్రీ హనుమంతుని అదృష్టము

మహాబలవంతు డగు దధిముఖునిద్వారమున సుగ్రీవాజ్ఞ నాలకింపగనే మహామతిమంతు డగు జాంబవంతుడు, యువ రాజైన అంగదుడు, శివావతారు డైన శ్రీఆంజనేయుడు మొదలగు వారందఱు విశాలమైన వానర సమూహముతో ఆకస మున కెగురుచు బయులుదేరిరి. ప్రస్రవణగిరిపై శ్రీరామ చంద్రునిసుందర మగు పర్ణకుటీరము కలదు. ఆసమయములో పర్ణకుటీరమునకు ముందున్న స్ఫటికశిలపై రామానుజునితో పాటు శ్రీరాముడు ఆసీనుడై యుండెను. సమీపముననే వానర సుగ్రీవులు కూర్చొనియుండిరి.

ప్రసన్నులైన వానరులతో ఆకాశమార్గమునుండి వచ్చు చున్న అంగదుని గాంచి వానరేశ్వరు డగు సుగ్రీవుడు కమల నయను డైన శ్రీరాఘవేంద్రునితో నిట్లు పల్కెను "ప్రభూ! ధైర్యమును వహింపుడు. నిస్సందేహముగ శ్రీపవనాత్మజుడు సీతను కనుగొనియే యుండును. లేనిచో నిర్ణయించిన గడువు సమాప్తముకాగా యువరాజైన అంగదుడు, వానరులు ఇంత ప్రసన్నులుగ తిరిగిరారు.

శ్లో॥ న హన్యః కర్మణో హేతుః సాధనేఽస్య హనూమతః
హనూమతీహ సిద్ధిశ్చ మతిశ్చ మతిసత్తమ॥
వ్యవసాయశ్చ శౌర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్॥
(వాల్మీకి రామాయణం 5-64-33-34)

మతిసత్తమా! ఈ కార్యము నెరవేరుటలో శ్రీఆంజనేయుడుదక్క అన్యులు కారణ మనుకొనుటసంభవము. వానరశిరోమణి యగు శ్రీఆంజనేయునిలోనే కార్యసిద్ధికి తగు శక్తి, బుద్ధులు కలవు. ఆయనలోనే యుద్యోగము, పరాక్రమము, శాస్త్రజ్ఞానము ప్రతిష్ఠితము లైయున్నవి.

ఈ ప్రకారముగ వానరేశ్వరు డైన సుగ్రీవుడు బుద్ధిమంతులలో అగ్రగణ్యుడైన శ్రీరఘునందనుని ఊరడించుచుండగా శ్రీఆంజనేయుని అంగదుని ముందుంచుకొని హర్షాతిరేకముచే సింహనాదముల నొనరించుచు వానరవీరులు వారి చెంతకు వచ్చిరి. వానరవీరులను గాంచగనే సుగ్రీవుడు ప్రసన్నుడై తనవాలమును పైకెత్తెను.

అంగదాదివీరు లందరు శ్రీరఘునాయకుని జూచి హర్షోల్లాస పూర్వకముగ ఆకాశమునుండి భూమిపైకి దిగిరి. వానరవీరు లందఱు శ్రీరామ లక్ష్మణుల చరణారవిందములకు, సుగ్రీవునకు ప్రణామము లర్పించిరి. చూచితిని నేను సీతాదేవిని యనుచు శ్రీపవనకుమారుడు త్రిభువన పావనము లగు శ్రీరామచంద్రుని చరణకమలములపై బడెను. ప్రభు

దర్శనముచే ఆయన యానందమున కవధులు లేకపోయెను. స్వామీ! జానకీదేవి కఠోరమగు పాతివ్రత్య నియమముల నాచరించుచు సదా నిన్నే స్మరించుచు సశరీరముతో కుశలముగ యుండెనని శ్రీఆంజనేయుడు పలికెను.

నేను జగజ్జననియగు జానకిని జూచితి నని శ్రీఆంజ నేయుడు పలికిన మధుర వచనముల నాలకింపగనే శ్రీరామ లక్ష్మణ సుగ్రీవుల యానందమునకు మేరలేకపోయెను. శ్రీరామ ప్రభువు అతిశయ మగు ప్రీతితో అత్యంతాదరముతో శ్రీ ఆంజనేయుని చూచెను. శ్రీఆంజనేయుడు ప్రభువుయొక్క చరణార విందములకు మాటిమాటికి సాష్టాంగదండ ప్రణా మము లాచరించి సుమిత్రానందనునకు, సుగ్రీవునకు నమస్క రించి ముకుళితహస్తములతో శ్రీరామచంద్రుని దివ్యముఖార విందమును తదేకదృష్టితో వీక్షించుచుండెను.

భగవంతుడైన శ్రీరాముడు శ్రీఆంజనేయు నిట్లు ప్రశ్నించెను. "వాయునందనా! సీతాదేవి యెక్కడ? ఆమె యెట్లుండెను? నాయెడల ఆమె యెట్టిభావము కలిగియుండెను? విదేహకుమారి యగు సీతయొక్క సమాచారమునంతటిని చెప్పుము. శ్రీపవనకుమారుడు మొదట దక్షిణ దిశగ చూచినవాడై సీతకు శ్రద్ధాపూర్వకముగ నమస్కరించెను. తదనంతర మాయన నమ్రతతో నిట్లు నివేదించెను. కరుణా మయుడ వగు ప్రభూ! నూఱుయోజనములు విస్తరించియున్న

సముద్రమున కావలి తటముపై దశకంఠుని లంకానగరము కలదు. ఆరాక్షసుల నగరములో అశోకవాటికలో అశోక వృక్షము చెంత అధిక దుఃఖము ననుభవించుచు నిరంతరము నిన్నే స్మరించుచున్న సీతను గాంచితిని. ప్రభూ! జలహీనమైన మీనమువలె నీవియోగముచే విలపించుచున్న ఆమె దుఃఖాతిశయమును చెప్పకుండుటయే మంచిది.

శ్రీ ఆంజనేయుని వచనముల నాలకింపగనే శ్రీరామ చంద్రుడు ధైర్యమును కోల్పోయెను. ఆయన నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహింపనారంభించెను. శ్రీపవనకుమారుని నేత్రములుకూడ అశ్రుపూరితములయ్యెను. ఆయన ఆదుఃఖమును దిగమ్రింగుకొనుచు సీతాదేవి పంపిన సందేశము నిట్లు పలుకనారంభించెను. "జగన్నాథా! సీతాసాధ్వి అధిక దుఃఖముతో దినములను గడుపుచున్నది. ఆమెను దశాననుడు అశోకవాటికలో బంధించెను. క్రూరులైన రాక్షసస్త్రీలు రేయింబవళ్ళు కాపలాయున్నారు. ఆమె ఒకమాసిన చీరను గట్టుకొనియున్నది. ఆమె సుదీర్ఘ కేశములు జడలుగట్టినవి. పతిదేవుని ధ్యానములోనే ఆమె కాలము గడుపుచున్నది. ఆమె పృథ్విపై శయనించుచున్నది. ఆహారమును, జలములను, విసర్జించిన కారణమున ఆమె మిగుల కృశించెను. శోకముతో 'రామా! రామా!' యనుచు జపించుచున్నది. నీయందుగల అనన్యభక్తితో ప్రేరితురాలై దుస్సహములగు కష్టముల నను

భవించుచు కఠోరతపమొనరించుచున్న తల్లిని నేను గాంచితిని. రఘునాయకా! నేను మరలివచ్చుచున్నపుడు అమ్మ నాకు చూడామణిని ప్రసాదించి నీకు గుర్తుగ చూపుమని బలికినది. చిత్రకూటములో సంభవించిన కాకిరూపుడైన జయంతుని వృత్తాంతమును నీకు జ్ఞాపకము చేయవలసినదిగ పలుకుచు, స్వామీ! అంతటి మహత్తర మగు శక్తిసంపన్నుడవైన నీవు కూడ మౌనము నేల వహించితివి? నాయపరాధముల నన్నింటిని క్షమించి నన్నుద్ధరింపుమని అమ్మ నీతో విన్నవింపవలసినదిగ పలికినది.

శ్రీఆంజనేయుని వచనముల నాలకింపగనే శ్రీరామచంద్రుని హృదయము దుఃఖముతో నిండిపోయెను. పద్మముల వంటి ఆయన నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహింప నారంభించెను. సీతాదేవి పంపిన చూడామణిని తనహృదయమునకు హత్తుకొని శ్రీరామచంద్రుడు సుగ్రీవునితో నిట్లు పల్కెను. మిత్రమా! యీ చూడామణిని గాంచగనే నా హృదయము ద్రవించినది. దేవతలచే పూజింపబడు ఈ దివ్యమణి జలములనుండి ఉద్భవించినది. నామామగారైన జనక మహారాజు చేసిన యజ్ఞమునకు ప్రసన్నుడై సురేంద్రు డీ దివ్యమణిని ఆయన కొసంగెను. మావివాహసమయములో నీ దివ్యమణిని జనకమహారాజు సీత కొసంగెను. ఆమె శిరముపై నీమణి సదా ప్రకాశించుచుండును.

దోహా॥ సును కపి తోహి సమాన ఉపకారీ।
నహి కోఉ సురనరముని తను ధారీ॥
ప్రతి ఉపకార కరౌ కా తోరా।
సనముఖ హోఇ న సకత మన మోరా॥
సును సుత తోహి ఉరిన మై నాహీ।
దేఖేఉ కరి విచార మన మాహీ॥

(మానస 5-31-3-4)

శ్రీ ఆంజనేయుని ద్వారమున తనప్రాణప్రియురాలగు సీతాదేవియొక్క సమాచారమును దెలిసికొని అత్యంత ప్రసన్నుడై ప్రభు విట్లు పలికెను. ఆంజనేయా! నీ వొనరించిన ఈ కార్యము దేవతలకుగూడ దుష్కరమైనది. నీ వొనరించిన ఈమహోపకారమునకు నే నేమి ప్రత్యుపకార మొనరింపగలను? కుమారా! నేనెంతగనో ఆలోచించుకొని నీ ఋణము నెప్పటికిని తీర్చలేనని నిర్ణయించుకొంటిని.

ఇట్లుపల్కి కరుణావతారుడు, మహాప్రభువు నగు శ్రీరామచంద్రుడు శ్రీ ఆంజనేయుని గాఢాలింగన మొనర్చుకొనుచు ఇట్లుపలికెను.

శ్లో॥ పరిరమ్భో హి మే లోకే దుర్లభః పరమాత్మనః।
అతస్త్వం మమ భక్తోఽసి ప్రియోఽసి హరిపుంగవ॥

(ఆ. రా. 5-5-63)

పరమాత్ముఁడనైన నాయాలింగనము లభించుట యీ విశ్వములో అత్యంతదుర్లభము. వానరశ్రేష్ఠుడా! నీకు ఈ సౌభాగ్యము సంప్రాప్తమయ్యెను. కావున నీవు నాకు పరమ భక్తుడవు, అత్యంతప్రియతముడవు నైతివి.

భగవంతు డైన శ్రీరామచంద్రుని యనన్యభక్తు డగు శ్రీమహాదేవాత్మజుని ఒక్కగానొక్క కోరిక పరిపూర్ణ మయ్యెను. ఆయన యీ వానరశరీరమునుధరించుటలో గల ఉద్దేశ్యము సఫలీకృతమయ్యెను. ఆయన పులకితగాత్రుడై శ్రీరామచంద్రునకు అనేక ప్రణామముల నర్పించుచు ఆనంద మగ్నుడై సాశ్రుపూర్ణ నయనములతో ప్రభువుచరణకమలములను గడిగి 'దేవాదిదేవా!' నన్ను రక్షింపుము. కరుణింపుమని ప్రార్థించెను. భక్తవత్సలు డగు ప్రభువు శ్రీఆంజనేయు నిట్లు ప్రశ్నించెను. "కుమారా! ఈవిశాల మగు సముద్రము నెట్లు లంఘించి లంకను జేరితివి? లంకలో సీతాదేవి నెట్లు కనుగొంటివి? ఆమె యెట్టి సందేశమును బంపినది? లంకాధిపతి యగు రావణుని శక్తియుక్తులేపాటివి? ఈ విషయముల నన్నింటిని సవిస్తరముగ జెప్పుము.

## లంకాయాత్రనుగూర్చి వివరించుట

త్రైలోక్యమోహన మగు శ్రీరామచంద్రుని ముఖారవిందము నవలోకించుచు వినీతాత్ము డగు పవనకుమారుడు చేతులు జోడించి యిట్లుపలికెను. "ప్రభూ! నేను పశుసమాను

డను, అంతియేకాదు చంచలుడ నగు తుచ్ఛవానరుడను. నా విద్య, బుద్ధి, శక్త్యాదు లేపాటివి! కాని నీయనుగ్రహముచే దూది యైనను బడబాగ్నిసహితము చల్లార్పగలదు. నీ యాదేశానుసారముగ కిష్కింధాధిపతి యిచ్చిన ఆజ్ఞను శిరసా వహించి సీతాదేవిని వెదకుటకు బయలుదేరితిని. అందఱు చూచుచుండగనే గగనమార్గమున కెగిరి విశాల మగు సాగరమును దాటి లంకానగరము జేరితిని. రాక్షసుల దృక్కులనుండి తప్పుకొనుటకు సూక్ష్మశరీరమును ధరించినవాడనై సీతామాతను వెదకసాగితిని. దశకంఠునకు ప్రియమైన అశోకవనములో అశోకవృక్షము క్రింద శోకమగ్నురాలై యున్న తల్లిని దర్శించి విగతధైర్యుడనైతిని. నేను వృక్షముపై కొమ్మలలో దాగి యుండగా క్రూరుడైన రావణు డా ప్రదేశమున కేతెంచెను. వియోగిని యగు సీతాదేవిని వశపరచుకొనుట కాత డనేక విధముల ఆమెను భయపెట్టెను, బెదిరించెను. కాని ఆమె వాని నొక కుక్కగ తలంచి నిరసించెను. అపు డాయుధము దగు రాక్షసుడు ఆమెను చంపుట కుద్యుక్తుడయ్యెను. పట్టపురాణి యైన మండోదరి వానిని శాంతింపజేయగా ఒకమాసము గడువును విధించి ఆతడు వెడలిపోయెను. కాపుగా నున్న రాక్షస స్త్రీలుకూడ జనకరాజకుమారి ననేకవిధముల భయపెట్టిరి. వారందఱు వెడలిన పిమ్మట సీతాదేవి అసహ్య మగు వియోగ దుఃఖమును భరింపలేక ప్రాణములను త్యజించుట కుద్యుక్తురాలయ్యెను.

ఆసమయమున నేను వృక్షముపై కొమ్మలలో దాగిన వాడనై నీపావనచరితమును గానమొనరింపసాగితిని. నీపుట్టుక మొదలుకొని దండకారణ్యమునకు వెడలుట, సీతాపహరణము, సుగ్రీవునితో స్నేహము, వాలిని వధించుట, కిష్కింధాధిపతి యైన సుగ్రీవుడు ఆమెను వెదకుటకు వానరులను నలుదిశలకు పంపుట, నేనుకూడ శ్రీరామకార్యార్థమై వెడలుట మొదలగు సంఘటనల నన్నింటిని వర్ణించినవాడనై ' అమ్మా! నీదర్శనమును పొంది కృతార్థుడనైతి' నంటిని.

నే బలికిన మధుర లీలా కథామృతమును గ్రోలినదై యామె 'అమృతతుల్యమగు ఈదివ్యలీలలను నాకు వినిపించిన ఉత్తముడు నాయెదుట కెందులకు రాలేదు'? అని పలికెను.

నేను వృక్షమునుండి డిగ్గినవాడనై యామె చరణారవిందములకు ప్రణామముల నర్పించితిని. వానరరూపుడ నగు నన్ను గాంచి మొదట జానకీదేవి అనుమానించినది. కాని నేను క్రమముగ అన్నివిషయముల నామెకు విన్నవించితిని. తదనంతరము నీముద్రిక నామె కిచ్చితిని. అపుడు జానకి నన్ను విశ్వసించినది.

క్రూరు డగు రావణునిరాజ్యములో భయంకరులైన రాక్షసస్త్రీలనడుమ అత్యంతకష్టముల ననుభవించుచు నీవియోగదుఃఖముతో జీవితమును గడుపుచున్న ఆతల్లి పుత్రుడ నైన నన్ను చూడగనే పొంగివచ్చు దుఃఖము నాపుకొనలేకపోయినది. ఆమె 'కుమారా! నే నెట్లు అహర్నిశములు క్రూరులైన యా

రాక్షసస్త్రీలచే కష్టముల ననుభవించుచున్నానో చూచితివి కదా! ఈవిషయమును వెంటనే నాప్రాణనాథునకు నివేదింపు' మని పలికినది. నేను అనేకవిధముల అమ్మకు ధైర్యమును చెప్పి, ఊరడించి యిట్లుపల్కితిని. "జననీ! నాప్రభువును నేను జేరుటయే ఆలస్యము. అమితశక్తిసంపన్నుడగు శ్రీరాఘవేంద్రుడు నీసమాచారము నాలకింపగనే లంకకు వచ్చి అసుర వంశమును విధ్వంసమొనరింపగలడు.

దుఃఖించుచు అత్యంతకరుణతో నీవు శీఘ్రము గ రావలయునని ప్రార్థించుచు లక్ష్మణున కిట్లు సందేశమిచ్చినది. "లక్ష్మణా! నిన్ను నేను అజ్ఞానవశమున కఠోరవచనములను పల్కి బాధించితిని. అందులకు నన్ను క్షమింపుము. శీఘ్రమే శ్రీరఘునాయకునితో కలసివచ్చినవాడవై నన్ను రక్షింపుము, లేనిచో ఒకమాసము తరువాత నేను జీవించియుండను."

ఇట్లుపల్కి సీతాదేవి దుఃఖింప నారంభించెను. ఆమె వానరరాజైన సుగ్రీవుని, యువరాజగు అంగదుడు, మతిమంతుడైన జాంబవంతుడు మొదలగు వానరవీరులందఱను ఆశీర్వదించుచు శీఘ్రమే లంకకువచ్చి రాక్షసులను సంహరింపవలసినదిగ ప్రార్థించినది.

శ్రీవాయునందనునివలన భగవతి యగు జానకియొక్క సమాచారము విని శ్రీరామచంద్రుడు పులకితుడై చెందెను.

లక్ష్మణునినేత్రములనుండి అశ్రుధారలు ప్రవహింప నారంభిం చెను. వానరభల్లూకవీరులందరు శోకముచే సజలనయనులైరి. కాని శ్రీఆంజనేయుడుమాత్రము ధైర్యముగ నిట్లు పలుకుచుం డెను. "తల్లియాజ్ఞను పొందినవాడనై అశోకవనమునందు గల మధురఫలముల నారగించితిని, రావణుని కలిసికొనవలెననెడి సంకల్పము కలిగినవాడనై నేను అతిసుందర మగు వాని అశోక వనమును విధ్వంసమొనరించితిని. రావణునికుమారుడైన అక్ష యునితోపాటు అసంఖ్యాకు లగు అసురవీరులను సంహరించి తిని, తదనంతరము రావణకుమారుడైన ఇంద్రజిత్తు బ్రహ్మా స్త్రమును ప్రయోగించి నన్ను రావణునిసభకు తోడ్కొని పోయెను. అచ్చట దుష్టు డగు ఆరావణుడు నావాలమునకు నిప్పుపెట్టవలసినదిగ ఆజ్ఞాపించినాడు. దేవాదిదేవా! నీకృప వలన నేను లంకానగరమును దగ్ధమొనరించితిని.

భగవంతు డగు శ్రీరామచంద్రుడు, లక్ష్మణుడు, వానరరాజైన సుగ్రీవుడు, మహామతిమంతుడైన జాంబవంతుడు, అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, నలుడు, నీలుడు మొదలగు వానరశ్రేష్ఠు లందరు లంకానగరములో జరిగిన సంఘటనలను శ్రద్ధగ ఆలకించుచుండిరి. శ్రీహనుమంతుడు శ్రీరాఘవేంద్రుని చరణారవిందములపై పడినవాడై "ప్రభూ! ఈకార్యముల నన్నిం టిని నే నొనరింపలేదు. అంతర్యామివి, నాప్రభుడవు నగు నీవు నాలో నుండి నీశక్తిచే ఈకార్యములను చేయించితి" వని సవి నయముగ మనవిచేసికొనెను."

శ్రీహనుమంతు డింకను నిట్లు పలుక నారంభించెను. "కరుణామయుడ వగు స్వామీ! నేను త్రికూటపర్వతముపై నిర్మింపబడిన లంకానగరమును పరికించితిని. ఆనగరమునకు నాల్గు దిక్కులలోను దీర్ఘములు, విశాలములు నగు ద్వారములు గలవు. ఆద్వారము లత్యంతబలిష్ఠములైన తలుపులతో మూయబడి యుండెను. ఆద్వారములపై అనేకశక్తిసంపన్నము లగు యంత్రము లమర్చబడియున్నవి. అవి శత్రుసైన్యములపై శతఘ్నులను, సహస్రఘ్నులను కురిపించుటలో సమర్థవంత ములు. ఆద్వారములను దాటి లంకానగరమును ప్రవేశించు టత్యంతకఠినము. లంకానగరమునకు నాల్గువైపుల బంగార ముచే నిర్మింపబడిన యెత్తైన ప్రాకారముకలదు. ఆ గోడలను ఛేదించు టత్యంతదుష్కరము. వాటిపై మణులు, మాణిక్య ములు, రత్నములు, ముత్యములు పొదగబడియుండెను. ఆ దుర్గమునకు నాల్గువైపుల మొసళ్ళచే నిండిన అగాధమగు అగడ్తగలదు. లంకానగరమును ముట్టడించుట కుమార్గము లేదు. సుదృఢములైన కోటగోడలు కలవు. పర్వతములు, వనములు లంకానగరము చుట్టును శోభించుచు ఆ నగరమునకు ప్రకృతిసహజమైన రక్షణను కల్పించెను. లంక విస్తృత మగు సముద్రమున కావల దక్షిణదిశగ నున్నది. జలయానముపై నైనను లంకను జేరుట కఠినమగును.

లంకానగర పూర్వద్వారముపై ప్రచండవీరు లగు

వేలకొలదిరాక్షసయోధులు కాపుండిరి. దక్షిణద్వారముచెంత అహర్నిశములు చతురంగబలములతో లక్షలకొలదిగ అసుర యోధులు యుద్ధమునకు సన్నద్ధులైయుందురు. ఉత్తరద్వారము చెంత కోటానుకోట్లరక్కసవీరు లున్నారు. మధ్యభాగములో యుద్ధశిబిరములందు సహస్రాధికములుగ దుర్జయులగు నిశాచర వీరులు అప్రమత్తులై యున్నారు. కుంజరయూథములతో, అశ్వసమూహములతో, శతఘ్ని మున్నగు యంత్రములతో, అగడ్తలతో, దీర్ఘ ప్రాకారములతో, రావణుని లంకానగరము సురక్షితముగ నుండెను; కాని శ్రీరామభద్రా! నీకృపావిశేష ముచే నేను ఆ రక్షణవ్యవస్థనంతటిని ఛిన్నాభిన్న మొనరించితిని. ద్వారములను విరుగగొట్టితిని; ప్రాకారములను పడద్రోసితిని; అగడ్తలను బూడ్చితిని; శతఘ్నులు. సహస్రఘ్నులు మొదలగు యంత్రములను భగ్న మొనరించితిని. దేవాదిదేవా! నీ కృపా పాత్రుడనై నేను రావణునకు గల సమస్తసైన్యములో నాల్గవ వంతును మడియించితిని. అదియిది యననేల! లంకానగరము నంతటిని దహన మొనరించితిని. రావణునినగరవాసు లననేల! సైనికులననేల! తుదకు వానిమనసులోగూడ నీ వలనభయము కల్గునట్లు జేసితిని. అసురులమనోబలము సమాప్తమయ్యెను. శ్రీరామప్రభూ! ఇక ఆలస్య మొనరింపక శత్రువును ముట్ట డించుటయే ఉచితమగును.

దుఃఖశమనుడు, మహావీరుడు నగు శ్రీఆంజనేయుడు

విషయముల నన్నిటిని విన్నవించి నవనీరదసుందరు డగు శ్రీరామచంద్రుని ముఖారవిందమును రెప్పవేయకచూచుచుం డెను. రుద్రావతారునివచనముల నాలకించి ప్రభు వత్యంత ప్రసన్నుడై యిట్లుపల్కెను.

శ్లో॥ కార్యం కృతం హనుమతా దేవైరపి సుదుష్కరమ్ ।
మనసాపి యదన్యేన స్మర్తుం శక్యం న భూతలే ॥
శతయోజనవి స్తీర్ణం లంఘయేత్కః పయోనిధిమ్ ।
లంకాం చ రాక్షసైర్గుప్తాం కో వా ధర్షయితుం క్షమః॥
భృత్యకార్యం హనుమతా కృతసర్వమశేషతః ।
సుగ్రీవస్యేదృశో లోకే న భూతో న భవిష్యతి ॥
అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ కపీశ్వరః ।
జానక్యా దర్శనేనాద్య రక్షితాః స్మో హనూమతా ॥
( ఆ, రా. 6.1-2-5 )

శ్రీఆంజనేయు డొనరించిన యీకార్యము దేవతల కైనను అత్యంతకఠినము. ఈపృథ్వీతలముపై ఆవిషయము నెవ్వరైనను మనస్సులో స్మరింపనైనను స్మరింపజాలరు. శత యోజనవిస్తీర్ణ మగు సముద్రమును లంఘించి రాక్షసులచే సురక్షిత మగు లంకాపురమును ధ్వంసమొనరించుటలో మఱి యొక రెట్లు సమర్థులు కాగలరు. శ్రీఆంజనేయుడు సేవకధర్మ మును బాగుగ పూర్తిచేసెను. ఈసంఘటన వెనుక జరుగ లేదు, ముందు జరుగబోదు. ఈపవనాత్మజుడు సీతాదేవిని కను

గొని నేను నన్ను, లక్ష్మణుని, రఘువంశమును, సుగ్రీవాదుల నందఱిని రక్షించినాడు.

తదనంతరము సీతాపతి యగు శ్రీరాముడు కిష్కింధాధిపతి యైన సుగ్రీవునితో నిట్లు పలికెను. "మిత్రమా! సుగ్రీవా! ఈ సమయములో విజయ మను ముహూర్తము జరుగుచున్నది. ఈక్షణమే సమస్త వానరసైన్యమును లంకానగరమును ముట్టడించుటకు బయలుదేరవలసినదిగ ఆదేశమిమ్ము. ఈ ముహూర్తములో జైత్రయాత్రకు బయలుదేరి నేను అసురసహితముగ దుర్జయుడైన దశాననుని సంహరించి సీతాదేవిని రక్షించెదను.

ఆక్షణమందే సుగ్రీవుడు వానరభల్లూకవీరులను రణరంగమునకు తరలింపవలసినదిగ వానరసైన్యాధిపతులను ఆజ్ఞాపించెను. ఆ వీరులందరి మనస్సులలో లంకానగరమును ధ్వంసమొనరింపవలె ననెడి ఉత్సాహము నిండెను. వారందఱు ముక్తకంఠముతో శ్రీసీతారామచంద్రులకు జయమగుగాక! శ్రీలక్ష్మణ సహితుడగు శ్రీరామచంద్రునకు జయమగుగాక! యనుచు జయజయారవముల నొనరించిరి. సుగ్రీవాజ్ఞచే కోటానుకోట్ల వానరవీరులు, అసంఖ్యాకులగు భల్లూకవీరులు గుమిగూడిరి. వారి హృదయములలో ఆనందము, విజయోత్సాహము పరవళ్ళు త్రొక్కుచుండెను. ఆ యపారమగు విశాలసైనమధ్యభాగములో జటాజూటధారి యగు శ్రీరామ

చంద్రుడు ధనుర్బాణధారియై భాగ్యవంతుడైన శ్రీ ఆంజనేయుని భుజస్కంధము నధిష్ఠించెను. శ్రీరామానుజుడు అంగదుని భుజముపై ఆసీనుడయ్యెను. సుగ్రీవుడు ఆ యన్నదమ్ముల వెంట నడిచెను. గజుడు, గవాక్షుడు, మైందుడు, ద్వివిదుడు, నీలుడు, నలుడు, సుషేణుడు, మహావీరుడగు జాంబవంతుడు మొదలగు సేనాధిపతులందఱు ఆ మహాసైనికవాహినిని నాల్గు వైపులనుండి సావధానులై నడుపుచుండిరి. చంచలురగు వానర వీరులు సుగ్రీవాజ్ఞచే అనుశాశితులై సైన్యాధిపతుల యాదేశములను పాటించుచు, ఎగురుచు, దుముకుచు, గర్జించుచు, మార్గమధ్యములో మధురఫలముల నారగించుచు దక్షిణదిశగ బయలు దేరిరి.

ఆహా! ఆ వానరవీరుల సౌభాగ్యమేమని పొగడగలము. సురముని దుర్లభుడు, సమస్తసృష్టికి స్వామి, దయాధాముడు నగు శ్రీరామచంద్రుని కార్యమును నిర్వర్తించుటకు వారందఱు ఆనందమగ్నులై ప్రయాణమును సాగించుచుండిరి. వారి సౌభాగ్యమును గాంచి ఇంద్రాది దేవతలందఱు మనస్సునందే ఆ వానరభల్లూకవీరులను ప్రశంసింపదొడంగిరి. భగవంతుడగు శ్రీరామచంద్రుడు ప్రసన్నహృదయాంతరంగుడై బయలు దేరగనే సీతాదేవి వామనేత్రము, భుజము అదరనారంభించెను. అదే సమయములో లంకానగరమందు అనేకములైన అపశకునములు ప్రారంభమయ్యెను. ఆదుశ్శకునములను గాంచినవారై అసురులందఱు చింతామగ్నులైరి.

విశాలమగు రామదండు విశ్రాంతినైనను దీసికొనక రేయింబవళ్ళు పయనించుచుండెను, వారందఱు శ్రీరాఘవేంద్రునితో మధ్యాచలమును, సహ్యాద్రిని, మనోహరములైన అరణ్యములను తరించుచు మార్గములో నేత్రానందకరములైన దృశ్యములను గాంచుచు తుదకు విశాలసాగరతటమును జేరిరి. ఆ ప్రదేశమందు వానరభల్లూకవీరులు అత్యధిక ప్రసన్నులై 'జయ శ్రీసీతారాం' 'జయ శ్రీలక్ష్మణరాం' యనుచు గర్జించిరి.

కోటానుకోట్ల వానరభల్లూకవీరుల గర్జనముల యెదుట సముద్రుని భయంకర గర్జనము ప్రభావహీనమయ్యెను.

## విభీషణునిపై అనుగ్రహము చూపుట

మహావీరు లగు వానరభల్లూకయోధులతో శ్రీరామచంద్రుడు దక్షిణసముద్రతటమును జేరెను. ఈ సమాచారమందగనే లంకానగరములో వ్యాకులత్వము వ్యాపించెను. రాక్షసులు, రాక్షసస్త్రీలు, మిగుల చింతితులై పరస్పరమిట్లు పలుకనారంభించిరి. ఒకేయొకవానరుడు సమస్త లంకానగరమునకు నిప్పుపెట్టి భయంకరమైన నష్టమును కలుగజేసెను. ఇపుడు కోటానుకోట్ల వానరవీరులచే ఈదేశమున కెట్టి దుర్దశ పట్టునోకదా! తుదకు దశకంఠుడుకూడ భయము చెందెను. వానిమనస్సు వ్యాకులమయ్యెను; కాని తన మనో

భావములను లోననే యుంచుకొని పైకి గంభీరముగ నుండెను. సభాభవనములో అతడు రాక్షసవీరుల నుద్దేశించి యిట్లు పలికెను. "వీరయోధులారా! వానరసైన్యములను దోడ్కొని దశరథకుమారులైన శ్రీరామలక్ష్మణులు లంకను ముట్టడించుటకు సముద్రమున కావలి తటమును జేరిరి. కావున తుచ్ఛులగు ఆవానరుల కెట్టిదండనము విధింపవలెనో మీరే యోచించి నిర్ణయించుడు".

రాక్షసాధిపతి పల్కిన వచనముల నాలకించి ముఖప్రీతి కొఱకై సభాసదులందఱు ఆతనిదుర్జయత్వమును, పరాక్రమమును, బలమును, శక్తియుక్తులను ప్రశంసింపనారంభించిరి. ప్రహస్తుడు, దుర్ముఖుడు, వజ్రదంష్ట్రుడు, ఇంద్రజిత్తు, మహాపార్శ్వుడు, మహోదరుడు, కుంభుడు, అతికాయుడు, కుంభకర్ణునికుమారుడైన నికుంభుడు మొదలగు రాక్షసవీరులందఱు రావణునకు నమస్కరించి వానిశౌర్యపరాక్రమములను పొగడుచు నిట్లుపల్కిరి. 'రాజా! క్షుధార్తుల మగు మాకు ప్రియాహారమైన నరవానరులు కాలప్రేరణముచే స్వయముగ మన సమ్ముఖమునకు వచ్చుట మా భాగ్యము. పవనపుత్రుడు మేమందఱము అసావధానులమైయున్న సమయములో మా యుదారతను ఆసరాగా తీసికొని లంకానగరమునకు నష్టమును కలిగించి వెడలిపోయెను. సమరాంగణములో మీాధనువునుండి బయల్వెడలు రెండునాల్కలు గలిగిన సర్పసమానములు, తీక్ష్ణ

ములు, విషయుక్తములు నగు శరపరంపరలను దశరథరాజ కుమారులు చూచియుండలేదు. ఆకారణమువలననే ప్రజ్వలిత దీపము పైబడి మరణించు పతంగములవలె ఈ ప్రదేశమునకు వారు ఏగుదెంచుటకు ప్రయత్నించుచున్నారు. విచారింప వలసినదేదియు లేదు. మీరు మాకు అనుజ్ఞను ప్రసాదింపుడు. ఈ క్షణముననే మేము సముద్రమున కావలి తటమును జేరి క్షుద్రవానరులను వెదకి వెదకి సంహరించెదము.

రావణుని శిరముపై మృత్యువు నృత్యమొనరించు చుండెను. వానికి ముఖప్రీతికరము లగు ఈయసత్యవాక్యములు సత్యములుగ గోచరించెను; కాని అదేసమయములో నీతి కుశలుడు, రావణశుభచింతకుడు వాని తమ్ముడు నగు విభీష ణుడు అన్నగారి చరణకమలములకు నమస్కరించి వినయ పూర్వకముగ నిట్లు పల్కెను. "అగ్రజా! నీవు బుద్ధిమంతు డవు, విద్వాంసుడవు, సకలనీతిరహస్యముల నెఱిగినవాడవు, సావధానుడవై ఒకింత ఆలోచింపుము. ఈ సభాసదులందఱు సత్యముగ హితము నాలోచింపక నిన్ను సంతుష్టునిగ నొన రించుటకు ఇట్లసత్యప్రలాపముల నొనరించుచున్నారు. శ్రీరామ చంద్రునిదూత యగు ఒక్కవానరుడు దుర్లంఘ్య మగు లంకానగరమును ప్రవేశించి ప్రమదావన సహితముగ లంక నంతయు నష్టభ్రష్టమొనరించెను. సైన్యస్థావరములను, వాహన ములను, మహత్వపూర్ణము లగు రహస్యప్రదేశములను తగుల

బెట్టుటయేగాక అత డసంఖ్యాకులగు రాక్షసవీరులతోపాటు మనవీరకుమారునిగూడ సంహరించెను. అన్నా! అంతటి వానరవీరులు కోటానుకోట్లుగ వచ్చినచో ఇక యేమి సంభవింపగలదో ఊహించుకొనుము. మన లంకానగరమంతయు అనాథవలె అగ్నిజ్వాలలలో మండుచున్న సమయమున యీ బీరములు పల్కు వీరులంద ఱెచటకు పోయిరి?

"రాక్షసేశ్వరా! శ్రీరామచంద్రుడు లోకసాధారణుడగు మనుష్యు డనుకొంటివా? కాదు. ఆయన సాక్షాత్తుగ అవ్యక్తాత్మస్వరూపు డైన శ్రీమన్నారాయణుడు. ఆయన ధర్మపత్ని యగు సీతాదేవి సాక్షాత్తుగ శ్రీమహాలక్ష్మి. సీత యీలంకానగరమునకు యమపాశమువలె అరుదెంచినది. కావున శ్రీరామచంద్రునిధనువునుండి తీక్షణములు కాలరూపములు నగు శరములు బయల్వెడలక మునుపే సమరప్రియులు, నఖదంష్ట్రాయుధ విశారదులు నగు భల్లూక వానరవీరసమూహములు లంకను ముట్టడించి నష్టభ్రష్టమొనరింపక మునుపే మేల్కొనుము. అసంఖ్యాకములగు రత్నరాసులతో శ్రీ మిథిలారాజకుమారిని శ్రీరాచంద్రునకు భక్తితో సమర్పింపుము. లేనిచో స్వయముగ కాలకంఠుడగు శంకరుడు, సురపతి, యముడు మొదలగువారందఱు నిన్ను రక్షించుచు పాతాళలోకమును ప్రవేశించినను శ్రీరామచంద్రుని యమోఘమగు బాణమునుండి నిన్ను రక్షింపలేరు."

విభీషణు డమిత మగు ఆదరముతో రావణున కిట్లు నివేదింప నారంభించెను. "మహామతిమంతుడా! పులస్త్య మహర్షి తనశిష్యునితో నీ కొకసందేశమును పంపెను. నీవు అహంకారమును విడచి సీతను ప్రభువుల ప్రభువైన శ్రీరామ చంద్రునకు సవినయముగ సమర్పించి ఆ దేవాదిదేవుని శరణువేడుము. నాయుద్దేశ్యములో నీవట్లు ఒనరించినచో నీకు, నాకు, మనవంశమునకు, లంకానివాసులకు శుభము కల్గును."

విభీషణుడు పల్కిన అక్షరసత్య మగు ఆలోచన నాల కింపగనే మాల్యవంతు డనుమంత్రి ప్రసన్నుడయ్యెను; అతడు దశగ్రీవునితో నమ్రతాపూర్వకముగ నిట్లు పల్కెను. "స్వామీ! నీకనిష్ఠసోదరుడు, పరమనీతినిపుణుడు నగు విభీష ణుడు ఉచిత మగు వాక్యములను పల్కెను. వీనియాలోచనను మన్నించుటచే నీకు మంగళమగును."

కాని కాలప్రేరితుడై యున్న దశాననునకు వారు పల్కిన హితవచనము లప్రియములయ్యెను. అతడు కోపముతో పండ్లుకొఱకుచు నిట్లు పల్కెను. "అసురులారా! శత్రువులను ప్రశంసించుచున్న ఈ యిర్వురుమూర్ఖులను ఈసభనుండి బయటకు నెట్టుడు."

రావణునియాజ్ఞ నాలకింపగనే వానితాత యైన మాల్య వంతుడు సభను వీడిపోయెను. తనసోదరునిశుభమును కాంక్షిం చినవాడై విభీషణుడు మరల వినయపూర్వకముగ నిట్లు పలుక

నారంభించెను. "దైత్యకులావతంసా! నీవు కృపాపూర్వకముగ నే పల్కిన హితవచనముల నాలకింపుము. విదేహరాజకుమారి యగు సీతాదేవి లంకను ప్రవేశించిన సమయములో అనేక దుశ్శకునములు సంభవించుట నీవు ప్రత్యక్షముగ చూచితివి. అపుడే ఆదుశ్శకునములనుగుఱించి వివరించుటకు మంత్రులు సంకోచించిరి. నేను మరల నీకు నమస్కరించుచున్నవాడనై విన్నవించుకొనుచున్నాను. "శ్రీరామచంద్రుడు ధర్మాత్ముడు సత్యపరాక్రముడు. నీయొక్కకుమారుడైన ఇంద్రజిత్తుగాని, మహాపార్శ్వమహోదరకుంభనికుంభాతికాయాదిరాక్షసవీరులైన గాని, తుదకు నీవైనకాని సమరాంగణములో శ్రీరాచంద్రు నెదుట ఒక్కక్షణమైనను నిలువజాలరు; కావున ఆయనతో శత్రుత్వమువహించుట నీకు ఉచితముకాదు. అమోఘములు, అప్రతిహతములు నగు ఆకోసలేంద్రుని శరములను స్మరించి జనకరాజకుమారి యగు సీతను ఆయనకు సమర్పించి క్షమింపు మని ప్రార్థించుటలో నీకు శుభముకల్గును.

విభీషణుడు పల్కిన హితవచనముల నాలకింపగనే రావణుడు మిగుల కోపించెను. క్రోధముతో కంపించుచు నిట్లు పల్కెను. "అసురకులమునకు కళంకమైనవాడా! నే ననుగ్రహించిన భోగభాగ్యములచే శరీరమును బాగుగ పెంచినవాడవైన నీవు నేడు నాయెదుటనే శత్రువులను పొగడుచుంటివి. శత్రువు లయెదుట నే నవమానము చెందుచుండగ చూడవలెనని నీవు

ఆకాంక్షించుచున్నావు కాబోలు, అది అసంభవము. నా భయమువలన ముల్లోకములు కంపించును: కాని నీవు నన్నొక సామాన్యమానవుని యెదుట భయపెట్టుటకు ప్రయత్నించుచున్నావు. ధిక్కారము, ధిక్కారము! నీవుదక్క అన్యు లెవ్వరైనను ఇట్లు పలికినచో వెంటనే అసువులుబాసియుండెడివారు".

క్రోధోద్దీపిత మానసుడై రావణుడు విభీషణుని కాలితో తన్ని 'ధూర్తుడా! పొమ్ము! ఆవనవాసి యగు మానవునితో చేతులుగలుపు'మని తిరస్కారముగ పలికెను.

దశకంఠుడు పల్కిన కటువచనముల నాలకించి వాని పాదప్రహారమును సహితము సహించి బుద్ధిమంతుడు, మహాబలవంతుడు నైన విభీషణు డగ్రజుని చరణములకు నమస్కరించి, తననల్వురుమంత్రులను తోడ్కొని, గదాధారియై ఆకసమున కెగిసినవాడై రావణునితో నిట్లుపల్కెను.

శ్లో॥ సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః ।
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః॥
(వా.రా. 1-16-21)

'రాజా! ఎల్లప్పుడు ప్రియమును గొల్పుమాటలను పల్కువారు సులభముగ లభించెదరు; కాని వినుట కప్రియము లైనను పరిణామములో హితకరము లైన వచనములను పలుకువారు, వినువారు కూడ దుర్లభులే'యని తెలిసికొనుము.

"అగ్రజా! నీవు నాకు పితృసమానుడవు. నీపాదప్రహారమునకు, కటుభాషణములకు నేను చింతించుటలేదు. కాని నీవు నీవినాశమును స్వయముగనే ఆహ్వానించుచున్నవాడ వని నేను వ్యాకులము చెందుచున్నాను. నీవు నీసభాసదులు కాలమునకు వశులైతిరి. కావుననే మీరు విపరీతముగ ఆలోచించుచున్నారు. నిర్ణయములను తీసికొనుచున్నారు. నీవు, నీపుత్రులు, సైన్యము, రాక్షసవంశము శ్రీరామచంద్రునిచే సంహరింపబడుట నేను చూడలేను. ఈకారణమువలననే శ్రీరఘువీరుని శరణువేడుటకు పోవుచున్నాను."

విభీషణు డిట్లుపల్కి మంత్రులతోఁగూడినవాడై శ్రీరామచంద్రుని శరణువేడుటకు ఆకాశమార్గమున బయలుదేరెను. వానిహృదయములో ఆనందపు టలలు ఉప్పొంగుచుండెను. శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహమును దర్శింపవలెననియు, ఆయన చరణారవిందములను శరణుపొందవలెననియు విభీషణునిమనస్సు ఆతురత చెందుచుండెను. అతడు తా నిట్లాలోచించుకొనుచుండెను. "ఆహా! నాయనేకజన్మములపుణ్యాము నేడు ఫలించబోవుచున్నది. దేవతలు, మహర్షులు జన్మజన్మముల పర్యంతము తపమొనరించినను ఆభక్తసుఖదాయకుని చరణారవిందములను పొందలేరు. పరమప్రభు వగు శ్రీరామచంద్రుని అరుణారుణ చరణారవిందములను నేడు నేను దర్శింపగల్గెదను. ఎవ్వనిచరణ కమలముల సంస్పర్శనముచే పాషాణ

మైన గౌతమునిపత్ని యగు అహల్య స్వస్వరూపమును పొంది సంసారమును తరించెనో, ఎవని యరుణ చరణములను భగవతి యగు సీతాదేవి తనహృదయమున ధరించియుండెనో, కర్పూర గౌరాంగు డగు శ్రీమహాదేవుడు తన హృదయాంతరంగములో సదా ధ్యానించుచుండునో, లోకపావనములగు ఎవని పాదుక లను భాగ్యవంతు డగు భరతుడు శ్రద్ధాభక్తులతో నిరంతరము పూజించుచుండెనో, అధముఁడను రాక్షసుడను నైన నేను శ్రీరామచంద్రుని ఆదివ్యచరణములను దర్శించు భాగ్యమును పొందబోవుచున్నాను.

ఇట్లాలోచించుకొనుచు ఇంద్రునిసమానమైన తేజస్సు కలవాడు, ఉత్తమములగు ఆయుధములను ధరించినవాడు, దివ్య భూషణములచే అలంకృతుడు, కవచమును ధరించినవాడు నగు విభీషణుడు తననల్వురుమంత్రులతో సముద్రమును దాటి ఆవలి తీరమును జేరెను. పర్వతము వలె భాసించుచు వచ్చుచున్న విభీషణుని గాంచి వానరులు రావణునిదూత యనుకొనిరి. వానరవీరు లీవిషయమును సుగ్రీవునకు విన్నవించిరి. అపుడు వానరరాజైన సుగ్రీవుడు భగవంతు డగు శ్రీరామచంద్రునితో వినయపూర్వకముగ "ప్రభూ! రావణునిసోదరుడైన విభీష ణుడు నిన్ను దర్శించుటకు వచ్చుచున్నాడు." అనిపలికెను. అపుడు శ్రీరాముడు కిష్కింధాధిపతితో "స్నేహితుడా ఈ విషయములో నీయభిప్రాయమును చెప్పు" మనెను.

నీతినిపుణు డైన సుగ్రీవుడు "ప్రభూ! రాక్షసులు మిగుల మాయావులు. వారిలో అంతర్ధాన మగు శక్తి కూడ కలదందురు. శూరుడు, వీరుడు నైన విభీషణు డత్యంత క్రూరు డగు రావణునిసోదరుడు, కావున వీనిని మంత్రులతో పాటు వధించుట ఉచిత మనిపల్కెను.

సుగ్రీవునివచనముల నాలకింపగనే శ్రీ పవనకుమారుడు వ్యాకులుడయ్యెను. తనకు సన్నిహితు లైన వారలను శ్రీరామచంద్రుని చరణారవిందములకు చేర్చి సంతుష్టు డగుట శ్రీ ఆంజనేయుని సహజస్వభావము. లంకలో విభీషణునకు ఆంజ నేయునకు పరిచయమయ్యెను. వానినిశ్చలమగు భక్తికి ప్రభా వితుడయ్యెను. సీతాదేవిజాడను అతడే శ్రీహనుమంతునకు చెప్పెను. రావణునిసభలో శ్రీ ఆంజనేయునిపక్షమున వాదిం చెను. తనసర్వస్వమును త్యజించి శ్రీ రామచంద్రునిచరణముల చెంతకు వచ్చెను. అట్టిపరిస్థితిలో వానరరాజు విభీషణునివిష యమై కటువుగ పల్కుట శ్రీ ఆంజనేయున కనర్థముగ తోచెను. పవనకుమారుడు శరణాగతవత్సలు డగు శ్రీ రాముని యాదేశముకొఱకై నిరీక్షించుచుండెను.

భక్తులసర్వస్వమైనవాడు, భక్తసులభుడు నగు శ్రీరామ చంద్రుడు సుగ్రీవునితో నిట్లుపల్కెను.

శ్లో॥ ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణం గతః ।
అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా ॥

వినష్టః పశ్యత స్తస్య రక్షిణః శరణం గతః ।
ఆనాయ సుకృతం తస్య సర్వం గచ్ఛేదరక్షితః ॥

ఏవం దోషో మహానత్ర ప్రపన్నా నామరక్షణే ।
అస్వర్గ్యం చాయశస్యం చ బలవీర్యవినాశనమ్ ॥
(వా. రా. 6-18-28-31)

సఖుడా! నీవు నీతియుక్తమగు సుందరవచనమును పల్కితివి; కాని శత్రువు దుఃఖితుడై తనశత్రువులను శరణు జొచ్చినచో పరిశుద్ధహృదయముగల శ్రేష్ఠుడగు పురుషుడు తనప్రాణములను సహితము త్యజించి వానిని రక్షింపవలయును. శరణాగతుడగువాడు రక్షణమును పొందక రక్షకుడు చూచు చుండగనే నశించినచో అతడు రక్షకుని సకల పుణ్యములను తనతో తీసికొని వెళ్ళగలడు. ఇట్లు శరణాగతుని రక్షింపనిచో మహత్తర మగు దోషము సంభవించునని చెప్పబడినది. శరణాన్నవానిని త్యజించుట స్వర్గసౌఖ్యములను, సుయశమును నశింపజేయును. మనుష్యునిబలవీర్యములను హరింపజేయును.

కావున లెక్కలేనన్ని బ్రహ్మహత్యలను గావించినవాడై నను శరణుజొచ్చిన వానిని నేను విడువజాలను. ఏక్షణమున జీవుడు నన్ను శరణువేడునో, ఆక్షణముననే వానిపాపము లన్నియు నశించిపోవును. వానరరాజా! సుగ్రీవా!

శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥
(వా.రా. 6-18-33)

నన్ను శరణుజొచ్చి పరిశుద్ధహృదయముతో నేను నీ వాడ ననిపల్కినవానిని నేను సర్వప్రాణులనుండి నిర్భయునిగ నొనరించెదను. ఇది నావ్రతము.

నేను సంకల్ప మాత్రముననే లోకపాలకులతో పాటు సమస్తవిశ్వమును లయమొనరించి మరల సృష్టింపగలను. అసురులనందఱిని లక్ష్మణుడు ఒక్కక్షణములో సంహరింపగలడు. కావున నీవు చింతింపవలసినపనిలేదు. వెంటనే విభీషణుని తోడ్కొనిరమ్ము."

భక్తానుగ్రహావిగ్రహుడైన శ్రీరామచంద్రునిమధుర వచనముల నాలకించిన పవననందనునియానందమునకు మేరలేక పోయెను. ఆయన శరీరము పులకించెను. నేత్రములు ప్రేమాశ్రువులతో నిండెను.

భక్తవత్సలుడైన శ్రీరామచంద్రునకు 'జయమగుగాక' యని శ్రీఆంజనేయుడు సింహనాదమొనరించెను. అంగదాది వానరులను దోడ్కొని ఉల్లాసపూర్వకముగ ఎగిరినవాడై శ్రీఆంజనేయుడు విభీషణునిచెంతకు జని అతనిని ఆదరపూర్వకముగ ప్రభుసమీపమునకు దోడ్కొనివచ్చెను. జటాజూటము

లను ధరించి శ్యామగౌరవర్ణముతో ప్రకాశించు శ్రీరామలక్ష్మ ణుల యలౌకికసౌందర్యమును కన్నులార విభీషణుడు దర్శిం చెను. కొన్నిక్షణము లట్టియానందస్థితిలో నుండి విభీషణుడు ప్రభుపాదములపై బడి సాష్టాంగదండప్రణామముల నొనరిం చుచు నిట్లు ప్రార్థించెను. "పంకజలోచనా! శ్రీమన్నారా యణా! శరణు, శరణు. ప్రభూ! నీసహధర్మచారిణి యగు సీతా మాతను హరించినవాడు, రాక్షసకులోత్పన్నుడు, దుష్టుడు నగు దశకంఠునికనిష్ఠసోదరుడ నైన విభీషణుడను. నేను అత్యంత తామసప్రవృత్తిగల్గిన రాక్షసుడను, అధముడను. విదేహరాజకుమారి యగు సీతను నీకు సమర్పించి శరణు వేడు మనినాయగ్రజుడగు రాక్షసరాజు ననేకవిధముల ప్రార్థించితిని. కాని ఆతడు కాలవశుడై నాపై కోపించెను. దూషించి నన్ను కాలితో తన్నెను. దేవాదిదేవా! నేను నీదివ్యచరణార విందములను స్మరించినవాడనై యీ సంసారబంధముల నుండి ముక్తుడ నగుటకు ముముక్షువునై నా దారాపుత్రాదులను లంకలో వదలి మంత్రులతో కలసి భువనపావనము లగు నీ చరణారవిందములను శరణుజొచ్చితిని. కరుణానిధానుడా! నీవు అధముడనగు నాపై కృపాదృక్కులను ప్రసరింపజేసి జన్మమును సఫలమొనరింపుము. నీదివ్యపాదారవిందములనీడలో నాకు ఆశ్రయము నిమ్ము."

విభీషణుడు భక్తితో పల్కిన పలుకుల నాలకింపగనే

భక్తప్రాణధనుడైన శ్రీరాముడు ప్రభువు దిగ్గున లేచి నిలుచుండెను. ఆజగన్నాథుడు తనచరణముల నాశ్రయించి ప్రార్థించుచున్న విభీషణుని లేవనెత్తినవాడై విశాలభుజములను చాచి హృదయమునకు హత్తుకొని ఆలింగనమొనరించుకొనెను. తదనంతరము ప్రీతిపూర్వకముగ విభీషణుని తనచెంత కూర్చుండబెట్టుకొని 'లంకేశ్వరా!' యనిసంబోధించెను.

గద్గదకంఠముతో విభీషణుడు శ్రీరామచంద్రుని స్తుతించినవాడై యిట్లునివేదించెను. "ప్రభూ! సురమునిదుర్లభములు, తాపత్రయహరములు నగు నీ దివ్యచరణారవిందములను దర్శించినమాత్రముననే నేను కృతార్థుడనైతిని. నాజీవనము సుజీవనమయ్యెను. నాకు సర్వస్వము లభించెను. రాజరాజేశ్వరా! శ్రీరామభద్రా! నాకు విషయ సుఖములపై ఇచ్ఛ లేదు. నాకు నీచరణసరోజములపై అహైతుకభక్తిని (ప్రతిఫలము నాశింపని భక్తిని) ప్రసాదింపుము."

కాని శ్రీరామచంద్రుడు అనుజుడైన సౌమిత్రితో "లక్ష్మణా! నన్ను దర్శించినందులకు విభీషణునకు ఫలమీక్షణమందే లభింపవలయును. సాగరజలమును తెమ్ము." అని పల్కెను.

సీతామనోవల్లభుడైన శ్రీరామునాజ్ఞను పొందగనే రామానుజుడు కలశముతో సాగరజలములను తెచ్చెను. విభీషణుని ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి వానరభల్లూకవీరులు

'జయజయ' ధ్వానముల నొనరించుచుండగా లంకానగరమునకు వానిని సామ్రాట్టుగ అభిషేకించెను. రావణుడు తన పది శిరములను సమర్పించి శంకరుని ప్రసన్నునిగ చేసికొని పొందిన సకలైశ్వర్యములను శ్రీ ఆంజనేయుని యనుగ్రహమునకు పాత్రుడైన విభీషణునకు శ్రీరామచంద్రుడు ప్రసన్నుడై అనుగ్రహించెను.

విభీషణుని పట్టాభిషేకమును గాంచి వానరభల్లూక వీరులందఱు ప్రసన్నులైరి. శ్రీ ఆంజనేయుని యానందమున కవధులు లేకపోయెను. శ్రీ ఆంజనేయుని కృపావిశేషమువలననే విభీషణుడు శ్రీరామచంద్రుని యనుగ్రహమునకు పాత్రుడైనా డనుట నిర్వివాదాంశము. లంకాధిపతియైన రావణునిచే తిరస్కృతుడై నిరాశ్రితుడైన విభీషణుడు శ్రీ అంజనానందనుని యనుగ్రహముచే నిఖిలసృష్టికి ప్రభువైన శ్రీరామచంద్రుని యాశ్రయమును పొందెను. లంకాధిపతి యగుటయేగాక ప్రభువునకు ఆత్మీయుడు, స్వజనుడు నయ్యెను. దయార్ద్రహృదయుడు, కరుణావారధియు నగు శ్రీ ఆంజనేయుని యనుగ్రహమున కిది సజీవ మగు నిదర్శనము.

## సేతుబంధనము

సర్వసమర్థు డగు శ్రీరామచంద్రుడు లంకను చేరుటకు మార్గముకొఱకై మూడుదినముల పర్యంతము సముద్రుని

ప్రార్థించెను. కాని మూఢుడైన సముద్రునిపై శ్రీరామ చంద్రుని యనునయ వినయముల ప్రభావ మొకింతైనను పడ కుండుట చూచి ఆయన కోపించెను. శ్రీరామచంద్రుని విశాలనేత్రములు పంకజవర్ణము లయ్యెను. అపు డాయన బ్రహ్మదండముతో సమమైన భయంకర మగు బాణమును సంధించి అభిమంత్రించి ఆకర్ణాంతము ధనువును లాగుచు నిట్లుపల్కెను. "నేడు సర్వులు ఈ రఘుకులోద్భవు డైన శ్రీరాముని పరాక్రమమును చూచెదరుగాక! నే నిప్పుడే యీ సముద్రుని శుష్కింపజేసెదను. తదనందరము కోటాను కోట్ల వానరభల్లూకవీరులు సాగరమును తరించి లంకను చేర గలరు".

అచింత్యశక్తి సంపన్నుడు, మహాబాహుడు నగు శ్రీరాము డొనరించిన ధనుష్టంకారమునకు పృథ్వి కంపించెను. పర్వతములు వణకెను. సూర్యుడు ప్రకాశించుచుండగనే దశ దిశ లంధకారముతో నిండెను. అంతరిక్షములో తుములధ్వను లతో పిడుగులు పడనారంభించెను. సముద్రుడు వ్యాకులుడై భయముతో కంపించుచు జాంబూనదములను దివ్యాభరణము లను ధరించి స్నిగ్ధ మగు వైడూర్యమణివలె ప్రకాశించుచు హస్తములతో అనేకదివ్యమణులను, రత్నములను కానుకలుగ దీసికొని శ్రీరామచంద్రుని సమ్ముఖమున కేతెంచెను. అపరి మితమగు శక్తిసంపన్ను డైన ప్రభుని చరణారవిందములకు

సాష్టాంగ దండప్రణామముల నర్పించి, కానుకల నిచ్చి వినయ పూర్వకముగ స్తుతించి యిట్లు పలికెను. "దేవాదిదేవా! సృష్టినిర్మాణసమయమందు నీవే నన్ను జడునిగ సృష్టించితివి. కావున నాజడత్వముపై దృష్టి నుంచక నన్ను క్షమింపుము. నాపై కృపను జూపుము. వానరసైన్యములో శిల్పకళానిపుణు లైన నలుడు, నీలు డను వానరులు కలరు. నీ కృపావిశేషముచే మహర్షుల యాశీర్వాదబలముచే ఆ యిర్వురు శిల్పులు స్పృశించినంత మాత్రముననే పర్వతము లైనను నాపై తేలి యాడగలవు. వీరు సుందరము సుదృఢము నగు సేతువును నిర్మించుటలో సమర్థులు. నేనుకూడ వారితో సహకరించెను. ఇట్లొనరించినచో నామర్యాద సురక్షితముగ నుండగలదు. అందఱు ఈ ప్రపంచములో సకలపాపములను హరింపగల నీ కీర్తిని గానమొనరించెదరు". శ్రీరామచంద్రుడు సముద్రుని ప్రార్థన విని తా నెక్కుపెట్టిన దివ్యాస్త్రమును ద్రుమకుల్య మను ప్రదేశముపై విడచెను. రామబాణ మాప్రదేశమును నాశనమొనరించి తిరిగి శ్రీరామచంద్రుని తూణీరమును చేరెను. ప్రభువు సేతువును నిర్మింపవలసినదిగ ఆజ్ఞాపించెను.

"జయ శ్రీరాం, జయ శ్రీసీతారాం, జయ శ్రీలక్ష్మణ రాం" అనుచు వానరసైన్యమంతయు జయజయాకారముల నొనరించినవి. ఆ విజయఘోష ఆకాశమునంతయు ప్రతి ధ్వనింపజేసెను. శ్రీఆంజనేయుని యుత్సాహమున కవధులు

లేకపోయెను. ఆయనయే స్వయముగ పర్వతశిలలను, వృక్షము లను దెచ్చి నల నీలుల యాదేశానుసారముగ సముద్రములో వేయుచుండెను. చంచలు రగు వానరులు సంయమునై శ్రీ ఆంజనేయు ననుసరించిరి. శ్రీ ఆంజనేయుని యుత్సాహమును దక్షతను, శ్రమను గాంచి సర్వవానరభల్లూకవీరులు ప్రోత్సాహితులై యెగురుచు, దుముకుచు పర్వతశిలలను దెచ్చి సాగరములో పడవేయనారంభించిరి. నలనీలులుకూడ ఎంతయో శ్రమించినవారై మొదటిదినముననే పదునాల్గు యోజనముల దూరము సేతువును నిర్మించిరి.

శ్రీ ఆంజనేయునకు సంతోషము కలుగలేదు. మరుదినమున ఆయనవానరభల్లూకవీరులను మరింత ప్రోత్సాహపరుప సాగెను. దానివలన ఆదినము ఇరువది యోజనములదూరము సేతువు నిర్మింపబడెను; అయినను శ్రీ హనుమకు సంతృప్తి కలుగలేదు. జానకియొక్క కరుణామయమగు రూపము శ్రీ ఆంజనేయుని హృదయమును వ్యాకులమొనరించుచుండెను. శీఘ్రాతిశీఘ్రముగ సీతాదేవిని శ్రీ రామచంద్రుని చరణముల చెంతకు చేర్చవలెనని, లంకాధిపతి యగు రావణునకు ముక్తి నొసంగవలెనని శ్రీ ఆంజనేయుడు వ్యగ్రుడగుచుండెను. నలుడు, నీలుడు సేతునిర్మాణకార్యక్రమములో విశ్రాంతినైనను తీసికొనక పరిశ్రమించుచుండిరి. వానరభల్లూకవీరులు తోడ్పడుచుండిరి. శ్రీ ఆంజనేయుడు అందఱిశ్రమను ప్రశంసించి, వారిని ఉత్సాహపరచుచుండెను. దానివలన మూడవదినమున ఇరు

వదియొక్క యోజనములదూరము నిర్మాణమయ్యెను; అయినను శ్రీఆంజనేయునకు పూర్ణమగు తృప్తి కలుగలేదు. ఆయన వనములకు, పర్వతములకు శీఘ్రముగ పోవుచు, వచ్చుచు శిలలను వృక్షములను అసంఖ్యాకములుగ తెచ్చుచుండెను. అందఱిని ప్రోత్సహించుచుండెను. వానరభల్లూకవీరులందఱు శ్రీమారుతాత్మజుడు తమచెంతనే యున్నాడని భావించుచుండిరి. నాల్గవదినమున ఇరువదిరెండు యోజనముల వారధి నిర్మింపబడెను.

బుద్ధిలో, తేజస్సులో, శక్తిలో, పరాక్రమములో, అగ్రగణ్యుడైన శ్రీపవనకుమారుడు వానరసమూహములను ప్రోత్సహించుచు నిట్లు పలికెను. "పరమభాగ్యవంతులైన వానరభల్లూకవీరులారా! జగన్నియంత యగు శ్రీరామచంద్రునియొక్క నిఖిలభువనములకు జననియైన జానకీదేవియొక్క కార్యములో నిమిత్తమాత్రు లగుట నిశ్చయముగ మీసౌభాగ్యము. లేనిచో భగవంతుడగు శ్రీరామచంద్రుడు తన సంకల్పమాత్రముననే సకలరాక్షసులను సంహరింపగలడు. ప్రభుచరణసేవయందు మనయందరి జీవనములు సుజీవనములగుచున్నవి, జన్మములు సఫలములగుచున్నవి. ఇట్టి అదృష్టము ఇంద్రాది దేవతలకైనను దుర్లభమని తెలిసికొనుడు. నేటివరకు ఇరువదిమూడు యోజనములదూరము సేతునిర్మాణము మిగిలియున్నది. కావున నేటితో మిగిలిన సేతువును లంకానగరమువఱకు పూర్తిచేయవలసినది.

# గోవర్ధనగిరి

'జయ శ్రీరాం, జయ శ్రీసీతారాం' అనుచు కోటాను కోట్లవానరభల్లూకవీరు లందఱు గర్జించిరి. శ్రీఆంజనేయుడు సింహనాద మొనరించుచు శ్రీరామచంద్రుని దివ్యనామము లను కీర్తించుచు విశాలము లగు పర్వతములను తెచ్చుటకు బయలు దేరెను. దక్షిణదిశయందుగల పర్వతములన్నియు సేతునిర్మాణమునకు వినియోగింపబడెను. శ్రీపవనకుమారుడు ఉత్తరదిశగ పర్వతముల నన్వేషించుచు బయలుదేరెను. సప్త యోజనములు విస్తరించియున్న ఒకపర్వతమును ఆయన గాంచెను. ఆపర్వతనామమే 'గోవర్ధనగిరి' భగవను డైన శ్రీరామచంద్రుని యవతారసమయములో దేవగణము లన్నియు దుర్లభములు, మంగళమయములు నగు ఆయన లీలలను దర్శించుటకు, ఆయనను సేవించుటకు అవనిపైకి దిగి వచ్చెను. అపుడే శ్రీగోవర్ధనశిఖరముకూడ గోలోకమునుండి అవనిపైకి వచ్చెను.

శ్రీఆంజనేయు డా పర్వతమును పెకలించుటకు ప్రయ త్నించెను. తనసర్వశక్తిని వినియోగించినను ఆగిరిశిఖరము కదలలేదు. శ్రీరామభక్తు డైన శ్రీఆంజనేయు డాశ్చర్యచకి తుడై ప్రభువును ధ్యానించెను. అపు డా ద్రోణగిరి సాక్షాత్తుగ భగవంతునిస్వరూప మైన గోవర్ధనపర్వతమని, అది గోలోకము నుండి పృథ్వికి వచ్చెనని, ఆపర్వతమునందు గల శిలలన్నియూ సాలగ్రామములని శ్రీఆంజనేయుడు గ్రహించెను.

అప్పు డాయన మహిమామయ మగు శ్రీగోవర్ధనమున కత్యంతాదరపూర్వకముగ నమస్కరించి చేతులు జోడించి వినయముగ నిట్లు పల్కెను. "పర్వతరాజా! పరమపావనుడా! నేను నిన్ను భగవంతుని చరణముల చెంతకు చేర్చవలెనని ప్రయత్నించుచున్నాను. నీ వెందులకు ప్రసన్నుడవగుట లేదో నా కవగతము కాకున్నది! దయాధాము డగు ప్రభుని దివ్య మంగళ దర్శనము నీకు లభించుటయేగాక సుఖశాంతులకు నికేతనము లైన తనదివ్యచరణారవిందములతో నిన్ను స్పృశించుచు ఆజగన్నాథుడు సముద్రమును దాటి లంకను చేరగలడు."

శ్రీరామచంద్రునికి ప్రీతిపాత్రు డైన శ్రీరుద్రావతారుని వచనముల నాలకింపగనే గోవర్ధనగిరి ఆనందమగ్నడయ్యెను. 'ఆహా! ఆ ప్రదేశములో నాకు దుర్లభమగు భగవానుని దర్శనము లభించును. స్వామి నాపై తాపత్రయహారములైన తనచరణకమలముల నుంచి సముద్రమును దాటగలడు'. ఇట్లాలోచించుకొనగనే గోవర్ధనగిరి యానందమునకు మేరలేక పోయెను. అతడు శ్రీ ఆంజనేయునితో నిట్లుపల్కెను. "పవనకుమారా! నీ యనుగ్రహమున కత్యంత కృతజ్ఞుడను. నీ వొనరించు ఈ మహోపకారమునకు నేను ప్రత్యుపకారమెన్నటికిని చేయలేను. దయామయుడా! శీఘ్రాతిశీఘ్రముగ నన్ను ఆ దేవాది దేవుని దివ్యచరణారవిందముల చెంతకు గొనిపొమ్ము. నీవు నాపై జూపించుచున్న యీ కృపావిశేషమునకు నేను సదా ఋణగ్రస్తుడనై యుండెదను."

శ్రీ ఆంజనేయుడు గోవర్ధనము నవలీలగ నెత్తెను. కపీశ్వరుని వామహస్తముపై గోవర్ధనగిరి ఒక పుష్పమువలె నుండెను. ఆ పర్వతేశ్వరుని ఆనందమునకు మేరలేకపోయెను. అతడు ఇట్లనుకొనెను. 'నేడు మహావీరుడైన హనుమంతుని కృపావిశేషముచే నా చిరకాల వాంఛితము నెఱవేఱనున్నది. మంగళమయుడు, పరోపకారమూర్తియు నగు పవనాత్మజుడీప్రకారముగ నెందఱికి హిత మొనరించెనో కదా! భాగ్యవశమున నేడీమహిమాన్వితుని దర్శనము కల్గెను. ఈయనను స్పృశించు అదృష్టము సంప్రాప్తమయ్యెను. నేడు ఈ భక్తాగ్రేసరుని యనుగ్రహావిశేషముచే కమలనయనుడు, నా జీవన సర్వము నైన భగవంతుని దర్శనము కలుగబోవుచున్నది.'

ఇట్లు గోవర్ధనగిరి ప్రభువును, భక్తుని స్మరించుచు గుణగాన మొనరించుచుండెను. అచట భక్తవాంఛాకల్పతరువైన శ్రీరామచంద్రుడిట్లాలోచించెను. 'ఈ గోవర్ధనగిరి గోలోకవాసి, నా మనోహరమైన మురళీధరమూర్తిని సదా ధ్యానించు అనన్యభక్తుడు. అతడు నన్ను శ్రీకృష్ణరూపమున దర్శింపవలెనని ప్రార్థించినచో అది యీయవతారమున సంభవము కాదు.'

ఇట్లు శ్రీరామచంద్రుడాలోచించుచుండగనే ఐదవ దినమున నూఱు యోజనముల పొడవు, పది యోజనముల వెడల్పుగల సేతునిర్మాణములో మిగిలిన ఇరువదిమూడు

యోజనముల నిర్మాణము పూర్తియయ్యెను. "సేతుబంధన కార్యము పరిపూర్ణమయ్యెను. కావున వృక్షపర్వతాదులయవసరము లేదు. వారివారి చేతులలో నున్న పర్వతములను, వృక్షములను ఆ యా ప్రదేశములందే విడచి శీఘ్రముగ సాగరతటమును జేరవలయు"నని శ్రీరామాజ్ఞ అంతట వెంటనే చాటబడెను.

చంచలులైన వానరవీరులు పరుగుపరుగున దశదిశలకు పోయి శ్రీరామచంద్రు నాజ్ఞను తెలియజేసిరి. అందఱు వెంటనే తమహస్తములలోనున్న శిలలను, వృక్షములను, పర్వతములను వదలినవారై ప్రభుసమీపమునకు పరుగిడనారంభించిరి. నేడు దక్షిణాపథములో నున్న పర్వతము లన్నియు నాడు వానరవీరులు వదలివేసనని పురాణవేత్తలు పల్కెదరు. దక్షిణమున నున్న పర్వతము లన్నియు సేతునిర్మాణకార్యక్రమమున కుపయోగింపబడెను.

మహామహిమామయు డగు కేసరీకిశోరుడు గోవర్ధనమును వామహస్తము పైకెత్తినవాడై ఆకాశమార్గమున పయనించుచు వ్రజభూమిని దాటుచుండెను. అపుడే శ్రీరామాజ్ఞ నాలకించినవాడై ఆమహావీరుడు గోవర్ధనగిరిని ఆక్షణమందే వ్రజభూమిపై నుంచెను. ఈహఠాత్పరిణామమునకు గోవర్ధనగిరి హతోత్సాహుడై ఆశాభరితములగు నేత్రములతో శ్రీఆంజనేయునిచూచెను. తా నిచ్చిన మాటను మరువని హరతనయుడు

గోవర్ధనముతో 'పర్వతేశ్వరా! నీవు చింతింపకుము. భక్తప్రాణ ధను డైన నాస్వామిని ప్రార్థించెదను. ఆయన తప్పక నే నిచ్చిన మాటను సత్యమొనరించి నిన్ననుగ్రహింపగలడు.' పవ నాత్మజుని ఆశ్వాసనమునకు గోవర్ధనగిరి ప్రసన్నుడై భగవం తునియాగమనమునకొఱకై నిరీక్షింపసాగెను. శ్రీఆంజనేయుడు శ్రీరామచంద్రునిచెంతకు జని ఆయన చరణారవిందములకు నమస్కరించి వినీతుడై స్తుతించెను. దయామయుడు, సర్వజ్ఞుడు నైన ప్రభువు నీయభీష్ట మేమనిప్రశ్నింప, శ్రీఆంజ నేయుడిట్లు వినమ్రుడై విన్నవించెను. "భక్తజనవల్లభా! నేను శ్రీగోవర్ధనగిరికి నీదర్శనమునుగల్గించెదనని, పతితపావనములగు నీచరణారవిందములసంస్పర్శాసౌభాగ్యము నొసంగెదనని బాస చేసితిని; కాని వానరవీరులు నీయాదేశమును నాకు అందింపగ నే నే నా పర్వతేశ్వరుని వ్రజభూమిపై నుంచితిని. అతడు ఖిన్నుడై నన్ను ప్రార్థింపగా నేను నీదర్శనమును, స్పర్శను తప్పక కల్గించె దనని మరల బాసచేసితిని."

సర్వాంతర్యామి, భక్తవత్సలుడు నైన శ్రీరామచం ద్రుడు శ్రీహనుమంతునితో నిట్లు పల్కెను. "ప్రియభక్తుడా! నీ విచ్చిన మాట నామాటయే యని తెలిసికొనుము. శ్రీగో వర్ధనపర్వతమునకు నాయనుగ్రహము తప్పక ప్రాప్తించును. అతడు మయూరమకుటముతో మురళీగానవినోది యగు నా శ్రీకృష్ణ రూపమును సదా ఆరాధించును, కావున ద్వాపరయుగములో నేను శ్రీకృష్ణుడనై అవతరించెదను. ఆయవతారములో గోవ

ర్ధనగిరిని అనుగ్రహించెదను. వ్రజబాలకులతో కలసినవాడనై గోవర్ధనగిరిపై విహరించుచు మధురఫలముల నారగించెదను, గోవులను గోవర్ధనముపై పాలించెదను; అంతియేకాదు, ఆ పర్వతశ్రేష్ఠుని సప్తదినములపర్యంతము నాచిటికెనవ్రేలిపై ధరించెదను. ఈవిషయముల నన్నింటిని ఆగిరిరాజునకు తెల్పుము."

కృపామూర్తి యగు శ్రీరామచంద్రునకు "జయ" మనుచు శ్రీపవనకుమారు డానందముతో అంతరిక్షమున కెగిరి గోవర్ధనమును చేరెను. "గిరిరాజా! నీవు ధన్యుడవు. భక్తపరాధీనుడైన ప్రభువు నీకోరికను మన్నించెద ననుమాట నొసంగెను. ద్వాపరయుగములో నీయారాధ్యదైవమైన శ్రీకృష్ణునిగ అవతరించి ఆయన నిన్నగ్రహించును. నీపై బాల్యలీలల నొనరించును. నీచే సమర్పింపబడు పత్రపుష్పఫలతోయములను తా ననుభవించును. సప్తదినముల పర్యంతము నిన్నా భక్తవత్సలుడు తనచిటికెనవ్రేలిపై ధరింపగలడు. ఆహా! ఏమి నీ అదృష్టము అని ఆంజనేయుడు పలికెను.

శ్రీగోవర్ధనపర్వతము పరమానంద భరితుడయ్యెను. వాని నేత్రముల నుండి ప్రేమాశ్రుధారలు ప్రవహించెను. అతి డత్యంతవినయపూర్వకముగ శ్రీరామభక్తుడగు ఆంజనేయునితో నిట్లుపల్కెను. "పవనాత్మజా! నీ వొనరించిన యీ మహోపకారమునకు ప్రత్యుపకారముచేయుగలస్థితి నాకు లేదు; కావున నేను సదా నీకు ఋణపడియుండెదను."

యుగయుగములనుండి శ్రీగోవర్ధనపర్వతము సకలజనులచే పూజింపబడుచుండెను. విరక్తులగు మహాత్ములు, భక్తులు, శ్రద్ధాభక్తిసమన్వితులై శ్రీగోవర్ధనగిరికి ప్రదక్షిణము లొనరించి తమతమయభీష్టసిద్ధులను పొందుచున్నారు. పరమభాగ్యవంతుడైన శ్రీగోవర్ధనపర్వతమున కిట్టి అత్యున్నతపదమును ఆభగవంతుడు తనభక్తుడైన శ్రీఆంజనేయుని వచనమును సత్యమొనరించుటకు ప్రసాదించెను. ఆశ్రీరామచంద్రుడే ద్వాపరయుగములో శ్రీకృష్ణుడై శ్రీగోవర్ధనపర్వతము నను గ్రహించెను.

శ్రీఆంజనేయుని యనుగ్రహమును, దర్శనమును పొందిన భాగ్యవంతునకు శ్రీరామచంద్రునిదర్శనము లభించుట నిశ్చయముగ జరుగును. కరుణామూర్తి యగు శ్రీపవనకుమారుడు తనభక్తులను ప్రభువు చెంతకు చేర్చనిదే విశ్రమింపడు. అత్యంత ప్రేమపూర్వకముగ గోవర్ధనగిరిని అనుగ్రహించిన వాడై ఆంజనేయుడు శ్రీరామచంద్రుని చరణారవిందముల చెంతకు చేరెను.

విశాలసముద్రముపై నూరుయోజనములపొడవు, పది యోజనముల వెడల్పు కలిగిన సేతువును నిర్మించుట పూర్తి యయ్యెను. లీలావినోది యగు శ్రీరామచంద్రు డాశ్చర్యచకితుడై యీపర్వతశిలలు సాగరజలముపై నెట్లు తేలియాడుచున్న వని ప్రశ్నించెను; అందులకు వానరులు వినయపూర్వకముగ

'శ్రీరామప్రభో! ఇదియంతయు శ్రీరామనామమహిమ; నీ నామమహిమచే పర్వతములు, శిలలు మొదలగునవన్నియు సముద్రముపై తేలియాడుచున్న' వనిపలికిరి.

కుతూహలముగలవాడై శ్రీరఘునందనుడు కొన్ని శిలాఖండములను సముద్రములో పడవైచెను; కాని అవి యన్నియు మునిగిపోయెను. అపుడాయన "నీటిపై శిలలు తేలు టెట్లుసంభవము! నేనే నాహస్తములతో సముద్రములో శిలలను పడవేయగా తేలుటకు బదులు అవి మునుగుచున్నవి. కారణమేమి" యని ప్రశ్నించెదను.

వానరభల్లూకయోధులందఱు పరమాశ్చర్యచకితులై ఒకరిముఖముల నొకరు చూచుకొననారంభించిరి.

జగన్నాథు డగు శ్రీరామచంద్రునకు అనన్యభక్తుడైన శ్రీపవనాత్మజుడు ముకుళితహస్తుడై యిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "జగదాధారా! నీవు నీకరకమలములనుండి వదలిన పదార్థములు సహజముగనే మునిగిపోవును. వృక్షము నుండి వేరయిన కొమ్మ నశించునట్లు నిన్ను వీడినవారు అథోగతిపాలయ్యెదరు. నీయాధారము లేని ప్రాణికి గతి యెక్కడ" ఇది విని శ్రీరామచంద్రుడు మందహాసముచేసెను.

వానరభల్లూకవీరులతో నిండిన మహాసైన్యమును తోడ్కొని శ్రీరామచంద్రుడు వారధిపై పయనించి లంకను

చేరెను. సువేలపర్వతముచెంత శ్రీరాముని సైన్యము విడిది చేసెను. ఉన్నతము, సుందరము, సమతలమునైన శిఖరముపై వృక్షములయొక్క కోమల పత్రములచే ఒక ఆసనమును సుమిత్రానందను డేర్పరచి దానిపై సుందర మృగ చర్మమును పఱచెను. ఆయాసనముపై కరుణావతారు డగు శ్రీరామ ప్రభువు వానరరాజైన సుగ్రీవునియొడిలో తలవంచుకొని శయనించెను. ఆయనయెడమవైపు విశాల మగు ధనువుండెను, కుడివైపు అక్షయతూణీరము లుండెను. ప్రభువు ఒకదీప్తిమంత మగు తీక్ష్ణతమమైన శరమును తనకరకమలములతో నిమురుచుండెను. భాగ్యవంతు డగు విభీషణుడు రామభద్రుని పరామర్శించుచుండెను. అదృష్టవంతులైన ఆంజనేయుడు, అంగదుడు ప్రభువుయొక్కచరణకమలములను మెల్ల మెల్లగ నొక్కుచు ఆ దివ్య ముఖారవిందమును దర్శించుచుండిరి. వీరవరు డగు సౌమిత్రి ధనుర్బాణములను ధరించినవాడై ప్రభువుచెంత వీరాసనములో సావధానుడై కూర్చుండియుండెను.

ఆ దేసమయమం దాకాశములో నుదయించిన చంద్రుని గాంచినవాడై శ్రీరామచంద్రుడు 'మీమీబుద్ధ్యనుసారముగ చంద్రునిలో నీశ్యామవర్ణ మెట్లు ఏర్పడెనో వివరింపు' డని పల్కెను. అందఱు తమతమ బుద్ధ్యనుసారముగ వివరించిరి. తుదకు ఆంజనేయు డిట్లు పల్కెను. "పరమపావనా! చంద్రుడు నీకు ప్రియు డగు దాసుడు, నీ సుందర మగు శ్యామలమూర్తి

వానిహృదయములో విరాజమానమైయున్నది. ఆ శ్యామల వర్ణమే ఆసుధాంశునినుండి బయల్వెడలుచున్నది.

సత్యమేమనగా పవనతనయుని రోమరోమమందు తన ప్రాణారాధ్యుడైన శ్రీరామచంద్రుడే విరాజమానుడైయున్నాడు. కావుననే అంతట ఆరామునిదర్శనమును ఆంజనేయుడు సదా పొందుచుండెను. చంద్రునిలోగూడ శ్రీరామచంద్రునే దర్శించుట ఆయనఅనన్యరామభక్తుని సహజస్వభావము.

దో॥ కహ హనుమంత సునహు ప్రభు ససి తుంహారప్రియదాస।
తవ మూరతి బిధు ఉర బసతి సోఇ శ్యామతా అభాస।
(మానసము 6-12)

## సమరాంగణములో శ్రీ ఆంజనేయుడు

శ్రీరామచంద్రుడు తనమంత్రియైన జాంబవంతునితో ఆలోచించి దశకంఠునిచెంతకు రాయబారిగ అంగదుని బంపెను. అంగదరాయబారము తిరస్కరింపబడెను. యుద్ధము ప్రారంభమయ్యెను. రాక్షసులు మహామాయావులు. వారు ఖడ్గము, శూలము, పరశువు, శక్తి, తోమరము, గద మొదలగు ఆయుధములతో ధనుర్బాణములతో వివిధశస్త్రాస్త్రములతో యుద్ధమొనరింపసాగిరి. వారు మహావీరులు, పరాక్రమవంతులు రణరంగచతురులు. పరాజయము సంభవించెడిస్థితి యుత్పన్న

మైనచో వారదృశ్యులయ్యెదరు. ఆకసమునుండి ధూళిని, అస్థికలను, రక్తమును కురుపించుచుండిరి. వానరసైన్యము వ్యాకులమగుట గాంచి మాయాపతి యగు శ్రీరాము డొకే యొకశరముతో రాక్షసమాయను వినాశమొనరించెను. వానర భల్లూకయోధు లత్యధికోత్సాహముతో యుద్ధ మొనరింప సాగిరి.

శ్రీరామచంద్రుని విశాల సేనావాహినిలో సుగ్రీవుడు, ఆంజనేయుడు, అంగదుడు, నీలుడు, మైందుడు, ద్వివిదుడు, ద్విజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, పనసుడు, కుముదుడు, హరుడు, రంభుడు, జాంబవంతుడు, సుషేణుడు,ఋషభుడు, దుర్ముఖుడు, శతబలి మొదలగు మహా యోధానుయోధులేగాక, సచివులతో కలసి విభీషణుడుగూడ నుండెను. పరాక్రమవంతు లగు ఈయూధపతుల యధీనములో కోట్ల కొలది వానర భల్లూకవీరులు సమరాంగణములో వీర విహార మొనరించుచుండిరి. ఈవీరులచెంత ఎట్టి అస్త్రశస్త్రాదులు లేవు. వారు గగనహర్మ్యముల పైకి దుమికి, స్తంభములను ఊడబెరకి వానితో రాక్షసులను మోదుచుండిరి. గుంపులు గుంపులుగ అసురులపై బడినవారై వారిని వజ్రతుల్యము లగు పిడికిళ్ళతో గొట్టుచు, దంతములతో చీల్చి చెండాడుచు, వృక్ష ములను, శిలలను వారిపై కురిపించుచు చండప్రచండముగ యుద్ధ మొనరింపసాగిరి. వానరవీరులు రాక్షసుల శిరములను

ద్రుంచి తీక్ష్ణము లగు గోళ్ళతో వారిగుండెలను చీల్చు
చుండిరి. రాక్షసులభుజములను, పాదములను పెరికివేయ
నారంభించిరి. కొందఱు వానరభల్లూకవీరులు రాక్షసులను
బట్టి సజీవముగ భూమిలో పూడ్చుచుండిరి, మఱికొందఱు
బలవంతముగ సముద్రములో ముంచి సంహరించుచుండిరి.

సమరాంగణములో మహాబలవంతుడు దివ్యపరాక్రమ
వంతుడు నగు పవనకుమారుడు రాక్షసయోధులకు మహాకాలు
నిగ గోచరించుచుండెను. ఆయనయొక్కడే అశోకవనమును
విధ్వంసమొనరించి అసంఖ్యాకు లైన అసురవీరులను సంహ
రించుట, రావణకుమారు డైన అక్షయుని వధించుట, వైభవో
పేతము అప్రమేయము నైన లంకానగరమును దహించుట
రాక్షసులు చూచియుండిరి. ఆకాశమునే విదీర్ణ మొనరింపగల
శ్రీహనుమంతుని సింహనాద మారక్షసవీరులను మూర్ఛితులను
నొనరించుచుండెను. వారు హతోత్సాహులగుటకు మర్కటా
ధీశుని నామోచ్చారణముచాలును. ప్రజ్వలితాగ్ని సమానుడు,
దుర్ధర్షుడు నగు శ్రీఆంజనేయుడు హస్తములతో విశాల
పర్వతమును పట్టుకొని మేఘగంభీర ముగ గర్జన మొనరించు
చుండగా ఆ ప్రదేశమున నున్న రాక్షసులప్రాణము లెగిరి
పోవుచుండెను. ఓజస్సు, తేజస్సు రూపుదాల్చిన వజ్రాంగబలి
యెచ్చోట కేగుదెంచునో అచ్చోట నున్న రాక్షససైన్యములు
క్షణములో మరణించుచుండెను. ఎందఱో రాక్షసు లామహా

బాహుని తాడనములకు రక్తము గ్రక్కి విగతజీవులగుచుండిరి. కొందఱు భయకంపితులై పలాయనము చిత్తగించుచుండిరి. ఏ యే ప్రదేశములలో వానర సైన్యముపై అసురుల ప్రభావ మధికముగ నుండునో, ఆ యా ప్రదేశములలో 'శ్రీరాం, జయ శ్రీరాం' యని గగనమండలము భేదిల్లునట్లుగ జయ జయధ్వానముల నొనరించుచు ఆంజనేయుడు రాక్షసులపై దుముకుచుండెను. ఆమహావీరుని యాఘాతమునకు రాక్షస సమూహములు నశించుచుండెను. రథ సహితముగ అసుర వీరులను, ఆకాశములోనికి వేగముగ విసరివేయుచుండెను. వారు రథసహితముగ గిరగిర తిరుగుచు సముద్రములో పడి మరణించుచుండిడి. అసురులను బట్టి సముద్రములో విసరివేయు చుండెను. ఇట్లు త్వరితగతితో శ్రీఆంజనేయుడు లక్షలాది అసురవీరులను సంహరించుచుండెను. ఆయన చిన్నచిన్న వృక్షములను శిలలను స్పృశింపనైన స్పృశింపడు. గగనముక కెగిరి సమీపములో నున్న పర్వతములను పెకలించి విద్యుద్గ తితో మరలివచ్చి అసురసమూహములపై పడవేయు చుండెను. ఆంజనేయునిచే పర్వతశిలాఖండములుకొన్ని నేరుగ పోయి లంకలో పడుచుండెను. రణరంగములో నంతట అసు రులు 'త్రాహి, త్రాహి,' యనుచు పలాయన మొనరించు చుండిరి.

పవనకుమారుడైన ఆంజనేయుడు రణరంగములో

అవిశ్రాంతముగ అసంఖ్యాకు లైన రాక్షసులను భయంకరముగ సంహరించుచుండుట గాంచి మిగిలిన రాక్షసులు రావణుని నాశనము నిశ్చయ మనితలపోయుచుండిరి. ఇందుగల డందు లే డనునట్లు ఆంజనేయుడు రణరంగమంతయు వీరవిహార మొనరించుచుండెను. రాక్షసుల ప్రభావమును నాశమొనరించుచు వానరసైన్యముల నుత్సాహపరచుచుండెను. ప్రతివానరుడు ఆంజనేయుడు తనప్రక్కనే యుండి యుద్ధమొనరించుచున్నట్లుగ తలంచుచుండిరి. ప్రతిరాక్షసుడు ఆంజనేయుడు తనయెదుట నుండి యుద్ధమొనరించుచున్నట్లుగ భ్రమపడుచుండిరి.

దైత్యసైన్యములో ప్రఖ్యాతసైన్యాధిపతు లైన ధూమ్రాక్షుడు, అవినయుడు, అకంపనుడు, అతికాయుడు, దేవాంతకుడు, త్రిశిరుడు మొదలగు వారందఱు ఆంజనేయునిచే సంహరింపబడిరి. ఈసమాచార మందగనే రావణుని ధైర్యము సన్నగిల్లెను. వజ్రాయుధధారి యగు ఇంద్రుని జయించిన ఇంద్రజిత్తు తనతండ్రి యగు రావణు నూరడించెను. మేఘనాధుడు తండ్రికి నమస్కరించి వివిధాయుధములతో సంపన్నమై యున్న వేగవంతము, విశాలము నైనరథము నధిరోహించి రణరంగమున కేగెను.

ఆంజనేయుని రణకౌశలమును గుఱించి, పరాక్రమమును గుఱించి ఇంద్రజిత్తునకు బాగుగ తెలియును. ఆంజనేయుని [illegible] భయము చెందినవాడై మేఘనాధుడు ఆ మహావీరునితో తలపడకుండగ దూరముగనుండి యుద్ధమొనరింప నారంభించెను.

ఇంద్రజిత్తు వానరసైన్యమును సంహరింపనారంభించెను. వాని బాణవర్షమునకు సుగ్రీవుడు, అంగదుడు, నీలుడు, శరభుడు, గంధమాదనుడు, జాంబవంతుడు, సుషేణుడు, మైందుడు, వేగదర్శనుడు, నలుడు, జ్యోతిర్ముఖుడు, ద్వివిదుడు మున్నగు వానరవీరు లందఱు క్షతగాత్రులైరి. మేఘనాథుడు శ్రీరామలక్ష్మణులపై బ్రహ్మాస్త్రము నభిమంత్రించి ప్రయోగింపగా వారిద్వరు మూర్ఛితులైరి.

క్షతగాత్రులై పడియున్న వానరసైన్యమును గాంచి విహ్వలుడై విభీషణుడు జాంబవంతుని సమీపించెను. మేఘనాథుని శరములచే విదీర్ణుడై పడియున్న జాంబవంతుని జూచి ఇతడు జీవించియున్నాడా లేడా యను సంశయము గలుగగా హస్తముతో అతనివిశాల మగు కాయమును నిమురుచు కుశలము నడిగెను. అపుడు జాంబవంతు డిట్లు బల్కెను. "రాక్షస రాజా! నా శరీరమంతయు ఇంద్రజిత్తుని శరములచే విదీర్ణమైనది. కన్ను తెరచి నేను చూడలేక పోవుచున్నాను. కేవలము నీ స్వరమును విని నీవు విభీషణుడ వని గుర్తించితిని. అంజనీనందను డగు శ్రీహనుమంతుడు సజీవముగ నున్నాడో లేదో తెల్పుము.

జాంబవంతునిప్రశ్న విని పరమాశ్చర్యచకితుడై విభీషణుడు ఋక్షరాజా! వానరరాజగు సుగ్రీవుని, యువరాజగు అంగదుని కుశలసమాచారము నడుగక, భగవంతు డగు

శ్రీరామచంద్రుని, శ్రీరామానుజుని కుశలసమాచారమును గూడ నడుగక పవనాత్మజు డైన ఆంజనేయుని క్షేమము నడుగుచు ఆతనిపై నధిక మగు ప్రేమను గనబరచుచున్నావు. ఇందులకు కారణమేమి యని ప్రశ్నించెను.

బాణవిద్ధు డగు జాంబవంతు డధిక కష్టముతో నిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

శ్లో॥ అస్మిన్ జీవతి వీరో తు హతమప్యహతం బలమ్
హనూమత్యుజ్ఝితప్రాణే జీవనోఽపి మృతా వయమ్ ।
ధరతే మారుతిస్తాత మారుతప్రతిమో యది
వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్
(వా. రా. 6.73.22, 23)

రాక్షసరాజా! వీరవరేణ్యు డగు ఆంజనేయుడు సజీవు డై యున్నచో వానరసైన్యము మరణించినను జీవించియున్నట్లే. ఆయన ప్రాణములు పోయినచో మే మందరము జీవించి యున్నను మరణించినవారమే యని తెలిసికొనుము. వాయు సమానవేగవంతుడు, అగ్నిసమాన పరాక్రమవంతుడు జీవించి యున్నచో మేమందఱము జీవించినట్లే యని ఆశింపవచ్చును.

అదేసమయములో ఆంజనేయు డాప్రదేశమున కేతెంచి వృద్ధవీరు డైన జాంబవంతుని రెండుపాదములను స్పృశించుచు వినయపూర్వకముగ నమస్కరించెను. మారుతాత్మజుని

సంస్పర్శము కలుగగనే అస్త్రములచే పీడింపబడు జాంబవంతుని ముఖము ప్రకాశింపసాగెను. ఆయన ఆంజనేయునితో నిట్లు పల్కెను.

శ్లో॥ ఆగచ్ఛ హరిశార్దూల వానరాంస్త్రాతుమర్హసి ॥
నాన్యో విక్రమపర్యాప్తస్త్వమేషాం పరమః సఖా ।
త్వత్పరాక్రమకాలోఽయం నాన్యం పశ్యామి కంచన ।

వానరసింహమా! రమ్ము. వానరులనందఱిని రక్షింపుము. నీవుదక్క అన్యు లెవ్వరును పరాక్రమవంతులు కారు. నీవే వీరందరకు పరమసాహాయ్యకుడవు. నీవు పరాక్రమించుటకు ఈసమయము తగియున్నది. మఱియొక్కరు దీనికి యోగ్యులుగ నాకు గోచరించుటలేదు.

కరాళ కాలసదృశుడు, కాటుక కొండ వంటి శరీరము కలవాడు నగు కుంభకర్ణుడు రావణుస్రేరణచే రణరంగమున ప్రవేశించెను. వానినిగాంచగనే వానరభల్లూకవీరులు మహా వృక్షములను, పర్వతములను పెకలించి ఆమహాకాయునిపై విసరనారంభించిరి. ఒక్కొక్కపర్యాయము వారు కోట్లాది పర్వత శిలలనుకుంభకర్ణునిపై ప్రయోగించిరి; కాని అతడు కించిత్మాత్ర మైనను చలింపలేదు. నేరేడుపండ్లతో కొట్టిన గజరాజుపై నెట్టిప్రభావముపడునో అట్లు ఆ మహాకాయుని కాయము అట్లుండెను, వానర భల్లూకవీరులు ఆ పర్వతా

కారుని గాంచి భయమునొందిరి. ఆ దేసమయములో ఆప్రదేశమునకు హనుమంతు డేతెంచెను. అతడు కుంభకర్ణునిపైకి దుమికి వానిని పిడికిళ్ళతో గొట్టసాగెను. ఆ రుద్రావతారుని వజ్రముష్టిప్రహారములచే కుంభకర్ణుడు వ్యాకులుడై పృథ్వి పైబడి నెత్తురుగ్రక్కెను. కుంభకర్ణునిమృత్యువు శ్రీరామ చంద్రునిచే సంభవింపవలసియున్నది గావున, ఆంజనేయుడు వానిని వదలివేసెను. కుంభకర్ణు డొకనాడు భీకరయుద్ధ మొనరించి భగవంతు డగు శ్రీరామచంద్రునిశరమునకు అసువులనర్పించి ముక్తుడయ్యెను.

కుంభకర్ణునిమరణవార్త రావణుని వివశునిగ నొనరించెను. అతడే స్వయముగ రణరంగమున కేతెంచెను. వాని హస్తమున అమితభయంకరము, దీప్తిమంతము నగు ధను వుండెను. ఆతడు తీక్షణశరవర్షముచే వానరసైన్యమును నొప్పించెను. అపుడు వజ్రాంగుడు, మహాబలవంతుడు నగు హనుమంతుడు రావణునిసమ్ముఖమునకు వచ్చినవాడై తన దక్షిణకరము నెత్తి చూపుచు రావణుని భయాక్రాంతునిగ చేయుచు నిట్లు పల్కెను.

శ్లో॥ ఏవ మే దక్షిణో బాహుః పంచశాఖః సముద్యతః
విధమిష్యతి తే దేహే భూతాత్మానాం చిరోషితమ్.
( వా. రా. 6.59-56 )

'రావణా! ఐదువ్రేళ్ళతో గూడిన నాదక్షిణ కరమును

చూడుము. చిరకాలమునుండి నీశరీరములో నివసించు జీవుని నాయీ కరఘాతము నీ దేహమునుండి వేరుచేయును.'

పరమపరాక్రమవంతు డగు రావణుడు కోపించినవాడై యిట్లు పల్కెను. "వానరా! నీవు నిశ్చింతగా నాపై ప్రహార మొనరింపుము. నీ వెంతటిపరాక్రమవంతుడవో చూచి నేను నీ ప్రాణములను హరించెదను".

ఆంజనేయు డిట్లు ప్రత్యుత్తర మొసంగెను. "రాక్షస రాజా! నీకు ప్రాణసమాను డగు అక్షయకుమారుడు నాచే మడియుట మరచితివా ?"

శ్రీహనుమంతు డిట్లు పలుకగనే రావణుని హృదయము మండెను. అతడు వెంటనే పవనాత్మజుని వక్షఃస్థలముపై తన సర్వశక్తిని కూడదీసికొని ముష్టిఘాత మొనరించెను.

బలపరాక్రమ సంపన్నుడు, మహాతేజస్వియునగు రావణునిముష్టిఘాతముచే శ్రీహనుమంతు డొక్కక్షణము చలించెను. కాని బుద్ధిమంతుడు, తేజస్వియు నగు ఆ వానరవీరుడు మరుక్షణమందే సుస్థిరుడై రాక్షసరాజుపై వజ్రముష్టిఘాత మొనరించెను.

పరాక్రమవంతుడు, వజ్రాంగుడు, మహావీరుడు నగు ఆంజనేయుని వజ్రముష్టిఘాతముచే రావణుడు కంపించెను. కొన్నిక్షణములపిమ్మట అతడు తన్ను తాను సంబాళించుకొని

సాధు సాధు వానరవీరా! పరాక్రమములో నాకు నీవు ప్రశంసనీయమైన ప్రతిద్వంద్వివి.

వీరవరుడగు పవనకుమారు డిట్లు ప్రత్యుత్తరమొసంగెను. 'ఓరీ! రావణా!

శ్లో॥ ధిగస్తు మమ వీర్యస్య యత్ త్వం జీవసి రావణ।
(వా. రా. 6-59-67)

నీ వింకను జీవించియేయున్నావు. కావున నా పరాక్రమమునకు ధిక్కారము. నీవు మరియొక పర్యాయము నాపై ప్రహారమొనరింపుము. తదుపరి నేను నీపై ముష్టిఘాతమొనరించెదను. నీవు యమలోకమునకు పోవుట నిశ్చయము.

మర్కటాధీశుని వాగ్బాణములచే రాక్షసరాజైన రావణుడు కోపించినవాడై ఆంజనేయుని వక్షఃస్థలముపై తీవ్రముగ గ్రుద్దెను.

రావణు డొనరించిన ఆ యాఘాతముచే హనుమంతుడు మరల క్షణకాలము విచలితుడయ్యెను. ఆ క్షణమందే రావణుడు తనరథమును ఆ ప్రదేశమునుండి తప్పించి వానరసైన్యాధిపతి యగు నీలునితో తలపడెను. రావణుడు శ్రీరామచంద్రునిచే మరణించుట విధివిధానమని యెఱింగిన మారుతి వానిని వదలివేసెను.

ఇట్లు పవనాత్మజుడు ప్రచండవీరుడై రాక్షసవీరులను

తనతీక్ష్ణము లగు నఖములచే చీల్చిచెండాడెను. దైత్యుల రక్తముచే ఆంజనేయుని శరీరమంతయు అరుణవర్ణముగ ప్రకాశింపనారంభించెను. ఆరక్తరంజనుని గాంచి స్వయముగ రావణుడే భయముతో కంపించెను. లక్ష్మణు డొనరించిన శరవర్షముచే రావణుని శరీరమంతయు విదీర్ణమై రక్తము ప్రవహింపనారంభించెను. రాక్షసరాజు కోపించి బ్రహ్మదేవునిచే ప్రదత్తమైన అద్భుత మగు శక్త్యాయుధమును సుమిత్రానందనునిపై ప్రయోగించెను. ఆశక్తి శ్రీరామానుజుని విశాలవక్షఃస్థలమును విదీర్ణమొనరించి అదృశ్యమయ్యెను. లక్ష్మణుడు క్షతగాత్రుడై భూమి పైబడెను.

రావణుడు ప్రసన్నుడై లక్ష్మణుని సమీపించి వాని నెత్తుటకు ప్రయత్నింపసాగెను. శివునికైలాసపర్వతమునే పెకలించిన రావణుడు నేడు లక్ష్మణునిశరీరమును కదల్చనైనను కదల్చలేకపోయెను, ఆంజనేయు డాప్రదేశమున కేతెంచి జరిగినది గాంచి కోపోద్దీపితమానసుడై రావణునివక్షఃస్థలముపై ముష్టిఘాత మొనరించెను.

ఆయాఘాతమునకు రావణుడు కంపించెను. పృథ్విపై మోకాళ్ళమీద కూలబడెను, ముఖమునుండి నేత్రములనుండి కర్ణములనుండి రక్తము ప్రవహించెను. గిలగిలకొట్టుకొనుచు వివశుడై తన రథపృష్ఠభాగమునకు పరుగిడి మూర్ఛితుడయ్యెను.

ఆంజనేయుడు సుమిత్రానందనుని లేవనెత్తుకొని శ్రీరామ

చంద్రుని చెంతకు చేరెను. శత్రువులు కదల్పజాలని శేషావతారు డైనలక్ష్మణుడు పరమభక్తుడగు ఆంజనేయునకు సులభముగ దోచెను. పావనమగు శ్రీరామచంద్రుని కరస్పర్శచే లక్ష్మణుడు మూర్ఛనుండి లేచెను.

రావణుడు తెప్పరిల్లినవాడై మహావీరులగు వానరులపై దాడిచేయుచు వారిని వధింపసాగెను. అది చూచి శ్రీరాఘవేంద్రుడు రావణునితో తలపడుటకు బయలుదేరెను. భగవంతు డగు శ్రీరామునకు అనన్యసేవకు డైన పవనాత్మజుడు ప్రభువు కడకు వెడలి ఇట్లునివేదించెను.

శ్లో॥ మమ పృష్ఠం సమారుహ్య రాక్షసం శాస్తు మర్హసి ।
విష్ణుర్యథా గరుత్మంతమారుహ్యామరవైరిణమ్ ।
(వా. రా. 6.59.124)

ప్రభూ ! భగవంతు డగు విష్ణువు గరుత్మంతుని భుజ స్కంధములపై నెక్కి దైత్యులను సంహరించినట్లు నీవు నాభుజ ములపై నధిరోహించి యీరాక్షసులను వధింపుము.

ఆంజనేయుని ప్రార్థనను మన్నించి శ్రీరామచంద్రుడు ఆయనభుజస్కంధముపై ఆసీనుడయ్యెను. శ్రీలక్ష్మణుడుకూడ ఆంజనేయుని భుజముపై ఆశీనుడయ్యెను. ఇట్లు మహావీరు డగు ఆంజనేయుడు యుద్ధభూమియందు ప్రముఖపాత్ర వహించెను. ఎందరో రాక్షసులు ఆంజనేయునిచే సంహరింపబడి ముక్తు లైరి. యుద్ధభూమిలో రాక్షసులకు హనుమంతుడు ప్రళయకాల

రుద్రునివలె గోచరించెను. కాని ఆయన హృదయములో రాక్షసులపై అపార మగు కరుణ కలదు. ఆయన కొందఱు రాక్షసులను ప్రభువుసమ్ముఖమునకు గొనితెచ్చి సంహరించుచుండెను. అట్లు సంభవము కానిచో శ్రీరామనామ ముచ్చరించుచు వారిని వధించుచుండెను. శ్రీరామదర్శనముచే శ్రీరామనామ శ్రవణముచే పవిత్రులై రక్కసులు అక్షయము, సుఖశాంతినికేతనము నైన పరంధామమునకు చేరుచుండిరి.

## సంజీవనిని తెచ్చుట

అసురులకు, వానరులకు సంగ్రామము భయంకరముగ సాగుచుండెను, రణరంగములో మేఘనాథుడు ప్రవేశించెను. లక్ష్మణుడు ధనుర్బాణములను ధరించి వానిని నిలువరించెను. పరస్పరము ఘోరసంగ్రామ మొనరింపసాగిరి. ఇంద్రజిత్తు బాణములను వర్షమువలె కురిపించి వానర భల్లూకవీరులను అధీరులుగ నొనరింపసాగెను. మేఘనాథుని గర్జనములను విని, పరాక్రమమును గాంచి ఆంజనేయుడు వానిపై విశాలమగు నొక పర్వత శిఖరమును ప్రయోగించెను. ప్రాణములను రక్షించుకొనుటకు ఆ నిశాచరుడు రథసహితముగ ఆకసమున కెగిరెను. లేనిచో రథము, సారథి, అశ్వములు తుదకు తానుకూడ ఆ పర్వత శిఖరముక్రిందపడి నశించియుండెడివాడు. ఆంజనేయుడు ఎన్నిపర్యాయములు ద్వంద్వయుద్ధమునకై మేఘనాథుని ఆహ్వానించినను

రావణపుత్రుడు దూరముగ తొలగి యుద్ధము చేయుచుండెను. పవనకుమారునితో యుద్ధమొనరించుట మృత్యువును వరించుటకన్న తక్కువేమికాదని వానికి బాగుగ తెలియును.

మేఘనాథునకు, లక్ష్మణునకు భయంకర మగు యుద్ధ మారంభమయ్యెను. ఇంద్రజిత్తు సౌమిత్రిపై అనేక శస్త్రాస్త్రములను ప్రయోగించెను; కాని అవియన్నియు వ్యర్థములయ్యెను. అసురుడు తుదకు అవినీతికర మైన యుద్ధమునకు పాల్పడెను.

శ్రీరామానుజుడు క్రోధోద్దీపిత మానసుడై తీక్ష్ణము లగు బాణములను ప్రయోగించి వానిరథమును చూర్ణమొనరించి సారథిని సంహరించెను.

రావణకుమారుడు క్రోధోన్మత్తుడై లక్ష్మణుని సంహరింపవలెనని అనేకవిధముల అధర్మ యుద్ధముచేయ యత్నించెను. వానిప్రయత్నముల నన్నిటిని లక్ష్మణుడు విఫలమొనరించి అసంఖ్యాకము లగు తీక్ష్ణబాణములచే వానిని బాధించెను. మేఘనాథునిధైర్యము సడలెను. తన్ను తాను రక్షించుకొనుటకు మఱియొక మార్గమును గానక క్రూరుడగు ఆ యసురుడు సౌమిత్రిపై బ్రహ్మప్రదత్తమైన అమోఘ మగు శక్తిని ప్రయోగించెను. అత్యంత తీవ్రగతితో ఆ మహాశక్తి బయలుదేరి సుమిత్రానందనుని వక్షఃస్థలమును చీల్చి అదృశ్యమయ్యెను.

రక్తధారలు ప్రవహించుచుండగా లక్ష్మణుడచేతనుడై పృథ్వీపైబడెను.

లక్ష్మణుడు మూర్ఛిల్లగనే మేఘనాథుడు లక్ష్మణునపహరించుటకు బయలుదేరెను. ఆ యసురుడు, బలవంతులగు పెక్కుండ్రు రాక్షసులు లక్ష్మణుని కదల్చుటకు తమశక్తియుక్తులతో ప్రయత్నించిరి; కాని ఆదిశేషునియవతారమైన లక్ష్మణుని వారు ఇసుమంతైనను కదల్పలేకపోయిరి, హతాశులై వారు మరలిపోయిరి. ఆ దేసమయములో ఆంజనేయుడు మఱియొకవైపు రాక్షససంహారము చేయుటలో సంలగ్నుడైయుండెను. లక్ష్మణుడు మూర్ఛిల్లెననెడివార్త తెలియగనే ఆంజనేయుడు సాక్షాత్తుగ యమునివలె భయంకరుడయ్యెను. ఆయన నేత్రములనుండి అగ్నిజ్వాలలు బయల్వెడలెను. క్షణములో ఆయసురసమూహములను సర్వనాశనమొనరించెను. మిగిలినవారు ప్రాణములను అరచేతబట్టుకొని పారిపోయిరి. ఆంజనేయుడు పరుగున లక్ష్మణునిజేరి ఆయనను తనభుజములపైకి ఎత్తుకొనెను. సుందరుడైన సుమిత్రానందనుని ముఖారవిందము మూర్ఛచే మలినమగుట గాంచి వజ్రాంగబలి నేత్రము లశ్రుపూరితములయ్యెను.

సంధ్యాసమయమయ్యెను. రాక్షస వానరవీరులు యుద్ధమును చాలించిరి. శ్రీరఘునందనుడు లక్ష్మణునిగూర్చి ఆలోచించుచుండగనే ఆంజనేయుడు లక్ష్మణుని తన భుజములపైనిడుకొని ఆప్రదేశమును చేరెను. మూర్ఛితుడైయున్న

సుమిత్రాకుమారుని ప్రభువు సమక్షములో పరుండబెట్టెను. శ్రీరామానుజుడు మూర్ఛితు డగుట చూచి శ్రీ రామ చంద్రుడు హృదయవిదారకముగ దుఃఖింపసాగెను. వానర భల్లూకవీరులందఱు కరుణామయ మగు నాదృశ్యమును గాంచి చింతామగ్నులైరి.

శ్రీరామచంద్రుడే ధైర్యమును వదలి చింతించుట చూచిన పవనకుమారునినేత్రములు సజలములయ్యెను; కాని యావిషమపరిస్థితిలో అందరిని యూరడింపగల బాధ్యత ఆంజనేయుని పైనుండెను. కావున ఆమహానుభావుడు మనస్సును దృఢమొనర్చుకొని అందఱిని ఉత్సాహపరచుచు నిట్లు పల్కెను. "ప్రభూ! నేనుండగా మీరు లక్ష్మణుని కొఱకై చింతింపబనిలేదు. నీయాజ్ఞ యున్నచో స్వర్గమునుండి అమృతమును తెచ్చెదను. సుమిత్రానందనుని రక్షించుటకు నాగలోకమునకైనను వెడలి అమృతమును తెచ్చి లక్ష్మణుని పునర్జీవితుని చేసెదను. రామచంద్రా! నీయనుజ్ఞ యైనచో కాలమునే ధ్వంసమొనరించెదను. ఇక లక్ష్మణునికొఱకై మీయాందోళన సమసిపోగలదు. సర్వప్రాణులు మృత్యుభయమునుండి విముక్తులయ్యెదరు.

ఆంజనేయుడు ప్రళయంకర మగు తనస్వరూపమును ధరించుటకు సంసిద్ధుడయ్యెను; కాని లీలామానుషవిగ్రహుడగు శ్రీరఘునాయకుడు మనష్యోచితమగు ఆచరణము నొనరింప

వలయును. రుద్రావతారుని యీ యావేశమును చూచి శ్రీరాముడు చింతించెను. విభీషణుని ప్రేరణచే మహాబుద్ధిమంతుడైన జాంబవంతు డిట్లుపల్కెను. "పవనకుమారా! నిస్సందేహముగ నీవు సర్వము నొనరింపగలవు. నీ కేదియు అసంభవము కాదు. కాని నీవు ఇట్లు చేయవలసిన పనిలేదు. మొదట మహావైద్యుడైన సుషేణుని తోడ్కొనిరమ్ము. ఆయన చేయు చికిత్సచే నిశ్చయముగ లక్ష్మణుడు రక్షింపబడగలడు. సుషేణుడరుదెంచి లక్ష్మణుని పరీక్షించెను. తగిలిన దెబ్బ బలమైనదనియు సూర్యోదయమునకు పూర్వమే సంజీవనిని తెచ్చినచో లక్ష్మణున కెట్టి ఆపద సంభవింపదనియు సుషేణుడు పల్కెను. తన యెదుట విచార ముద్రలో నిలబడియున్న పవనకుమారుని గాంచి సుషేణు డిట్లుపల్కెను "మహాపరాక్రమవంతుడా! ఆంజనేయా! ఈ మహాకార్యము నీవలననే సంపన్నము కావలయును, నీవు శీఘ్రమే హిమాలయ పర్వతప్రాంతమునకు బొమ్ము, అత్యంతోన్నతము లగు ఆపర్వతపంక్తులలో ఉన్నతోన్నతముగ కైలాసశిఖరము, వృషభశిఖరము విరాజిల్లుచున్నవి. ఆ రెండు శిఖరములమధ్య అత్యంతదీప్తివంత మగు ద్రోణశిఖరమును దర్శింపగలవు. ఆపర్వతరాజము సకలౌషధుల కాలవాలము. సంజీవని, విశల్యకరణి, సువర్ణకరణి, సంధాని యను మహౌషధులు సదా ప్రకాశించుచుండును. మహావీరా! ఆ ఓషధులను శీఘ్రమే తెచ్చి లక్ష్మణునకు ప్రాణదాన మొనరింపుము. వీరవరా! ఓషధులు సూర్యోదయమునకు పూర్వమే ప్రయో

గింపవలయును. సూర్యోదయమైన పిమ్మట సుమిత్రానందనుని రక్షించుటసంభవము కాగలదు."

'జయ శ్రీరాం' యని గర్జించి శ్రీరాఘవేంద్రుని చరణారవిందములకు నమస్కరించి అంజనానందనుడు వాయువేగముతో ఆకసమున కెగిరెను. క్షణములో హిమాలయ పర్వత పంక్తులను జేరెను. ఆ ప్రాంతములో. అతి సుందరమగు ఒక తపోవనము గాంచెను యోజనవిస్తృత మగు ఆ తపోవనములో మధురఫలభరితము లగు అనేక వృక్షములు కలవు. ఆశ్రమములో ఒక మునివర్యుడు శంకరుని పూజించుచుండెను.

ఆంజనేయునకు దప్పిక కల్గెను ఈ యాశ్రమములో జలములను స్వీకరించి ద్రోణగిరికి పయనము కావలయు నని సంకల్పించి మహర్షికి నమస్కరించి యిట్లుపల్కెను. "ముని వరా! భగవంతు డగు శ్రీరామచంద్రుని దూతను. పవన పుత్రుడ నైన ఆంజనేయుడను. తమకు నమస్కరించుచున్నాను. శ్రీరామచంద్రుని కార్యార్థినై పోవుచున్నాను. దప్పికగొని యున్నాను. జలాశయ మెచ్చట నుండునో తెలుపవలసినదిగ ప్రార్థించుచున్నాను."

నీవు నా కమండలములో గల జలములను త్రాగుమని ముని పల్కగా ఆంజనేయుడు ఈ జలము తనకు చాలదని జలాశయమును చూపింపు డని పల్కెను.

మునివర్యుని ముఖము మలినమయ్యెను. ఆంజనేయుని

కార్యము ఆలస్యమగునట్లు ఆతడిట్లు పల్కెను. "కపీంద్రా! నా కంతయు అవగతమే. తపోబలముచే త్రికాలములను నేను గ్రహింపగలను. శ్రీరాముడు లంకాధిపతి యగు రావణునితో యుద్ధమొనరించుచుండెను. ఇంద్రజిత్తుచే ప్రయోగించిన అమోఘ మగు శక్తిచే లక్ష్మణుడు మూర్ఛితుడయ్యెను. కాని పవనకుమారా! నీ విక ఆందోళనము చెందవలసిన పనిలేదు. లక్ష్మణుడు అచేతనుడై కుశలముగ నున్నాడు, కావున నీ విక వేగిరపడక మా యాశ్రమమందు గల మధురఫలముల నారగించి, జలములను ద్రాగి విశ్రమింపుము. తదనంతరము మరలి పోవచ్చును.

ఆంజనేయుడు పల్కెను. మునిసత్తమా! దయతో మీరు జలాశయమునకు మార్గము చెప్పుడు. శ్రీరామ కార్యములో ఒక్కక్షణమైనను ఆలస్యమగుట నేను సహింపలేను.

శ్రీరఘునాయకుని కార్యములో విఘ్నములను కలిగించుటకై రావణునిచే పంపబడిన కాలనేమి యను రాక్షసుడే ఆ మునివేషమును ధరించెను. వాని కమండలమునందు గల విషము వ్యర్థమయ్యెను. ముని రూపధారి యగు ఆ మాయావి మఱల ఆంజనేయునితో నిట్లు పల్కెను. "అపురూపము: అగు ఆ ఓషధులు సామాన్యులకు దృష్టిగోచరములు గావు. అవి లుప్తములగును; కాని నేను నీకు సహాయమొనరించెదను.

వెంటనే నీవు జలాశయములో జలములు త్రాగి స్నానమొనరించి రమ్ము. నీకు నేనొక మంత్రము నుపదేశించెదను. ఆ మంత్రప్రభావముచే ఓషధులు నీకు గోచరింపగలవు. అదిగో జలాశయము. నేత్రములను మూసికొని జలములను త్రాగుము."

ఆంజనేయుడు జలాశయమును చేరి కపటముని చెప్పినట్లుగ జలములను త్రాగనారంభించెను. మహామాయావి ఘోరరూపిణి యగు ఒక మొసలి ఆంజనేయుని పాదములను పట్టుకొనెను. నేత్రములను తెరచి తనను మ్రింగుటకు ప్రయత్నించుచున్న మకరిని గాంచి ఆంజనేయుడు కోపించి దాని ముఖమును చీల్చివేసెను. ఆ మకరి మరణించెను.

మకరి శరీరములో నుండి ఒక దివ్యరూపధారిణి యగు స్త్రీ బయల్వెడలి ఆకాశమున నిలచి ఆంజనేయు ననేక విధముల స్తుతించి యిట్లుపల్కెను. "కపీశ్వరా! నా పేరు ధాన్యమాలి. నేను శాపగ్రస్తురాలనైన ఒక అప్సరసను. అనఘా! నేడు నీ కృపా విశేషముచే నేను శాపవిముక్తురాలనైతిని. పతితపావనా! ఈ ఆశ్రమము కృత్రిమము. మునివేషములో కాలనేమి యను అసురుడు రావణుని యాదేశానుసారముగ శ్రీరామకార్యమున విఘ్నముల నొనరించుటకు ప్రయత్నించుచున్నాడు. దేవా! ఆ దుష్టుని సంహరింపుము. శీఘ్రమే ద్రోణాచలమును చేరుము. పావన మగు నీ సంస్పర్శనముచే నేను కృతార్థురాలనై దివ్యలోకములకు పోవుచున్నాను, అనుజ్ఞనిమ్ము."

ఇట్లు పల్కి ధాన్యమాలి అదృశ్యమయ్యెను. ఆంజ నేయుడు కాలనేమి కడకు వెడలగా మానవరూపములో నున్న అసుర డిట్లుపల్కెను. "వానరశ్రేష్ఠుడా! రమ్ము. నే నిపుడు మంత్రదీక్ష నిచ్చెదను." మంత్రదీక్షానెపముతో ఒక పెద్ద కార్యక్రమమును కల్పించి ఆంజనేయుని మాటలలో బెట్టి రాత్రి యంతయు గడుపవలయు నని అసురు డాలోచించెను.

"ఋషివరా! మొదట దక్షిణను స్వీకరింపుము" అనిన ఆంజనేయుని వచనములను విని కపటజటాధారి ఆశ్చర్యచకితు డయ్యెను. వాడు ఆశ్చర్యములో నుండి తేరుకొను లోపలే పవనకుమారుడు వానిని తనవాలముతో బంధించి గగనమున కెత్తి భూమిపైగొట్టెను. అసురుడు శ్రీరామనామము నుచ్చరించుచు శిథిలశరీరమును వీడి సద్గతి నొందెను. ఆహా! భక్తుల యాగ్రహము కూడ మానవు నుద్ధరింపగలదు. అయినచో అనుగ్రహ మెంత యుపకారమొనరింపగలదో గదా!

శ్రీరామనామము నుచ్చరించుచు వజ్రాంగబలి ప్రస న్నుడై ద్రోణగిరిని చేరెను. ఆ పర్వతముపై అనేకములైన ఓష ధులు ప్రకాశించుచుండెను. వానిలో సుషేణుడు చెప్పిన ఓష ధులను వేఱుచేయు టెందులకని ఆలోచించి ద్రోణగిరినే పెక లించి గరుత్మంతునితో సమముగు భయంకర వేగముతో ఆక సమున కెగిరెను.

ద్రోణాచల సహితముగ వేగముగ ఆకాశములో ఆంజ

నేయుడు పయనించుచుండగా పెనుగాలి వీచుచున్నట్లు ధ్వనింప సాగెను. ఆకాశమున పయనించుచు శ్రీ ఆంజనేయుడు అయోధ్యను దాటుచుండెను. అయోధ్యా నగరమున కావల పర్ణకుటీరములో నివసించుచున్న శ్రీరామచంద్రస్మరణ పరాయణుడు డైన భరతు డాకాశములో పయనించుచున్న భజరంగ బలిని గాంచెను. అసురు డెవడైన పర్వతమును ధరించి వచ్చుచున్నాడేమో యనితలచి భరతుడు మొనలేని బాణమును ధనువునందు సంధించి విడచెను.

ఆ బాణాఘాతమునకు 'శ్రీరామ, శ్రీరామ' యనుచు హనుమంతుడు మూర్ఛితుడై భూమి పైబడెను. సంజీవనీ పర్వతము మూర్ఛావస్థలో గూడ కదలక యుండెను,

ఆహా! ఇతడు శ్రీరామచంద్రుని భక్తుని వలెనున్నాడే యని భరతుడు తలంచి కంపించెను. ఆంజనేయుడు మూర్ఛిల్లి యున్నను ఆయన ప్రతి రోమము శ్రీరామనామమునే పలుకుచుండెను.

జటాజూటాధారి, శ్యామలవర్ణుడు నగుభరతుని నేత్రము లశ్రుపూరితములయ్యెను. ఆయన ఆంజనేయుని సచేతనునిగ నొనరించుట కనేక ప్రయత్నముల నొనరించి విఫలుడై తుద కిట్లు పల్కెను. "దుర్లంఘ్యమగు ఏ విధి నన్ను శ్రీరామ చంద్రుని నుండి వేఱుపరచెనో అదియే నేడు ఇట్టి దుఃఖభరితమగు సంఘటనను గల్గించెను. కాని భగవంతు డగు శ్రీరామ

చంద్రుని పావన చరణార విందములందు నాకు విశుద్ధము, నిశ్చలము నగు ప్రేమ యున్నచో శ్రీరఘునాయకుడు నాపై ప్రసన్నుడుగ నున్నచో ఈ వానర శ్రేష్ఠుడు పీడావిముక్తుడై పూర్వమువలె సచేతనుడు, సశక్తుడును అగు గాక!

శ్రీరామచంద్రునకు జయము పల్కుచు ఆంజనేయుడు సచేతనుడయ్యెను. తన సమక్షమున నున్న భరతుని గాంచి తాను శ్రీరామచంద్రుని చెంతకు చేరితి నని భావించెను. వెంటనే కపీశ్వరుడు భరతుని చరణార విందములకు ప్రణామము లొనరించి 'ప్రభూ! నే నెచ్చట నున్నా'నని యడిగెను. ఆనంద బాష్పములను తుడుచుకొనుచు భరతు డిట్లు పల్కెను. "మహాభాగా! ఇది అయోధ్య! నీ పరిచయ భాగ్యమును గల్గింపుము."

ఆహా ఇది అయోధ్యయా! నేను పరమపావన మగు నా స్వామి యొక్క నగరమును చేరితినా! నిత్యము నా ప్రభువు గుణగాన మొనరించు భరతుడవు నీవే యని నాకు తోచు చున్న దని ఆంజనేయుడు పల్కెను.

"అవును నాయనా! అధముడ నగు ఆ భరతుడను నేనే యని దుఃఖించుచు ఈ పాపాత్ముని కారణముననే శ్రీ రామచంద్రుడు పదునాల్గు సంవత్సరము లరణ్యవాస మొనరించుటకు వెడలిపోయెను. నా కారణము వలననే మా తండ్రి పరలోకగతుడయ్యెను. జనకరాజకుమారి అనేక కష్టముల నను

భవింపవలసివచ్చెను. నేనే ఆ దురాత్ముడ నగు భరతుడను. శ్రీరామభక్తా! నేడు నీ దర్శనముచే పవిత్రుడనైతిని. నీ పరిచయమును దెలిపి నన్ను కృతార్థునిగ నొనరింపుము'' అని పలికెను.

మరల ఆంజనేయుడు భరతుని పాదములకు నమస్కరించి యిట్లు పలికెను. ''ప్రభూ! నేను శ్రీరామచంద్రుని దాసానదాసుడను; ఆంజనేయుడను. అంజనాదేవి నా తల్లి. వాయుదేవుడు నా తండ్రి. లంకాధిపతి యగు రావణుడు జానకిని హరించి అశోక వాటికలో బంధించెను. ప్రభువు సముద్రముపై సేతునిర్మాణ మొనరింపచేసి వానర భల్లూక సైన్యములతో లంకను జేరి యుద్ధమారంభించెను. నేడు మేఘనాథుడు ప్రయోగించిన శక్తిచే లక్ష్మణుడు మూర్ఛితుడయ్యెను. ఆయన కొఱకై సంజీవనిని తెచ్చుటకు నేను ద్రోణాచలమును చేరితిని. ఓషధులతో ప్రకాశించుచున్న ద్రోణాచలమును పెకలించి తెచ్చుచుంటిని. మార్గములో తమ దర్శనమగుట నా యదృష్టము. శ్రీరామచంద్రప్రభువు ఎల్లప్పుడు నీ గుణములను గానమొనరించుచుందును. నేడు నీ దర్శనముచే నేను కృతార్థుడనైతిని.

సోదరా! ఆంజనేయా! అనుచు దుఃఖించుచు భరతుడు ఆయనను తన వక్షఃస్థలమున హత్తుకొనెను. పవనకుమారా! నేను ప్రభువునకు సంబంధించిన యేకార్యమునకు కూడ పనికిరాని వాడనైతిని. పాపాత్ముడ నగు నావలననే ప్రభువు అనేక

కష్టముల ననుభవింపవలసి వచ్చెను. నావలననే లక్ష్మణుడు మూర్ఛితుడయ్యెను. ఇపుడుకూడ నేను శ్రీరామకార్యములో ఆలస్యమగుటకు కారణమైతి నని శ్రీభరతుడు వాపోయెను.

ఆంజనేయుని సమాచారమును తెలసికొని కౌసల్య, సుమిత్ర, వశిష్ఠుడు మొదలగువారు ఆప్రదేశమున కరుదెంచిరి. సుమిత్రాదేవి ఆంజనేయునితో నిట్లుపల్కెను. "ఆంజనేయా! శ్రీరామచంద్రునితో నామాటగా నిట్లుచెప్పుము. లక్ష్మణుడు తన కర్తవ్యమును పరిపాలించెను. ఇందులకు నేనెంతయో ప్రసన్నురాల నగుచున్నాను. సేవకుడు ప్రభుని సేవలో ప్రాణములను సహితము త్యాగమొనరింపవలెను. లక్ష్మణుడు లేకున్నను సీత లేని శ్రీరామచంద్రుని ఆగమనమును నేను సహింపలేను."

కౌసల్యాదేవి యిట్లుపల్కెను. "పవనకుమారా! ఈమె చెప్పిన వాక్యములను శ్రీరామునితో చెప్పకుము. ఈమె శ్రీరాముని తనప్రాణములకంటె అధికముగ ప్రేమించెను, అందువలన ఈమెకు శ్రీరాముడు తప్ప అన్యులెవరు గోచరింపరు. నీవు శ్రీరామునితో నామాటగ నిట్లు చెప్పుము. రామా! నీవు అయోధ్యను వీడుసమయమున లక్ష్మణుని వెంటనిడుకొని వెళ్ళినట్లే తిరిగి వచ్చుసమయమున లక్ష్మణునితో కలసి రావలయును. లక్ష్మణుడు లేనిదే నీ వయోధ్యకు రారాదు."
పవనాత్మజునితో కౌసల్యాదేవి మాటలాడుచున్న సమయము

లోనే సేనాపతి యొక్క ఆదేశానుసారముగ అయోధ్యా నగర విశాలసైన్యము లంకను ముట్టడించుటకు సమావేశ మయ్యెను. సముద్రమువలె గోచరించుచున్న ఆ సైన్యమును గాంచి ఆంజనేయస్వామి ఆశ్చర్యచకితుడయ్యెను.

సర్వసైన్యాధిపతి లంకపై దాడివెడలుటకు అనుజ్ఞ నొసంగవలసినదిగ ప్రార్థింపదొడంగెను. వాని ప్రార్థనను విని కులగురువైన వశిష్ఠ మహర్షి యిట్లు పల్కెను: "చక్రవర్తి యొక్క సైన్యము ఇక్లే యుండవలెను. ధర్మోల్లంఘనము జరుగరాదు. ఈ పరిస్థితులలో శత్రుఘ్నుడైనను ఆ ప్రదేశము నకు వెడలుట ఉచితముకాదు. ఇక యీ సైన్యముమాటయేమి? శ్రీ రఘునందనుడే ఒంటరిగా అవనిపైగల రాక్షసుల నందరిని సంహారించుటలో సర్వసమర్థుడు.

శ్రీరామచంద్రుని సంక్షిప్తసమాచారము నందలు ఆల కించిరి. లక్ష్మణుని కొఱకై దీనాతిదీనముగ దుఃఖించుచున్న కరుణాభరిత మగు శ్రీరామునిదశ చూడగనే అందఱి నేత్ర ములు అశ్రుభరితము లయ్యెను. రాత్రి గడచి పోవుచుండెను. ఆ విషయమును గ్రహించిన భరతు డిట్లుపల్కెను. "వీరహను మానుడా! నీవు నా బాణముపై గూర్చుండుము. నా బాణము నిన్నిక్షణమందే ప్రభుని చెంతకు చేర్చగలదు. క్షణమైనను ఇక ఆలస్యము కారాదని పల్కెను. "ఏమి ! ఈ బాణము పర్వత సహితముగ నున్న నాభారమును భరింపగలదా" యని ఆంజ నేయుడు తనలో శంకించెను. ఈ మహానుభావుడు వదలిన మొనలేని బాణముచే నేను మూర్ఛిల్లితిని. శ్రీరామచంద్రుని

కృపవలన అంతయు సంభవమే అని ఆలోచించి శ్రీ ఆంజనేయుడు అంజలి ఘటించినవాడై భరతునితో 'రామానుజా! ప్రభువుయొక్క ప్రతాపముతో నీ యాశీర్వచనముతో ఈ క్షణమే నేను రణరంగమును చేరగల'నని పలికెను. తదనంతరము భరతుని చరణారవిందములకు ప్రణమిల్లి వాయునందనుడు వాయువేగముతో ఆకాశమున కెగిరెను.

రణరంగములో రాత్రి అధికముగ గడచుట గాంచి శ్రీరాముడు అధైర్యమును పొందినవాడై దుఃఖించుచు ఇట్లు పలుకనారంభించెను. నా ప్రియసోదరుడు లక్ష్మణుడు నా కొఱకై తల్లిని, తండ్రిని, భార్యను మాత్రమేగాక సకలరాజ భోగములను, సుఖములను త్యాగమొనరించెను. నన్ను సేవించుటకు, సుఖింపజేయుటకు అరణ్యములందు శ్రమించెను. అట్టి త్యాగమూర్తియైన లక్ష్మణుడు లేకుండగ అయోధ్య కెట్లు మరలిపోగలను? వైదేహి లభించినను లక్ష్మణుడు లేనిదే నేనెట్లు జీవింపగలను? ప్రాణప్రియుడైన నాసోదరుడు లేనిచో నిశ్చయముగ నేను ప్రాణములను త్యజించెదను. తదనంతరము నా ముప్వురు తల్లులు, భరతుడు, శత్రుఘ్నుడు, సీత జీవింపరు. ఈ విధముగ అయోధ్య సర్వనాశము కాగలదు. నేను లేని కారణమున సుగ్రీవుడు, అంగదుడు మొదలగు వానరవీరులందఱు పోరును విరమించి కిష్కింధకు వెడలగలరు. కాని విభీషణునకు నే నొసంగినవచన మేమి కాగలదు? విభీషణుడు నన్నాశ్రయించెను. నాకు శరణాగతుడయ్యెను. పరమభక్తుడైన

విభీషణునకు నే నొసంగినమాట చెల్లింపలేక పోయెదనేమో
యని నా హృదయము భీతిల్లుచున్నది.

లీలామానుష విగ్రహుడు, భగవంతుడు నగు శ్రీరాఘ
వేంద్రుని నయనముల నుండి అశ్రువులు ప్రవహింపనారం
భించెను. కరుణాభరిత మగు ఆయన విలాపమును గాంచి
వానర భల్లూకవీరులు అధైర్యముచెంది విలపింప నారంభించిరి.
వారు దుఃఖించుచు మాటి మాటికి ఆకసము వంక చూచు
చుండిరి. ఆంజనేయస్వామి వచ్చు నేమో యనివారి యాశ.
సూర్యోదయసమయ మాసన్నమగుచుండెను. వానర వీరు
లందఱు నిరాశాహృదయులైరి. సూర్యునివలె ప్రకాశించు
చున్న ఓషధిపర్వతమును హస్తమునందు ధరించి 'జయ శ్రీ
రామ' యని జయ జయారావములను పలుకుచు ఆంజనేయుడు
ఆకాశమార్గమున ఆ ప్రదేశమును చేరెను. పర్వతమును ప్రక్క
నుంచి మారుతి శ్రీరామచంద్రుని చరణములపై బడెను.
వానర వీరుల యానందమునకు మేరలేదు. వారందఱు ఆంజ
నేయుని వివిధ రీతులతో కీర్తింపనారంభించిరి. ఇంతలో సుషే
ణుడు పర్వతమునుండి సంజీవని దెచ్చి లక్ష్మణునకు వాసన
చూపించెను. నిద్రనుండి మేల్కాంచుచున్నట్లు లక్ష్మణుడు
లేచినవాడై యిట్లుపల్కెను. "మేఘనాథు డెక్కడ? వానికి
మరణమాసన్నమైనది.

మూర్తీభవించిన కృతజ్ఞతలో శ్రీ రఘునాథుడు ఎంత
గనో ప్రసన్నుడై ఆంజనేయుని తన వక్షఃస్థలమునకు హత్తుకొని
యిట్లుపల్కెను.

శ్లో॥ మారుతిం ప్రాహ వత్సాద్య త్వత్ప్రసాదాన్మహాకపే।
నిరామయం ప్రపశ్యామి లక్ష్మణం భ్రాతరం మమ॥
(అధ్యాత్మ రామాయణం 6-7.8)

వత్సా! మహాకపీశ్వరా! నేడు నీ కృపావిశేషము వ
వనే నేను నా సోదరుడైన లక్ష్మణుని నిరామయునిగ గాం
గల్గుచున్నాను.

వజ్రాంగబలి యగు ఆంజనేయుడొనరించిన యీ మహ
త్తర కార్యమును శ్రీరాముడు, పునర్జీవితుడును పొందిన లక్ష్మ
ణుడు ప్రశంసించుటయేగాక వానరభల్లూక వీరులందరును
నోళ్ళ పొగడనారంభించిరి. కాని అభిమానశూన్యుడైన ఆం
నేయుని హృదయములో ఎట్టి అహంకారము కలుగలేదు. తా
నేమియు చేయనివానివలె ఆయన మిన్నకుండెను. అంతయు
చేయువాడు మరియొకడు కలడని, ఆయనయే అఖిలాండకోటి
బ్రహ్మాండనాయకుడైన శ్రీరామచంద్రుడని, తాను కేవలము
నిమిత్తమాత్రుడనని ఆంజనేయుని భావము. అతడు ఒంటరిగా,
అందరినుండి దూరముగ నుండి మనస్సులో అరుణకమలముల
వలె ప్రకాశించు సుకోమలములగు ప్రభువుయొక్క చరణా
వింద ధ్యానములో లీనుడయ్యెను.

ఇది శ్రీకృష్ణపరమాత్మ చరణారవిందమిళిందాయమా
మానసత్వ మహావైభవ సంపన్నుడు శ్రీ మట్టుపల్లి వేంకట
మహాలక్ష్మి జగన్నాథుల తనూభవుడు భక్తజన దాసాను
దాసుడు సుజన విధేయుడు నగు శివ సుబ్బారాయ గుప్త చే
ప్రణీతంబైన శ్రీ హనుమద్భాగవతమందు పూర్వ భాగము
సమాప్తము.

శ్రీ హరిః ఓం తత్సత్

